

శ్రీశైలంవద్ద పాతాళగంగ తీర్థం
ఫొటో డబ్ల్యు రఘుగా—కర్నూలు.

# పాఠకలోకంపై పన్నీటిజల్లు!

★ వినాయక చవితికి ★

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రిక



# హాస్యసంచిక



నవ్వు ఆనందానికీ, ఆరోగ్యానికీ పర్యాయపదం. హాస్యం అనేకవిధాలుగా ఉంటుంది. పల్లెటూరిహాస్యం ముతక; బస్తీహాస్యం మెతక. కోర్టుల్లో జడ్జీలు, లాయర్లు, ముద్దాయిలు; ఆస్పత్రుల్లో డాక్టర్లు, రోగులు; పాఠశాలల్లో మేష్టర్లు, విద్యార్థులు, ఒకరిమీదఒకరు ఛలోక్తులు విసురుకుంటారు. ఇంట్లో భార్యాభర్తలు, బావామరదళ్లు, బావామరుదులు, పెళ్లిళ్లలో వియ్యాలవారు వేళాకోళా లాడుకుంటారు. రాజకీయాల్లో, సాహిత్యంలో, నాటక రంగస్థలాలమీద హాస్యప్రియులుగా ప్రసిద్ధికెక్కిన ప్రముఖు లెందరో ఉన్నారు. హాస్యానిది జీవితంలో విశిష్టస్థానం.

తెలుగులో హాస్యరచనలను ప్రోత్సహించే ఉద్దేశంతో ఈ ఏడాది ఆంధ్ర వారపత్రిక వినాయకచవితి [28-8-57] సంచికను హాస్యసంచికగా ప్రచురిస్తున్నాము. సంచిక ఆసాంతం హాస్యం ఉట్టిపడేలా చేయాలని మా ఆశయం.

హాస్యరసప్రధానమైన కథలు, నాటికలు, వ్యాసాలు, గేయాలు, ఛలోక్తులు, వేళాకోళాలు, ఇవికాక దైనికజీవితానికీ, రాజకీయాలకూ సంబంధించిన కార్టూన్ చిత్రాలు ప్రచురిస్తాము. వనితాలోకం, బాలసాహితి, సినిమాశీర్షికలలో కూడా అన్నీ హాస్యరచనలే ప్రచురిస్తాము. ఆంధ్ర రచయితలు, ముఖ్యంగా హాస్య రచయితలు మా ఆశయం జయప్రదంగా నెరవేరడంలో సహకరిస్తారని విశ్వసిస్తున్నాము. వేళాకోళమాడడం తెలుగు ఆడబడుచులకు వెన్నతో పెట్టిన విద్య. అందుచేత వనితల సహకారానికి ఇదే మా ప్రత్యేక విజ్ఞప్తి.

హాస్యసంచికకు రచనలు పంపేవారు ఆగస్టు 1 వ తేదీకే మాకు అందేలా "సచిత్ర వారపత్రిక హాస్యసంచికకు" అని వ్రాసి పంపించాలి. కథలైనా, నాటికలైనా, వ్యాసాలైనా వారపత్రికలో మూడు పేజీలకు మించకూడదు. కార్టూన్ చిత్రాలు డ్రాయింగ్ పేపరుమీద ఇండియన్ ఇంక్‌తోనే వేసిపంపాలి.

### ఒక ముఖ్యమైన గమనిక

వినాయకచవితి హాస్యసంచిక కవరుపేజీ విషయమై ఒక చిన్న సవరణ చేస్తున్నాము. కవరు పేజీకి వినాయకునికి సంబంధించిన సన్నివేశంకాక, చిత్రకారులు తమకుతోచిన ఏహాస్య సన్నివేశమైనాసరే తీసుకుని వర్ణచిత్రం పంపవలసిందిగా విజ్ఞప్తి. కవరుపేజీకి అంగీకరించిన చిత్రానికి రూ. 50/- పారితోషిక మిస్తాము. [సైజు 8" X 11".]

సంవత్సర చందా
రు. 13-0-0
విడిపత్రిక 25న.పై.



సచిత్రవారపత్రిక
Founder : K. NAGESWARA RAO

సంపుటము 51
సంచిక 42
19-6-57

హేవిళంబి జ్యేష్ఠ బహుళ సప్తమి బుధవారం



# విషయానుక్రమణిక


ముఖచిత్రం : మినర్వాపిక్చర్సవారి "సారంగధర"లో భానుమతి.



# ఏటా నాలుగుకోట్ల పైగా

# మానవకోటి పెరుగుదల

# జనాభా సమస్యా పరిష్కారం

నిమిషానికి 170 మంది పుడుతున్నారు. నిమిషానికి 90 మంది చనిపోతున్నారు. రోజుకి 2,44,800 మంది చొప్పున కొత్త జనాభా వస్తుంటే, 1,29,600 చొప్పున పాతజనాభా వెళ్లిపోతోంది. మొత్తంమీద రోజుకి దగ్గిరదగ్గిరగా లక్షా ఇరవై వేలమంది చొప్పున ప్రపంచ జనాభా పెరిగిపోతోంది. ఇదే రేటున జనాభా పెరుగుతూ ఉంటే ఈ ఇరవయ్యో శతాబ్దం ఆఖరయ్యేటప్పటికి, ఇప్పుడున్న 270 కోట్ల జనసంఖ్యా రెట్టింపై ఊరుకుంటుంది.

ఐక్యరాజ్యసమితి ఈమధ్య 200 దేశాల్నీ, ప్రాంతాల్నీ పరిశీలించి ఈ లెక్కలు తయారుచేసింది అన్నిచోట్లకంటే వేగంగా జనాభా పెరిగేది దక్షిణ అమెరికా దేశాల్లోనట. అక్కడ ఏడాదికి 44 లక్షల చొప్పున జనం పెరుగుతున్నారు. పెరుగుదల వేగం కాకుండా అంకెల్నిబట్టిచూస్తే ఎక్కువ పెరిగేది ఆసియాలో. ఇప్పటికే ప్రపంచంలో సగానికిపైగా ఆసియాఖండంలో ఉన్నారు. ఈ జనాభా ఏడాదికి 2 కోట్ల 40 లక్షల చొప్పున పెరుగుతోంది.

## భూగోళంమీద 'క్యూ'

జనాభాలో అగ్రతాంబూలం చైనా దేశానిది చైనా జనాభా 58 కోట్ల 26లక్షల చిల్లర. వీరుకాక ఇంకా ఇతర ఆగ్నేయాసియా దేశాల్లో ఉన్న చైనాజాతి జనాభా మళ్లీ కొన్నికోట్లు ఉంటుంది. వెనకటికి ఒక ఆసామీ ఇలా చెప్పాడు: ఒకచోట మనం నుంచుని చైనా జాతీయుల్ని మనముందునుంచి వరసగా క్యూ పద్ధతిలో నడిపిస్తే ఆ క్యూ ఎప్పటికీ తరగదట. ఆఖరి చైనామనిషి మన ముందునుంచి దాటిపోగానే వాడి వనకాలే మొట్టమొదటి చైనామనిషి సిద్ధంగా ఉంటాడు. అంటే భూగోళ వైశాల్యం మీద వరసగా నుంచోపెట్ట దగినంత మంది చైనావారున్నారన్న మాట. అలా చూస్తూ ఉంటే జనాభా పెరిగి భూమి వైశాల్యం కూడా వారికే చాలక పోవచ్చును. ఇది తమాషాగా కనిపించినా ఇందులో నిజమున్నది.

మరో 50 ఏళ్లలో చైనా జనాభా ఇప్పటి ప్రపంచ జనాభా (270 కోట్లు) అంత అవుతుందని ప్రసిద్ధ చైనీస్ ఆర్థికవేత్త ప్రొ॥ మాయింగ్ చూ మొన్ననే అంచనా వేశారు.

తరవాత పెద్ద జనాభా కలిగిన దేశం మనదే. భారతీయుల సంఖ్య 35,68,79,394. తరవాత పెద్ద జనాభా గలదేశం సోవియట్ యూనియన్.

## కూడూ, గూడూ, గుడ్డా

ఈ లెక్కలు చూస్తుంటే గాబరా పుడుతుంది రోజుకి లక్షా ఇరవైవేల చొప్పున పెరిగిపోతున్న ఈ జనాభా అంతటికీ తగినంత ఆహారం లభిస్తోందా? ఉండడానికి ఇల్లు, కట్టుకోటానికి బట్టా లభిస్తున్నాయా? జబ్బు చేస్తే మందూ మాకూ, బ్రతకటానికి అవసరమైన విద్య లభిస్తున్నాయా? ఈ ప్రశ్నలు ముఖ్యంగా భారతదేశానికి సంబంధించినంత వరకూ అభివృద్ధికి అడ్డుగోడల్లా నిలబడిన గడ్డు ప్రశ్నలు జీవన ప్రమాణాల్లో మనది అసలే వెనకబడిన దేశం. మనం పండించే ఆహారం ఉన్న జనాభాకే చాలక ఇతర దేశాల నుంచి దిగుమతి చేసుకుంటున్నాము. మొత్తంమీద చూస్తే ఉత్పత్తి పెరుగుతూనే ఉంది కాని ప్రజోత్పత్తి ఇంకా ఎక్కువగా పెరుగుతున్నది జనం పెరుగుతున్న కొద్దీ జీవన ప్రమాణాలు తిరుగుతున్నాయి. ఎంత ఎక్కువ ఉత్పత్తి చేస్తే మన జనాభాకి తగిన సదుపాయాలేర్పడి, జీవన ప్రమాణం పెరిగేటట్లు? ఇదే ఈ నాడు మన ప్రభుత్వాన్ని, ఆర్థిక వేత్తలను ఎదుర్కొంటున్న సమస్య.

## జనాభా, జనాభావం

జీవన ప్రమాణానికీ, జనాభాకీ పరస్పర సంబంధం ఉందని అంటారు. జనాభా పెరగడం వల్ల జీవన ప్రమాణం తగ్గడమే కాదు. జీవన ప్రమాణం తగ్గడంవల్ల కూడా జనాభా పెరుగుతుందని దీని అర్థం. జీవన ప్రమాణం బాగా తక్కువగా ఉన్న ఆసియా దేశాల్లో జనాభా పెరుగుతుంటే, జీవన ప్రమాణం ఎక్కువగా ఉన్న పాశ్చాత్య దేశాల్లో జనాభా తగ్గిపోవడం, కనీసం అట్టే పెరగక పోవడం సంభవిస్తోంది. జీవన ప్రమాణం చాలా ఎక్కువగా ఉన్న ఆస్ట్రేలియా లాంటి దేశాల్లో జనాభా పెరగడం లేక పోగా, జనాభావం కూడా ఏర్పడుతోంది. ఇంతెందుకు? సాధారణంగా కుచేల కుటుంబాల్లో పిల్లలసంఖ్య అధికంగా ఉండడం, కుబేర కుటుంబాల్లో తక్కువగా ఉండడం మన మెరిగినదే "అనగనగా ఒకరాజు; ఆ రాజుకు లేక లేక ఒక కొడుకు పుట్టాడు" అనేమాట బహుశా ఇందుకే వాడుకలోకి వచ్చి ఉంటుంది

## "ఆలస్యాత్ విషమమృతం"

మనదేశంలో ఇంత విరివిగా ప్రజోత్పత్తి కావడానికి కారణం ఏమిటి? మనలో కొన్ని మూఢాచారాలున్నాయి. ఆడపిల్లకి పన్నెండో ఏడు, మగపిల్లవాడికి పదహారో ఏడు రావడం ఆలస్యం, తల్లిదండ్రులు ఎంతో నేపూ పెళ్ళి చూపులమీదే ఉంటారు. ఆడపిల్లని ఎంత త్వరగా వదుల్చుకుందామా అని, అబ్బాయి చదువుకుంటుండగానే పెళ్ళిచేసి కట్నం రాబట్టాలని యోచనలు చేస్తారు. ఈ బాల్య వివాహాల వల్ల ఎన్నో నష్టాలు కలుగుతున్నాయి. ఆడపిల్ల ఈడేరగానే పెళ్లాడడం, నీళ్లాడడం తప్ప వేరే పనేమీ లేకపోవడమే దీనికి కారణం. స్త్రీలు ఉన్నత విద్య అభ్యసించడం, ఉద్యోగాలు చేయడం అధికమైన రోజున బాల్య వివాహాలు క్రమంగా తగ్గిపోతాయి. చదువుకున్న స్త్రీ, ముఖ్యంగా ఉద్యోగం చేస్తున్న స్త్రీ తన కుటుంబాన్ని నియమితం చేసుకోవడానికి ప్రయత్నిం తే



“పదపదమున ప్రభవించును
నిర్భీకం, నిశ్శోకం
నవలోకం, ఒకనాకం!”

అమెరికన్ సమాచారశాఖ మద్రాసులో ఈ నెల పదవ తేదీన ప్రారంభించిన “మానవ కుటుంబం” ఛాయాచిత్రప్రదర్శనంలో (డబ్ల్యు. యూజినిస్మిత్ తీసిన) ఒక ఫొటో.

# ★ జనాభాసమస్యా పరిష్కారం ★

అవకాశాలెక్కువ. కుటుంబ నియంత్రణాన్ని వ్యతిరేకించే స్త్రీలు ఎక్కువగా విద్యా విజ్ఞానాలు లేనివారిలోనే ఉంటారు. ఎంత ఎక్కువమంది పిల్లల్నికంటే అంత ఉత్తమ ఇల్లాలని, పిల్లలెక్కువ పుట్టకుండా గర్భనిరోధ ప్రక్రియలు చేయడం తప్పనీ వీరిలోనే ఎక్కువమంది నమ్ముతారు. దీన్ని బట్టిచూస్తే, ఆలస్యంగా పెళ్లాడి, ఆలస్యంగా పిల్లాడే పద్ధతిని ప్రోత్సహించడం మన దేశంలో ఎంతైనా అవసరంగా కనిపిస్తోంది. దీనికి దోహదంగా స్త్రీ విద్యను, ఉద్యోగాలను కూడా ప్రోత్సహించాలి. కట్నాలకు పెట్టే డబ్బుతో ఆడపిల్లలను చదివించి, వారి కాళ్లమీద వారు నిలబడే అవకాశాన్ని తల్లిదండ్రులు కలిగించాలి. పాశ్చాత్య దేశాల్లో పురుషులతో సమానంగా స్త్రీలూ చదువుకుని, ఉద్యోగాలు చేస్తారు కనుకనే, వారు ఆలస్యంగా పెళ్లాడడం, కుటుంబాన్ని పరిమితం చేసుకోవడం జరుగుతోంది.

## పల్లెలలో ప్రచారం

కుటుంబ నియంత్రణ కార్యక్రమానికి రెండవ ప్రణాళికలో భారత ప్రభుత్వం కొన్ని చర్యలు తీసుకోవడానికి నిశ్చయించింది. ఆ కార్యక్రమాన్నిగూర్చి ప్రజల్లో విరివిగా ప్రచారం చేయడానికి ఏర్పాట్లు చేస్తోంది. ఈ ప్రచారం ముఖ్యంగా పల్లెటూళ్లలో ఎక్కువగా జరగాలి. సుశిక్షితులైన వారిని పల్లెటూళ్లకు పంపించి, ప్రజలకు నచ్చే విధంగా, సులభంగా ఆచరించడానికి వీలయ్యేపద్ధతులను ప్రచారం చెయించాలి. ప్రభుత్వ స్థాయిలో జరిగే ఈ చర్యలకు ప్రజల సహకారం లేనిదే ఏమీ లాభం లేదు. కుటుంబం సైజు పెరిగినకొద్దీ తమ జీవనప్రమాణం పడిపోతుందనే భయం ప్రజలకు కలిగి, అందుకు అవసరమైన పద్ధతులను అనుసరించేందుకు ముందుకు రావాలి.

## ఉత్పత్తికి నిష్పత్తి

పైన చెప్పినదంతా సమస్యాపరిష్కారంలో ఒక భాగం మాత్రమే. అంతకంటే ముఖ్యమైనది దేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధి చేయడం. ఆహారోత్పత్తి ఎక్కువచేయాలన్నా, నిరుద్యోగాన్ని నివారించి జీవన ప్రమాణాన్ని ఎక్కువ చేయాలన్నా, జనాభా సమస్యను పరిష్కరించాలన్నా అన్నిటికీ తారకమంత్రం పారిశ్రామికాభివృద్ధే. ఆహారోత్పత్తిని అధికం చేయడానికి పాతపద్ధతులిప్పుడు లాభం లేదు. నవీన యంత్రాల సహాయంతో భారీ ఎత్తున వ్యవసాయం సాగిస్తేగాని అధిక జనసంఖ్యగలిగిన మన దేశంలాంటి దేశాల ఆకలి తీరదు.

ఆధునిక వ్యవసాయపద్ధతులను ఊహించలేని 1798 ప్రాంతంలో మాల్తస్ అనే ఆర్థిక శాస్త్రవేత్త ఒక జనాభా సిద్ధాంతం లేవదీశాడు. జనాభా 1,2,4,8,16,32 నిష్పత్తిలో పెరుగుతుందనీ, ఆహారోత్పత్తి 1, 2 3, 4, 5, 6 నిష్పత్తిలో పెరుగుతుందనీ, కనక జనాభా పెరుగుదలను అదుపులో పెట్టకపోతే ఆహారం కరువై కొట్లాటలూ, యుద్ధాలు, రోగాలూ సిద్ధిస్తాయని అతని సిద్ధాంతం. కాని నిజంగా అతడు చెప్పినట్లు జరగలేదు. పాశ్చాత్య రాజ్యాలు పారిశ్రామికంగా అభివృద్ధి అయ్యాయి. వ్యవసాయాన్ని యంత్రసహాయంతో సాగించి ఆహారం పండించుకున్నాయి. జీవన ప్రమాణం అధికం చేసుకున్నాయి. యాంత్రిక వ్యవసాయం అమల్లోఉన్న అమెరికా ఇందుకు మంచి ఉదాహరణ. దేశంలో అందరికీ సరిపోగా, ఇతర దేశాలకు ఎగుమతి చేయగా, సముద్రంలో పారబోయడానికికూడా చాలినంత ధాన్యం అమెరికా ఉత్పత్తి చేస్తోంది. దీనికి కారణం భారీ

(56-వ పేజీ చూడండి)

# ★ నేటి విద్యార్థుల తారకమంత్రం ★

# 'తమసోమాజ్యోతిర్గమయ'

"విటమిన్లు (Vitamins) అంటే వియత్నాం దేశీయులు" — ఇదీ యూనియన్ పబ్లిక్ సర్వీస్ పరీక్షలకు హాజరైన అభ్యర్థి విటమిన్లను గూర్చి వెల్లడించిన అమూల్యాభిప్రాయం.

ఒకనాడు ఒక కుర్రాడి సిరా మరో కుర్రాడు ఒలకపోశాడు. అందుకు ఆ కుర్రాడు, "నా సిరా నాకు తెచ్చియ్యి" అన్నాడు. అప్పుడు సిరా పారపోసిన కుర్రవాడు, "నేను నీళ్లు తెచ్చియిస్తా, నీవు సిరా మందు తెచ్చి కలుపుకో" అన్నాడు. చూడండి యెంత అమాయికతో! ఇది పిల్లల విషయంలో కొబట్టి అమాయకత అనుకొంటున్నాము. అదే పెద్దల్లో అయితే గడసరితనం అనుకుంటాము. అమాయికతకు మరో పేరు "తెలియనితనం" అని చెప్పుకోవచ్చు. ఈ అమాయికతకు పిన్నా, పెద్దా అన్న వివక్షత లేదు; నాగరికుడు, అనాగరికుడు అన్న తేడా లేదు; చదువుకున్న వాడు, చదువుకోని వాడు అన్న భేదం లేదు. అమాయికత అనేది కొద్దో గొప్పో ప్రతివారిలోను ప్రత్యక్షమవుతూనే వుంటుంది. ఆయా వ్యక్తుల్ని బట్టి అమాయికతకు మనం చెప్పుకునే అర్థం మాత్రం మారుతుంది. ఈ అమాయికత విద్యావంతుల్లో అయితే అజ్ఞానం క్రింద జమ కడతాము.

## అస్తమానం అ ఆ లే

ఒకసారి ఒకపిల్లాడు బళ్ళోకి వెళ్లనని తల్లితవద్ద మారాం చేస్తున్నాడట! తల్లి యెందుకు వెళ్లవురా అని అడిగితే, "మాష్టారికి యేమీ రావమ్మా, ఎప్పుడూ అ ఆ లే రాసి పెడతాము" అన్నాడట. ఇదినిజంగా పసిపిల్లల అమాయికత. అ ఆలు తనకు రాలేదనీ, అందువల్లనే అస్తమానం అ ఆలే రాసిపెడుతున్నారని పాపం ఆ పిల్లవానికి తెలియదు. ఈ అమాయికతకు మనం ముసిముసి నవ్వులు నవ్వుకుంటాము. ఇది ప్రమాదం లేని అమాయికత. ఒకసారి ఒకామె భర్తతో అంటున్నది: "చూశారండీ ఆ బండపంతులు పసిబిడ్డను యెలా చావగొట్టాడో! సూర్యుడికీ, భూమికీ మధ్య యెంతదూరమని అడుగుతాడట. వాడేమన్నా కొలిచాడటండి ఎంతదూరమో చెప్పటానికి? ఆపంతుల్ని మాత్రం చెప్పమనండి చూద్దాం. మొన్నొకనాడు యిట్లాగే బుద్ధుడు యెప్పుడు పుట్టాడని అడిగాడట! బుద్ధుడు యెప్పుడు పుట్టాడో మనకే తెలియదాయె; ఇక నిన్న కాక మొన్న పుట్టిన ఆ పసికందుకు యేమి తెలుస్తుంది చెప్పండీ" అని. ఈ అమాయికతను విద్యావిహీనత వల్ల కలిగిన అమాయికతగా

## రాజశ్రీదేవి

మనం పరిగణించాలి. ఈవిధమైన అమాయికతే కూడా క్షంతవ్యమే. కాని విద్యావంతుల్లోని అమాయికత మాత్రం యెన్నటికీ క్షంతవ్యం కాదు. ఒకసారి స్కూలుఫైనలు పాసయిన ఒకసోదరిని, "శేషానికీ, సశేషానికీ తేడా యేమిటి?" అని అడిగాను. "శేషమంటే మిగిలింది; సశేషమంటే అయిపోయింది" అన్నదిఆమె పుటుక్కున. హతోస్మి అనుకున్నా.

## ఆడా, మగా తేడా

ఇటీవల ఇంటరు పరీక్ష వ్రాసివచ్చిన ఒక విద్యార్థి, "మనకు రాజకుమారి అమృతకౌర్‌ని గవర్నరుగా వేస్తామంటే నాకు ఒద్దన్నాడటగా?" అని అంటున్నాడు. నాకు నవ్వు ఆగిందికాదు. రాజకుమారి అమృతకౌర్ అంటే అతని వుద్దేశంలో మగవాడని. "పేరులోనే వుంది కదా కుమారి అని; అటువంటప్పుడు మగవాడని యెలా అనుకోనివుంటాడు?" అని బుద్ధిమంతులు కొందరు ప్రశ్నించవచ్చు. నిజమే; కుమారి అని లేకపోతే మగవాడని అనుకున్నా ఒకవిధంగా సరిపెట్టుకోవచ్చు. కుమారి అని వున్నా మగవాడని అనుకోబట్టే యింతగా అనుకోవలసివచ్చింది.

## వంక్కికి మక్కి

గత సంవత్సరం ఒక బి. ఎ. విద్యార్థి లెఖ్ఖలపరీక్ష వ్రాస్తున్నాడు. ఎలాగో మొత్తంమీద అతనికి కాపీ అందింది. ఆకాపీ అందించిన వ్యక్తి, ఆ కాగితంమీద లెఖ్ఖను కొంతవరకు చేసి చివరకు "Integrate" అని వ్రాసి వదిలేశాడట! అంటే 'Integration' ఆ విద్యార్థి స్వయంగా చేసుకోగలడని అతని వుద్దేశం. కాని ఆ విద్యార్థికూడా ఆ కాగితంమీద యెంతవరకు లెఖ్ఖచేసివుందో అంతవరకూ చేసి తరువాత ఆ కాగితంమీద వున్నట్టే 'Integrate' అని వ్రాసి చక్కా వచ్చాడట!! బి. ఏ. చదువుతున్న ఆ విద్యార్థికి, లెఖ్ఖ పూర్తి అవటానికి యింకా Integration చేయవలసివుంది అన్న యింగిత జ్ఞానం కూడ లేకపోయింది. ఈ అమాయికతకు మనం ఆహ్లాదకరంగా నవ్వలేము. నీరసంగా నవ్వుతాము; కాకపోతే విచారిస్తాము "అంటువంటి అమాయకులు రక్షింపబడుదురు గాక" అనుకొంటాము.

ఒకసారి నేను భూదానోద్యమాన్ని గూర్చి ఒకవ్యాసం వ్రాస్తూ, భూదానోద్యమ స్వరూప స్వభావాలు విద్యార్థులకు— ముఖ్యంగా విద్యార్థినులకు— తెలియవు" అని వ్రాశా. దానిని చూసిన ఒక బి. ఎ. సోదరికి నామీద కోపంవచ్చిందట. నిజమాడితే నిష్ఠూరమేమరి. కాని ఆమెస్నేహితురాలే— బి. ఎ. చదువుతున్న యువతి— "వినోబా రాజమండ్రి వాస్తవ్యుడు" అని వ్రాసింది. అలా అని ఆమెకు యెవరు చెప్పారో యేమో మరి విద్యార్థుల్లో యింత అమాయికత— అజ్ఞానం — కరుడుకట్టుకొని వుండగా యూనియన్ పబ్లిక్ సర్వీస్ పరీక్షలకు వెళ్ళిన అభ్యర్థులు "విటమిన్సు" అంటే వియత్నాందేశీయులని వ్రాశారంటే దానిలో అబ్బుర మేముంది? ★



రోజుకి అయిదులక్షల నయాపైసాలు తయారుచేసే హైదరాబాద్ టంకసాల

# ఆంధ్రరాజధానిలో నయాపైసాల టంకసాల

ఏప్రిల్ ఒకటో తేదీనుంచీ నయాపైసాలు చెలామణీలోకి వచ్చాయి. క్రమంగా పాతనాణాలు చెలామణీలోంచి పోయి అన్నీ నయాపైసాలే వస్తాయి. ఇలా జరగడానికి ఎన్నో కొత్తనాణాలు తయారవ్వాలి ముందు. ఇప్పుడు వీటిని మూడు టంకసాలలు తయారు చేస్తున్నాయి. ఈ మూడింటిలో హైదరాబాదు టంకసాల ఒకటి.

ఇటీవలి దాకా హైదరాబాదు సంస్థానంలో నిజాం నాణాలు చెలామణీ అవుతూండేవి. వీటిని ముద్రించడానికి ఈ టంకసాల సర్ సాలార్‌జంగ్ ప్రధానమంత్రిత్వ కాలంలో ఏర్పడింది. ఇప్పుడు నిజాం నాణాలు రద్దయిపోయాయి.

## నిజాం నాణాలు

హైదరాబాదు చరిత్రలో రాజటంకసాల ప్రసక్తి 1803 దాకా కనబడదు. అప్పుడు పరిపాలిస్తున్న మూడవ నిజాం నవాబు సికందర్‌జా ఒక టంకసాల ఏర్పరిచాడు. కొంతకాలానికి ఆటంకసాల ఎత్తివేయబడింది.

ఆ కాలంలో నాణాలను చేత్తోనే ముద్రించేవారు. అంచేత అవి అంత బావుండేవి కావు. నాణాలమీద అచ్చుకూడా సరిగ్గా పడేది కాదు. ఈ రాజ టంకసాలతోపాటు, ఇతర సామంత నవాబులు, జాగీర్దార్లు, షాహుకారు వేరే సొంత టంకసాలలు పెట్టుకుని, ఢిల్లీ పాదుషా పేరుతో తమపేరు కూడా జోడించి సొంతనాణాలు వేయించుకునేవారు. ఊరికే ఎక్కడచూసినా రకరకాల పేర్లతో, విలువలతో, లోహాలతో బోలెడన్ని నాణాలు కనపడుతుండేవి. అంతా నాణాలు ముద్రించేవారే అయితే వాటిని చెలామణీ చేసేదెవరుట? అందుకని వ్యాపారానికి చెడ్డ ఇబ్బందిగా ఉండేది. నాణాలు త్వరగా పాడై ఎందుకూ కొరగాకుండా ఉండేవి. ఇదేం బాగాలేదనుకొని 1857 లో అంటే నవాబు నసీర్ ఉద్ దౌలా కాలంలో ప్రైవేటు టంకసాలలన్నిటినీ రద్దుచేసేశారు. రాజటంకసాల ఒక్కటే నాణాలు ముద్రించేది.

1839 లో టంకసాలను దారుస్ షాఫాలో కేటాయించిన ఒక ప్రత్యేక భవనంలోకి



నాణాల లోహం కరిగించే 'మెల్టింగ్' శాఖ



లోహాన్ని చదునైన ముక్కలుగా తయారుచేసే 'రోలింగ్' శాఖ.

మార్చారు. (ఇప్పుడీ భవనంలో మునిసిపల్ కార్పొరేషను ఉంది.)

చేత్తో నాణాలు చేసేపద్ధతిని 1895 లో మానేసి, యంత్రాలను అమర్చారు. గుండ్రంగా చక్రంలా ఉండే "చక్కీ" నాణాలను ముద్రించడం ప్రారంభించారు.

## ఆధునిక పద్ధతి

1903 నుంచీ నాణాలను యూరపియన్ పద్ధతుల్లో ముద్రించడం మొదలైంది. టంకసాలను సయిఫాబాద్‌లోని భవనానికి మార్చారు. ఇప్పటికీ ఇది అక్కడే ఉంది. అక్కడ ఆధునిక ముద్రణ యంత్రాలు ఏర్పాటుచేశారు. ఈ యంత్రాలతో సహా ఆ టంకసాలకు మొత్తం రూ. 7,57,830 ఖర్చయింది. ఆ తరవాత కూడా కొత్త కొత్త యంత్రాలనుకొని చేరుస్తూ వచ్చారు.

ఈ రోజున హైదరాబాదు టంకసాలలో 860 మంది పనివారున్నారు. రోజుకు నాలుగున్నర లక్షలనుంచి ఐయిదు లక్షల దాకా నాణాలు తయారవుతాయి. ఇప్పుడు ఇక్కడ నయాపైసాలు మాత్రమే ముద్రిస్తున్నారు.

## నాణాల రకాలు

1858 దాకా నాణాలమీద నిజాం పేరుతోపాటు ఢిల్లీ చక్రవర్తి పేరు కూడా ఉండేది. 1858 హాలీసిక్కా నాణెం చెలామణీ లోకి వచ్చింది. ఢిల్లీ పాదుషా పేరు తొలగించబడింది. అప్పటితో హైదరాబాదు సంస్థానం ఢిల్లీకి సామంతరాజ్యంగా ఉండడం మానేసిందన్న మాట. నాణెంమీద నిజాం పేరు, వంశం పేరు, 92 అనే అంకె మాత్రమే ఉండేవి. 92 అనే అంకె ఎందుకుంటే, మహమ్మద్ ప్రవక్త నామాక్షరాల సంఖ్యల మొత్తం 92 అట. అందుకని దాన్ని కూడా ముద్రించేవారు.

## చార్మినార్ నాణాలు

1903 నుంచి చెలామణీలోకి వచ్చిన కొత్త నాణాలమీద చార్మినార్ ప్రతిమ ఉండేది. అప్పుడు పాలించే నిజాం నవాబు మహబూబ్ అలీఖాన్ పేరు మీదుగా ఆ నాణాలను మహబూబియా సిక్కా నాణాలనే వారు. 1911 లో ఇప్పటి నిజాం గద్దె నెక్కారు. అప్పటినుంచీ వాటిని ఉస్మానియా సిక్కా నాణాలనే వారు.

## దశాంశపద్ధతి

ఇపుడీ టంకసాల దశాంశ నాణాలను ముద్రిస్తోంది. టంకసాలలో వేర్వేరు పనులు చేసే శాఖలుంటాయి. నాణాలకు పనికి వచ్చే సరైన లోహాన్ని బులియన్ శాఖవారు మెల్టింగ్ (కరిగించే) శాఖకు పంపిస్తారు. అక్కడ లోహాన్ని కరిగించి చదునైన కడ్డీలుగా మూసపోస్తారు. ఈకడ్డీలను గోలర్లలో పెట్టి అవసరమైనమందంలో చదునైనముక్కలుగా చేస్తారు. ఈ ముక్కలను కావలసిన ఆకారంలో "పంచ్" చేస్తారు వాటిని వేడి



నాణాలు సరిగా ఉన్నాయో లేదో పరీక్షించే 'బులియన్' శాఖ.



బులియన్ శాఖకు పంపిస్తారు. అక్కడి వారు వాటిని మళ్ళీ జాగ్రత్తగా పరీక్షించుతారు. అప్పుడు వాటిని రిజర్వు బ్యాంకి తాలూకు వేర్వేరు శాఖలన్నిటికీ, ఏ శాఖ ఎన్ని కావాలని అర్డరు చేస్తే ఆ శాఖకు అన్నిటిని పంపిస్తారు.

హైదరాబాదులో ఇప్పుడు తయారయ్యేవి ఒక నయాపైసా నాణాలు. వీటిని రాగి, టిన్, జింక్ లోహాల మిశ్రమమైన కంచుతో తయారుచేస్తారు.

[ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచారశాఖ సౌజన్యంతో] 

లోహం ముక్కలకు మెరుగుపెట్టే 'ఎనీలింగ్' శాఖ.

# నయాపైసాల టంకసాల

చేసి, బాగా మెరుగు పెడతారు. ఈ పనిని "ఎనీలింగ్" అంటారు.

అలా వివిధాకారాల్లో తయారైన వాటి మీద నాణాల విలువను తెలిపే స్టాంపులను అచ్చొత్తుతారు.

## ఏక్ నయా పైసా

ఆ తరవాత ఆ నాణాలను మళ్ళా



కావలసిన ఆకారంలో 'పంచ్' చేసే శాఖ.





నాణెం విలువను తెలిపే 'స్టాంపు'ను అచ్చొత్తే శాఖ.

# అయితే అందగాడు కాకపోతే కురూపి

ఏమేవ్...ఏం చేస్తున్నావు?...ఎక్కడే...

ఎప్పుడూ వంట ఇంటిలోనే. చూడు వుత్తరం వచ్చింది. ఇదిగో గోపాలు ఇక్కడే వున్నాడు," అంటూ నాన్నగారు లోపలికి వచ్చారు. నన్ను బెజవాడ సబ్ కలక్టర్‌గా వేసారు. ఇది అవుత్తరం సారాంశం. నా ప్రొబేషన్ కాలం అయిపోయింది. ఒక పదిహేనురోజులు సెలవుపెట్టి ఇంటికి వచ్చాను. ఇప్పుడు బెజవాడయింది. నాన్నగారు అంటున్నారు అమ్మతో: "మరి I. A. S Pass అవటం అంటే ఏమిటనుకున్నావు? కలక్టర్ అయిపోయాడు. ఏనాటి అదృష్టమో అది," అని. సెలవు అయిపోగానే బెజవాడ వచ్చేశాను. నేను వచ్చేస్తుంటే అమ్మ చెప్పింది. "నాయనా, గోపాల్ ఒకసారి మామయ్య ఇంటికి వెళ్ళమ్మ. ఊరిలోనేగా. పెద్ద ఉద్యోగం అయింది వాడికి కళ్లు కనపడుతున్నాయా, అంటారు" అని చెప్పింది.

బెజవాడలో నాసామానుతో అంతా సెటిల్ అయ్యాక వీలు చూసుకుని ఒకరోజున మామయ్యగారింటికి వెళ్ళాను. మామయ్యకి నోరువాయి లేదు. ఆడపెత్తనం. అంతా మాఅత్తయ్యదే. మామయ్యకి ఒకఅమ్మాయి వుంది. ఆ అమ్మాయి నావయసే. నేనివాళ పుడితే అది రేపు పుట్టింది. అంతే తేడా అందుచేత లక్ష్మిని నాకు ఇచ్చి చేద్దామనుకో లేదు. నేనుకూడా కొంతవరకు అదృష్టవంతుడనననే అనుకోవాలి. లేకపోతే నాపని ఏమయ్యేదో. మాఅత్తయ్యది ఒకటే ధోరణి

ఎ. విమల

అతిధోరణి. ఆవిడ మాట ఎవ్వరూ కాదనకూడదు. కాదన్నామో మనపని అయిందన్నమాటే. మెడలువంచి 'ఊ' అనిపిస్తుంది. ఆచుట్టుప్రక్కలవాళ్ళకి ఆవిడఅంటే భయం. అమ్మవెళ్ళమని చెప్పింది. ఎంతయినా మేనమామ. ఆవిడనోటికి దడిసి వెళ్ళటం మానేస్తే బాగుండదని భోజనం చేసి బయలుదేరాను. గుమ్మంలో కాలుపెట్టగానే అత్తయ్య కనపడింది చాలా హడావుడిగావుంది. నన్ను చూసిచూడగానే "ఏమండోయి మీ అక్కగారి అబ్బాయి వచ్చాడు" అంది. నేను లోపలికివెళ్లాను. "ఏం! గోపాల్! గాలి ఇటు తిరిగిందే! దారి తప్పివచ్చినట్టున్నావు! అయినా మేము కనపడతామూ? కలక్టరయ్యావు. ఇంక అసలు మావేపు రావేమో, అనుకున్నాము. అదిసరేగాని సరియైనసమయానికి వచ్చావు. ఇవాళమాలక్ష్మిని చూడటానికి ఒక అబ్బాయివస్తున్నాడు. అతనుగూడా I. A. S. ఏమండి ఆఅబ్బాయి పేరేమిటి అన్నారు...ఆ...రాధాకృష్ణ"అని తనలెక్చర్ ముగించింది. ఆ అబ్బాయి నేను ఒక్కసారే సెలక్టు అయ్యాము. నాకూబాగా తెలుసుగూడాను. కాని ఏమాటచెప్పితే ఏమి తప్పవస్తుందో, తరువాత ఏదైనా అయితే ఆ గోపాలంగాడికి తెలుసు. వాడే ఏదో చేసుంటాడు అని అంటారు. అంత అపవాదు నానెత్తినవేసుకోటం ఇష్టం లేదు. అందుచేత అతను నాకు తెలుసునని గాని, నేను, అతను ఒకసారే సెలక్టుఅయ్యామనిగాని చెప్పలేదు. అత్తయ్య చెప్పినదానికంతా ఊ అని వూరుకున్నాను. అత్తయ్య ఓ మంచి పనిచేసింది. ఆ వచ్చేదెవరో చెప్పింది. నేను అక్కడ వుండటం ఏమాత్రం మంచిది కాదనుకున్నాను. అప్పుడే భోజనం చేశానేమో కాసేపు నడుం వాల్చాను. సాయంత్రం వెళ్లిపోదామనే నిశ్చయంతో. మా అత్తయ్యగూడ వచ్చి కూర్చుంది. ఆవిడకి కబుర్లంటే మహాసరదా, వసపోసిన పిట్టలా మాట్లాడుతుంది. మామయ్యగూడ అక్కడే వున్నారు. అప్పుడొకసారి నేను వచ్చినపుడు ఒక సంబంధం మాట్లాడుకుంటున్నారు. వాళ్లు ప్రయత్నంచేసే సమయంలో వాడొక నవయువకుడు, పచ్చని శరీరచ్ఛాయ, కోటేరుముక్కు, ఆజానుబాహు, బాగా ఇంతి పొడుగువున్నాడు. పెద్ద ఆస్తిపరుడు. వాడికి తొందరలోనే వెయ్యిరూపాయలజీతం అవుతుంది. అబ్బాయి చాలా బుద్ధిమంతుడు. అంటే బుద్ధికి బృహస్పతి అన్నమాట. ఆ మాటలన్నీ జ్ఞాపకం వుంచుకుని అత్తయ్యని అడిగాను. "అయితే అత్తయ్యా అప్పుడు నేను వచ్చినపుడు ఓ సంబంధం






జలుబులను
మరియు
చలిని
ఆపుటకు
పెప్స్
సేవించుడు

జలుబు, చలి, దగ్గు, గొంతు నొప్పి, ఊపిరితిత్తుల రొమ్ము పడిశెముల చిహ్నం కనిపించగానే పెప్స్‌ను సేవించుడు. పెప్స్‌లోని శమనకర అంటు విరోధక ఔషధ సారములు, గుండెలు, ఊపిరి తిత్తులలోకి లోతుగా చొచ్చి—త్వరగా ప్రమాదకర క్రిములను నశింపజేయును—మంటతో గూడిన వాపును రహిత మొనర్చును—రేగిన నొప్పిని శమనపర్చి వేయును డాక్టర్లు పెప్స్‌ను శిఫారసు చేసియున్నారు. చిన్నలు, పెద్దలు కూడ సేవించవచ్చును, ఇందు ప్రమాదకర ఓషధులు లేవు.

PEPS

పెప్స్ గొంతు మరియు గుండెల అంటు విరోధక బిళ్లలు

FPY-41-TEL

హోల్ ఏజంటు: దాదా & కో.
86, సైనప్పనాయక్ వీధి, మద్రాసు-8



సావరిన్
మిఠాయీలు, టాఫీలు
దేశమంతటా ఆదరించబడినవి



వైట్‌డెంట్
దంతక్రిములను సంహరించే పండ్లపొడి
శ్రీవత్స కెమికల్స్ & డ్రగ్స్ లిమిటెడ్, మద్రాసు-30.


# ★ అయితేఅందగాడు కాకపోతే కురూపి ★

**పాఠకులకు మనవి**

గత వారం ప్రచురింపబడిన "విశాఖపట్టణంలో కాల్టెక్స్ పెట్రోలు కర్మాగారం" అనే వ్యాసం రచించినవారు శ్రీ వార్కీ చెరియన్ అని గుర్తింప ప్రార్థన.

చూస్తున్నారుగదా అది ఎందుకు అవలేదు? ఇంక మొదలుపెట్టింది. "నాయనా! మా లక్ష్మి ఏనాడో అదృష్టం చేసుకుంది కాబట్టి ఆ భ్రష్టాకోరువాడి భార్యకాలేదు. దేవుడు మా యందున్నాడు కాబట్టి అది అవలేదు. లేకపోతే ఏమయ్యేదో మా లక్ష్మి తల్లిగతి. వాడు నల్లగా వున్నాడు. తాటిచెట్టంత పొడుగు ఆ ముక్కేమో సొట్టముక్కు. బుద్ధేమో అలా బొగ్గులయింది. ఇంక ఆస్తి అంటావా. కాసిని రోజులలో రైతులకే పోతుంది. వాడిజీతం మూడు వందలుట, అందులో వాడేం తినను, పెళ్ళానికేమి పెట్టను. వాళ్లు కాళ్లా వేళ్లా పడ్డారు. ఏమైన సరే లక్ష్మినియ్యమని ఛీ. ఛీ. వెధవసంబంధం పోతేపోయింది. ఇప్పుడు చూడు రాజాలా సంబంధం వచ్చింది" అని ఓ పెద్ద లెక్చర్ ఇచ్చింది. ఇలా వుంటాయి ఆవిడ మాటలు. ఆవిడ ఉద్దేశ్యంలో అయితే నేమో అందగాడు. ధనవంతుడు. రూపసి, కాకపోతే కురూపి, నిర్భాగ్యుడు అన్నీను. నిజంగా ఆవిడ ముందు చెప్పినమాటేనిజం. అతడు రూపసి, అజానుబాహుడు. కాని ఇప్పుడు తాటిచెట్టంత పొడుగయ్యాడు వాడు. నాకు తెలుసు, ఆ అబ్బాయి ఇప్పుడు నిజంగానే వెయ్యిరూపాయల జీతంలో వున్నాడు. ఓ యమ్. ఏ., ప్యాసయిన అమ్మాయిని చేసుకున్నాడు. అత్తయ్య లెక్చర్ ఇచ్చాక ఆవిడని నే నడిగాను. "అయితే అత్తయ్యా ఆ అబ్బాయిని అప్పుడలా పొగిడావు. అసలు నీలాంటి వాళ్లకి ఒకటేపు రికార్డరు పెట్టాలి. నువ్వు మాట్లాడినవన్ని రికార్డయిపోతాయి. ఇలా మాట్లాడినప్పుడు నీ కది పెట్టి వినిపించాలి." అన్నాను. ఆవిడకి కొంచెంకోపమువచ్చింది. అసలు నిజంగా ఆ సంబంధం వాళ్లకి లక్ష్మి నచ్చక మానేశారని మామయ్య చెప్పాడు. అది చెప్పటానికి అత్తయ్యకి నామోషి వేసింది. కాకిపిల్ల కాకికి ముద్దు ఎవరిపిల్ల వాళ్ళకంటికి అప్సరసలా కనపడుతుంది. అలాకనపడక పోతే ఇంక మనుషులు బ్రతికే దెలాగూ?

అత్తయ్య ఎప్పుడూ అంతే. తను ప్రయత్నం చేసినంతకాలం వాడు ఇంద్రుడు చంద్రుడు. అలాటివాడు ప్రపంచంలోనే వుండడు. వాడు అందలంఎక్కి కూర్చున్నాడన్నమాటే. వాడు చేసుకోక పోయాడో వాడు తిన్నన్ని తిట్లు ఈ ప్రపంచంలో ఇంక ఎవ్వరు తినరు' తిని ఉండరు. ఆవిడ అంత ఘెంజరు అన్నమాట. అందుచేత ఆవిడ ప్రయత్నం చేస్తోంది కాబట్టి ఇప్పుడు. I. A. S. వాడుకూడ చాలా రూపసిట. వాడు పెళ్లి అవగానే కారుకొంటాడుట. ఓహ్ ఇంకేమిటి చెప్పానుగా, అలాంటి వాడు ఈ ప్రపంచంలోనే లేడుట. సరే ఇంతలోనే నాలుగయింది. నేను అక్కడ వుండకూడదని మొదటే అనుకున్నా గదూ, ఏదో అర్జంటుపని వుందని అక్కడినుండి వచ్చేశాను. ముందే చెప్పానుగా ఒకవేళ వాళ్లు చేసుకోకపోతే ఆ అబ్బాయి నాకు తెలుసునని, నేనే ఏదో వాడికి చెప్పిపెట్టానని వాళ్లు వూహించవచ్చు. కీడెంచి మేలెంచమన్నారు. అందుచేత అక్కడి నుండి వచ్చేశాను.

ఇది అయిన మూడు నెలలకి నేను ఒకరోజు మధ్యాన్నం ఇంటిలో పనిచూసుకుంటున్నాను. హఠాత్తుగా గోపాల్ అన్న కేక వినపడింది. ఈ వేళప్పుడు ఎవరానన్ను పిలిచేది అని తలుపుతీశాను.

"అరెనువ్వా! రాధా! రారా ఎప్పుడొచ్చావురా" అన్నాను.

"ఇవాళ ఉదయం వచ్చానురా. నువ్వు ఇక్కడ వున్నావని తెలిసితిన్నగా ఇక్కడికే వచ్చేశాను. ఒరేయి నాపెళ్లిరా నిన్ను స్వయంగా పిలుద్దామని వచ్చేను. తప్పకుండ రావాలి తెలుసా" అన్నాడు.

"కంగ్రాచు లేషన్సరా. ఆ అమ్మాయి ఎవరు" అని అడిగాను. అడిగానన్న మాటే గాని ఒకవేళ లక్ష్మికాదేమోనని అనుమానం వేసింది. వీడుచూసి వెళ్లాక మామయ్య ఇంటికి వెళ్ళలేదు. అందుచేతనాకు ఏసంగతి తెలియ లేదు. వాడు చెప్పటం మొదలుపెట్టాడు." ఒరేయి! గోపాల్, ఆ అమ్మాయి చాలా తెలివైనపిల్లరా. M. sc. ప్యాసయింది. ఇప్పుడు D. sc కి వర్కు చేస్తోంది. థీసిస్ సబ్‌మిట్ చేసింది. ఇంక డిగ్రి ఇచ్చేస్తారు. ఇంక అందం అంటావా నిజంగా ఏదేవకన్యో అనుకోవాలి. నా భార్య అవుతుందని చెప్పటం కాదు. నువ్వేచూస్తావుగా." అన్నాడు. నాకునిజంగా ఏమనాలో తెలియ లేదు. లక్ష్మిదురదృష్టవంతురాలనుకున్నాను. ఈ సంగతి గురించి అడుగుదామనుకున్నాను ఇంతలో వాడే మొదలుపెట్టాడు. "గోపాల్ ఇక్కడనువ్వు ఎన్నాళ్లనుండి వున్నావు?" "ఏం! అలా అడుగుతున్నావు?" "అబ్బే

ఏం లేదు. మూడు నెలల క్రితం నేనొకసారి ఇక్కడికి ఒక అమ్మాయిని చూడటానికి వచ్చాను. ఆ అమ్మాయి గూడ కొంతవరకు నయమే. M. Sc., ప్యాసయింది. ఈ అమ్మాయంత అప్సరస కాదులే. కొంచెం బాగానే వుంది. ఒప్పుకుందామనే అనుకున్నాను. కాని వచ్చిన చిక్కల్లా ఆవిడ దేరా. అమ్మాయి తల్లిది. ఒకటే ధోరణి" అన్నాడు. "ఒరేయి నువ్వు చేసుకునేది ఆ అమ్మాయిని కాని, ఆ అమ్మాయి తల్లిని కాదుగదరా" అన్నాను. "ఒరేయి నేను ఆ అమ్మాయిని చేసుకున్నాక వాళ్లి ఇంటికి వెడతానా. అప్పుడు ఇంటిలో ఉండకలగాలా లేదా? ఏమంటావు? నువ్వే చెప్పు? అన్నాడు. వాడి ప్రశ్నకి ఏమి సమాధానం చెప్పాలో నాకు తెలియలేదు. వాడు మొదలు పెట్టాడు. "ఆవిడది ఒకటే ధోరణి రా. ఆవిడ నన్నడగటం మొదలు పెట్టింది. "నీకు టెన్నిస్ వచ్చా? మా అమ్మాయికి ఆట లంటే చాలా సరదా. నువ్వు ఏ క్లబ్బులో నేనా మెంబరు అయ్యావా? టెన్నిస్‌లో ఏమైనా ప్రయిజ్‌లు వచ్చాయా? ఇంకో సంగతి, నువ్వు సిగరెట్టు కాల్చవు కదా! మా అమ్మాయికి చాలా అసహ్యం. అది అసహ్యించుకుంటుందని వాళ్ల నాన్నగారే కాల్చటం మానేశారు. మా అమ్మాయి ఇంగ్లీషు సినిమా లంటే చెవికోసుకుంటుంది. ఇంకే సినిమాలూ దానికి కిష్టంలేదు. నాయనా మర్చిపోయాను. మా లక్ష్మి వంట చెయ్యదు వంట వాడున్నాడా'' అని గుక్క తిప్పుకోకుండా అడిగేసింది, నా నోట మాట రాలేదు. మా నాన్నగారు అసలే తెల్లబోయి చూస్తున్నారు. ఆ అమ్మాయి మాట విని సిగరెట్టు మానేసే ఆయన ఎంత చవటో. అది అంతా ఆడపెత్తనంరా. ఆయన ఒకటో రెండో మాటలు మాట్లాడాడు. తక్కిన సంగతులన్నీ ఆవిడే మాట్లాడింది. ఒక వేళ ఈ కాలంలో క్లబ్బులు, టెన్నిస్, ఇంగ్లీషు సినిమాలు ఫాషన్ అని అనుకుని వుంటుంది. ఆవిడగాని అలా మాట్లాడక పోయినట్లయితే ఆ అమ్మాయిని చేసుకుని వుండేవాడిని. నాన్నగారికి ఆవిడ మాటలతో తల వేడెక్కి పోయింది. ఇంతకు ఆ అమ్మాయి నచ్చింది. జాతకాలు కుదిరాయి. తీరా ఏమని వ్రాయటం? ఏమీ పాలు పోలేదు. అందు చేత నేనే ఒక గమత్తు చేశాను. వీడు ఉత్త వెధవ ఇలా చేసాడేమిటా అని నువ్వు అనుకోవచ్చు. కాని ఇంకేమి గత్యంతరం లేదు. ఒక టెలిగ్రామ్ ఇచ్చేశాను. "మీరు చూసే సంబంధం మంచిది కాదు. ఆ అబ్బాయి బుద్ధి మంచిదికాదు. చేస్తే మీరే అనుభవిస్తారు" అని. దాంతోటి మళ్లీ వాళ్లు లెటర్ రాయలేదు. తరువాత ఈ సంబంధం కుదిరింది. తప్పకుండా రావాలి తెలుసా. అప్పుడే నాలుగయింది. ఇంక నేను వెళ్తానురా" అని వెళ్లిపోయాడు.

వాడు చెప్పినది వింటుంటే అత్తయ్య ఎంత పని చేసింది. అనిపించింది. రాధా ఇలా వెళ్ళగానే నేను మామయ్య ఇంటికి వెళ్లాను. వెళ్తూనే "ఏమయిందత్తయ్యా ఆ I.A.S. సంబంధం" అని అడిగాను. "నాయనా దేముడు నిజంగా మాపాలిట అందులో ముఖ్యంగా లక్ష్మి పాలిట వున్నాడు. మీ మామయ్యా ఆ వేళ వాళ్లకి వుత్తరం రాద్దామని కూర్చున్నారు. దేముడు ప్రత్యక్షమయినట్లు టెలిగ్రాము వచ్చింది. ఆ అబ్బాయి బుద్ధి ఏమీ మంచిది కాదుట ఇంకా ఏదో రాసి వుంది. అంతే మీ మామయ్య ఆ పెన్ను కాగితం అలానే పారేశారు. ఆ వేళ సాయంత్రం వెళ్ళి దేముడి గుడిలో కొబ్బరికాయలు కొట్టి వచ్చారు. ఇంక ఆ అబ్బాయిదగ్గర నిత్యాగ్ని ధూపం. తరువాత ఎవరో చెప్పారు ఆ అబ్బాయికి ఒకసారి క్షయగూడా వచ్చిందిట. ఏమి I.A.S. ప్యాసయ్యాడో గాని నేను అడిగిన దానికి ఒక్కదానికి సమాధానం చెప్పలేదు. మొగాడు వుండాల్సిన విధం అదేనా? నిజంగా ఆ టెలిగ్రాము ఎవరు ఇచ్చారో గాని ఎంతో పుణ్యాత్ములని చెప్పాలి" అంది. నాకు నిజంగా ఆవిడని చూస్తే జాలి వేసింది. ఆవిడమాటలు కోటలు దాటుతయి, గాని కాళ్లు గడపలుదాటవు. తనచేతులలో నే ఆ సంబంధం పోగొట్టుకుంది, మళ్ళీ మొదలు పెట్టింది. "గోపాల్ పోతే పోయిందిలేగాని వెధవ సంబంధం. ఇప్పుడు రాజాలాంటి సంబంధం చూస్తున్నాము. ఆ అబ్బాయి ఓ పిల్ల జమిందారనుకో. అసిస్టెంటు ఇంజనీరు చేస్తున్నాడు. పెళ్లి అవగానే అమెరికా వెడతాడు. మన లక్ష్మిని గూడ తీసుకు వెళతాడు. అది ఎలాగయిన అదృష్టవంతురాలు. ఇంకా అమెరికానుండి వచ్చాక ఛీఫ్ ఇంజనీరు అయిపోతాడు" అంది. నాకు చెడ్డకోపం వచ్చింది. ఆవిడకి చిన్నడోసు ఇవ్వాలనిపించింది, "నువ్వు ఎప్పుడూ ఇంతే అత్తయ్యా. నువ్వు ప్రయత్నం చేసినంత సేపూ వాడు కోటీశ్వరుడు, అందగాడు, బుద్ధికి బృహస్పతి. వాడు చేసుకోకపోతే వాడొక బికారి వెధవ, కురూపి, రోగిష్టి వాడు. నువ్వు ఈ ధోరణి ఎప్పుడైతే మానుతావో అప్పుడే మీ లక్ష్మికి పెళ్లవుతుంది. అయినా నీకు ఎవరు చెప్పారమ్మా? అమెరికావెళ్లివచ్చాకా వాడికి ఛీఫ్ ఇంజనీరు అవుతుందని? తెలిసి తెలియని మాటలు మాట్లాడకు. నీ అల్లుడయినంతమాత్రాన వాడు ఛీఫ్ ఇంజనీరు అవ్వాలని వుందా? ఇలాగే నీధోరణివుంటే ఇంక ఎవ్వరూ లక్ష్మిని చూడటానికిగూడా రారు" అని అన్నాను. ఆవిడ నోరు వెళ్లబెట్టి కుక్కిన పేనులా కూర్చుంది. తరువాత తెలిసింది. ఈ అసిస్టెంటు ఇంజనీరు సంబంధం కాలేదు. ఒక M.SC ప్యాసయిన అబ్బాయికి ఇచ్చి చేశారని. వాళ్ళిద్దరుగూడ కాలేజీలో వర్కు చేస్తున్నారు. ఈపాటిదానికోసం లక్ష్మికి వంటరాదని, ఇంగ్లీషు సినిమాలే చూస్తుందని టెన్నిస్ అంటే ఇష్టమని, సిగరెట్టులంటే అసహ్యమని నానారకాలుగా మాట్లాడి రాధని వదలగొట్టి మంచిసంబంధం చేచేతులా పాడుచేసుకుంది. ఇప్పుడు పాపం రోజూ కాలేజికి వెడుతోంది, ఓ క్లబ్బులేదు ఏమిలేదు. నానాతంటాలు పడుతోంది. దీనికంతకి కారణం మా అత్తయ్య అతిధోరణి. పాపం! లక్ష్మి అమాయకురాలు. ★





## నారసింహ లేహ్యము

బంగారుతో చేరినది. మేహము, నిస్త్రాణ, నిస్సత్తువ వగైరా హరించి. బలము రక్తవృద్ధికల్గించును. 20 తు. డబ్బీ రు 3-4-0. పోస్టేజి రు.1-0-0.

వి. స. ఏ. అండ్‌కో, (ఆయుర్వేద సమాజం)
పెరిదేపి (పోస్టు) — నెల్లూరుజిల్లా.

## త్వరలో తశ్శాంతి???

ఏ సమయంలోనైనా అప్పుడప్పుడు అగినచో రోజోలా (మాత్రలు) బాగుగా పనిచేయును. క్లిష్టపరిస్థితులలోనైనాసరే. ఏవిధమైన హానిచేయక 100% గుణము గ్యారంటీ యిచ్చుచున్నాము. హెచ్చరిక:— కడుపుతోనున్నవారు దీనిని వాడిన ఎబార్షను జరుగును గాన అట్టివారు వాడరాదు. సామాన్యమైనది.రు.7-2-0. శక్తివంతమైనది రు 20-4-0 మాత్రము.

టోబఔషధాలయ. షహర్‌పూర్. కలకత్తా-38.



మరియు హైదరాబాదు.

# రాధ పడిన బాధ

యద్దనపూడి సులోచనారాణి

"అబ్బా! రాధా! ఒక్కసారి వచ్చి వెళ్ళవే తల్లీ. నీకు నీ పెద్దలకి వేయి నమస్కారాలు పెడ్తాను. వూరికే నే వుంటావుగా. ఆ మాయదారి పుస్తకం తర్వాత చదువుకో గూడదూ?..." వంటింట్లోంచి బామ్మ పుట్టుపూర్వోత్తరాల్లెత్తటంతో చదువుతున్న పత్రిక డ్రాయరుమీదకు గిరాటు కొట్టి విసవిసా రాధ వంటింట్లోకి వెళ్ళింది. "కాస్త ఆ నాలుగు అరిటికాయలూ తరిగి పెట్టు. పొపు మాడిపోతోంది" అంది బామ్మ, అంత ముందరగా యెందుకు వేసుకోవాలి? నాలిక చివరదాక వచ్చిన ప్రశ్నను రాధ బలవంతాన తిప్పి లోపలకు నెట్టింది. మూలనున్న కత్తిపీటను విసురుగా ముందర వేసుకుని రాధ గబగబా పెచ్చుతీయ్యటం మొదలు పెట్టింది. వెధవది. ఛీ! కథమధ్యలో వదిలేస్తే పట్టుపోతుంది. ఇంతకీ రైలుదూకబోతున్న కథానాయకుడు సొంతం దూకాడో లేదో? వంటరిగా దూకాడో లేక కథానాయకితో సహా వురికాడో? రైలు దూకటానికి సిద్ధంగా నిలబడ్డ కథానాయకుడు "ఏ వమ్మోయి తొందరగారా" అని పిల్చినట్లుగా అనిపించింది రాధకు.

"అయ్యో! నీయిల్లు బంగారం కాను!అదేం తరగటమే నా తల్లీ. కూరేమయినా నాలుగు ముక్కలవాలా? అంత కండ తీసేస్తే" బామ్మ మందలింపుతో రాధ నెమ్మదిగా జాగ్రత్తగా తరగటం మొదలుపెట్టింది. మొహం ముడుచుకున్న రాధనుచూసి "పని చేసిన ఆడది యెప్పుడూ చెడిపోదు. జ్ఞాపకముంచుకో. రేపత్తారింటికి వెళ్తే నువ్వే సుఖపడ్తావు. నువ్వు పనిచేయకపోతే నిన్నేమీ అనరు. మాకు వేళులు చెక్కుతారుగాని. తల్లిలేనిపిల్ల! విచ్చలవిడిగా వదిలేసారు. ఓపని చేతగాదు పాడూ చేతగాదు. మేం కోడల్ని తెచ్చుకోలేదు మాయింటికి ఓ కోతిని తెచ్చుకున్నాం అంటారు. చక్కగా పని చేసావనుకో మా కోడలు యెంతమంచిదమ్మా! చక్కగా బంగారు పిచ్చుకల్లే పనిచేస్తుంది. దానికి చేతగాని పనంటూ లేదు. వాళ్ళ బామ్మ పెంపకం యెంతఘంచిది!" చివరి మాటకి రాధ పకపకా నవ్వేసింది. "అసలు రహస్యం అది" అంది. ముడుచుకుపోయిన ముఖం వికసించటం చూసి "ఆ! అదీ చక్కగా అలా యెప్పుడు నవ్వుతూ వుండాలి. పని చెప్పగానే మొహం గంటు పెట్టుకున్నట్లు కూర్చుంటే యెలా? బామ్మ మాటలతోపాటు రాధ కూర తరగటం గూడా పూర్తయింది. కథానాయకుడు యింక సహించనంటున్నాడు. రాధ గబ గబా సావిట్లోకి వచ్చింది. "ఇదుగో పోతున్నావా? కాస్త ఆకతిపీట తీసి ప్రక్కన పెట్టి ఆపెచ్చులు దొడ్లో పారేసిరా! మాతల్లివి కదూ! మాఅమ్మవిగా" బామ్మ మాట కాదనలేక రాధ వెనక్కు తిరిగింది.

"పనిచేస్తే ఒకరు వంకపెట్టినా మళ్ళా? ఆ! పోనీ పోనీ! అనవులే. మాబంగారు కొండల్లే పనిచేస్తావు నువ్వు. నీకు కృష్ణమూర్తి లాంటి మొగుడొస్తాడులే తప్పకుండా."

రాధ చేతులు తుడుచుకుని గబగబా వచ్చి డ్రాయరుముందు కుర్చీలో కూలబడింది. పత్రికను విసురుగా పడెయ్యటం మూలాన పేజీలు కలిసిపోయినాయి. ఇంక తీరుబడిగా చదవవచ్చనే ఉద్దేశంతో రాధ పేజీలు తిప్పసాగింది.

"రాధా! రాధా!" పైనుంచి వాసు ఇల్లదిరి పోయేటట్లు గావు కేకలు పెట్టటం మొదలెట్టాడు. రాధకు వళ్ళు మండిపోయింది. ఇవతల కథానాయకుడు "ప్చ్! లాభం లేదమ్మాయి" అంటున్నాడు. అయినా తప్పలేదు. పత్రికను చేత్తో పుచ్చుకునే రాధ మెట్లదగ్గరకు వెళ్ళింది. అప్పటికే వాసు మెట్లపైకి వచ్చి నుంచున్నాడు.

"ఓ రాధమ్మతల్లీ! ఏ మధురానగరిలో వున్నావు. అరగంటనుంచి ఆపకుండా పిలుస్తున్నాను. గొంతు పగిలిపోతోంది. అరవలేక ప్రాణం పోతోంది", నిటారుగా నుంచుని రాధని బిగ్గరగా పిలవటంవల్ల తన కెన్ని నష్టాలు కలిగాయో చెప్పబోతున్నాడు.

"అయిందా ఉపన్యాసం. ఇంకా ఉందా?"

"ఉపన్యాసం? ఆ మాట వాడవద్దని నీకెన్నిసార్లు చెప్పాను? నేనేమయినా రాజకీయవేత్తననుకున్నావా? వేళాపాళా లేకుండా అడగా పెట్టకుండా ఉపన్యాసం ఇవ్వటానికి. అసలయినా మనం ఉపన్యాసం ఇస్తామంటే...హు!"

"సర్లే! ఎందుకు పిల్చావో చెప్పకుండానే దండకం యెంత చదివావో!" రాధ విసుక్కుంది.

"ఓ! సారీ సిస్టర్! నాపెన్నెక్కడా కన్పించటం లేదు", వాసు ఒక్కొక్క మెట్టే దిగుతూ తడిలేని కళ్ళని చొక్కాతో తుడుచుకొన్నాడు. రాధకు వళ్ళుమండింది, "నీ పెన్ పోతే నన్ను పిలవటం దేనికి?"అంది.

"మరెవర్ని పిలవను?"

"ఎవర్నా? కావాలంటే బామ్మను పిలు."

"అమ్మా! బామ్మనే!" వాసు దిగుతున్నవాడల్లా రెండు మెట్లు పైకెక్కి "చంపేస్తుంది. అందులో వంటచేస్తోంది గాబోలు. ఆయుధ సమేతంగా వుండి వుంటుంది".

"సరె! ఇంకేం? అయితే వూరుకో! నోరు మూసుకుని బామ్మకు తెలియనియ్యకుండా బుద్ధిమంతుడిలాగ కాలేజీకి దయచేయి" వాసు మళ్ళా మెట్లు దిగటం మొదలెట్టాడు.

"చెల్లాయ్! చెల్లాయ్! కాస్త పెన్ను వెతికిపెట్టవేమ్మా, కాలేజీకి టైమైపోతోంది గూడాను. మాఫిజిక్స్ లెక్చరర్, యమకింకరుడు. నన్ను తంతాడు గూడాను"

"తంతాడా? నీ అంత హీరోనే" రాధ తన చక్రాల్లాంటి కళ్ళను తిప్పుతూ ఆశ్చర్యం అభినయించింది.

"నిజంగా తన్నడులే. తన్నినట్లుగా అంతకంటె యెక్కువగానే ఖూనీచేసినంత యిదిగా మాటలంటాడు"

"అయితే పదు." రాధ వెనక్కు తిరిగి డ్రాయరు దగ్గరకువచ్చింది.

"పడనా? 40 మంది వున్న క్లాసులో అందులో ప్రక్కనే సుశీ, శశీ, రోజా, వున్న క్లాసులో నేను - మా లెక్చరర్ చేత - మాటలు పడనా?" వాసు మెట్లు దిగి రాధ దగ్గరకు వచ్చాడు.

"అయితే నీ బాధంతా సుశీ. శశీ, గిశీ, రోజా, గీజాముందు మాటలు పడాల్సివస్తుందని అన్నమాట"

"అబ్బబ్బ! నేను మూడుపేర్లు చెప్తే! హాస్యంగి, దిర్భంగీ కలిపి మరో రెండుపేర్లు



 రాధపడినబాధ 

జరచేసావు. కాస్త పక్కకి పెట్టవే అమ్మా!" ఆ పాడుపుస్తకం తర్వాత చదువుదుగానిలే! తీరుబడిగా!"

"అబ్బబ్బ! ఇదక్కడి గొడవంటూ. నీ పెన్ను నువ్వెక్కడ పెట్టుకున్నావో నాకేం తెలుస్తుంది" రాధ బిగ్గరగా అంది.

"నీకు పుణ్యముంటుంది. గంగానమ్మ తల్లి. కాస్త అరవబోకు. బామ్మ వింటుంది"

"అయినా ఒక్కరోజు లేకపోతే యేం? కాని మీ సింహాన్ని అడుగరాదూ?" రాధ ఎందుకయినా మంచిదని కంఠం తగ్గించింది.

"మా సింహం అసలు కాలేజికి పెన్ తీసుకువస్తేగా"

"పోనీ ఆ లెక్చరర్ని అడుగు"

"అమ్మో! ఇంకా యేమయినావుందా? ఆయన్ని చూస్తుంటే అచ్చు మన బామ్మ గుడ్లురిమి అట్లకాడ చేతపుచ్చుకుని మీద కొచ్చినట్లే వుంటుంది! అసలయినా యీ పాటికి పత్రిక యివ్వనే యిచ్చేదానివి"

రాధ యిక గత్యంతరం లేక పత్రిక అక్కడ పడేసి పైకి వెళ్ళింది. డ్రాయరు సొరుగులు, బీరువాలు, పుస్తకాలు, లాగూలు అన్నీ వెతికింది. చివరకు మాసిన బట్టలు పారేసిన బుట్టలో ఒక పాంటు జేబుకి సురక్షితంగా అంటిపెట్టుకుని వుంది.

"విడిచిన బట్టలు బుట్టలో పారేసినప్పుడు కాస్త జేబులో యేమున్నాయో చూచుకోగూడదూ?" వాసుకు పెన్నుయిస్తూ రాధ మందలింపుగా అంది.

"తీరికేది చెల్లాయి? నువ్వు చూస్తూనే వున్నావుగా. అయినా నాకు తెలియకడుగుతాను. వూరికే నే వుంటావుగదా? కాస్త నా విషయం చూడగూడదూ? ఆడపిల్లలకు చదువు కావాలో అని మా మగవాళ్లు గోల పెట్టి చెప్పించేది యెందుకు?"

"అన్నానికి రారా వాసూ!" అన్న బామ్మ పిలుపుతో వాసునోటికి తాళం పడ్డది. ఎదురుమేకులు చెక్కటమంటే యిదే గాబోలు అనుకుంది రాధ.

డ్రాయరుముందు కూలబడి పత్రిక తెరిచింది. అరగంట, గంటనుంచి నీకోసం వెయిట్ చేస్తున్నా అన్నాడు కథానాయకుడు. రాధ కథ మొదలు పెట్టబోయేసరికి "అమ్మాయ్! రాధా!" పూజామందిరంలోంచి మామయ్య పిలుపు విన్పించింది. చచ్చాంరా భగవంతుడా! అనుకుని మరో పిలుపు పిలిపించుకోకుండానే రాధ పూజామందిరంలోకి వెళ్లింది.

"ఇక్కడ పూలేవమ్మా! అబ్బ! తల్లీ! కాస్త నా సంగతి చూడవమ్మా అని యెన్నిసార్లు చెప్పాను." ఇలాంటి వాళ్లకు యెదురు చెప్పగూడదని రాధ అనుభవంతో నేర్చుకుంది. మౌనంగా పూలుకోసుకొచ్చి అక్కడ పెట్టింది.

"అయ్యో! ఇవాళ మరీ తక్కువ పూశాయేం? అవును మరి! పాపం! వాటికి నీళ్లూ నిప్పులూ వుంటేగా! చూడు రాధా! చెబుతున్నానని మామయ్యమీద కోపగించుకోకు సుమా! కాస్త ఆ చెట్ల సంగతి చూడగూడదూ? వూరికే నే వుంటావుగా తల్లి! చెట్లని జాగ్రత్తగా చూడటంవల్ల యెన్ని లాభాలో చూడు! ఒకటి. ఊరికే కూర్చుంటున్న నీ శరీరానికి చక్కని వ్యాయామం! రెండు అదిగూడా ఒక కళే. అంటే మనం శరీరానికి వ్యాయామం యిచ్చుకోవటమే కాకుండా ఒక విధంగా కళని పోషించటం! మూడోది పూలు! యెంత అందమైనపూలు! మనం డబ్బుపెట్టి కొనుక్కోవాలంటే సాధ్యమా?"

మామయ్య పూజమాట మర్చిపోయి ఉపన్యాసం దంచుతున్నాడు. రాధ ఇంక నిలబడలేక వెనక్కు తిరిగింది. "వెళ్తున్నావా? నాకు తెలుసులే యివి నీకు రుచించవని. పోనీలేగాని 10 గం॥ దాటినట్లుంది. మీ అత్తయ్యకు మందుకు టైమయినట్లుంది. మర్చిపోకుండా మందుతోపాటు నారింజ రసంగూడా యివ్వు తల్లి!" మామయ్య పూజకు వుపక్రమించాడు.

వింత వ్యక్తులు అనుకుంది రాధ. కథలో

కథానాయకుడు బుంగమూతిపెట్టి కూర్చు న్నాడు. అయినా తప్పదనుకుంది రాధ. మేనత్త గదిలోకి వెళ్లింది.

రాధ యిచ్చిన నారింజరసం గ్లాసు తీసుకుంటూ ముక్కుతూ మూలుగుతూ "కాస్త ఆ పిల్లలెక్కడకు పోయారో చూడు తల్లీ. మరీ బద్ధాయిల్లాగా తిరుగుతున్నారు. మట్టిలో కొట్టుకుంటున్నారో యేం చేస్తున్నారో! కాస్త పిలిచి నీళ్లుపోసి అన్నం పెట్టించు తల్లీ! అమ్మ మడికట్టుకున్నట్టుంది. కాస్త వాళ్లని చూడమ్మా. మీ మామయ్య వున్నారన్నమాటేగాని..." ఆయాసంతో మూలుగుతూ అత్తయ్య వెనక్కి వాలింది. తలక్రింద దిండు సరిచేసి శాలువా కంఠం దాకా కప్పి తలుపులు చేరవేసి రాధ యివతలకు వచ్చింది.

"ఇప్పుడైనా రావమ్మా మహాతల్లి" అని కథానాయకుడు విసుక్కున్నాడు. "అత్తయ్యా!" బాబూ పాపదగ్గర కొచ్చారు. కథానాయకుడివంక జాలిగాచూసి రాధ దొడ్లోకి వెళ్ళిపోయింది.

పిల్లల పనయిపోయిం తర్వాత యివతలకు వస్తుండగా తండ్రి ఆఫీసుకు వెళ్లబోతూ లోపలకు వచ్చి "అమ్మా! రాధా" అని పిలవటంలో రాధ సావిట్లోకి వచ్చింది. "చూడు తల్లీ! నీ రాత యెంతో బాగుంటుంది. క్రిందటిసారి మా ఆఫీసర్ యెంతో బాగుందన్నాడు. ఈ కాసిని కాగితాలు ఫెయిర్ కాపీచేసి పెట్టమ్మా. రెండుగంటలయేసరికి మనిషిని పంపుతాను. పంపించేయాలి. ఆ! చూడు కాస్త జాగ్రత్తగా తప్పులులేకుండా వ్రాయి. నీకు చెప్పలేనవసరం లేదనుకో! జాగ్రత్తగా వ్రాయి. రెండుగంటలయేసరికి పూర్తికావాలి. యెలా వ్రాస్తావో. నీ యిష్టం." రాధ వచ్చే నిట్టూర్పును ఆపుకుంటూ కాగితాలు తీసుకుంది.

నాన్నగారు ఆఫీసుకు వెళ్లిపోయారు. అత్తయ్య పడుకుంది. మామయ్య వైకుంఠం గారింటికి చదరంగం ఆడుకోటానికి వెళ్లాడు. అన్నయ్య కాలేజికి వెళ్లాడు. పిల్లలు బడికి పోయారు. కథానాయకుడు అమ్మయ్య అనుకున్నాడు.

"అన్నం తిని నీ యిష్టం వచ్చినంతసేపు చదువుకో తల్లీ. నా పని అయిపోతుంది!" వంటింట్లోంచి బామ్మ పిల్చింది.

భోంచేసి వచ్చి డ్రాయరుముందు స్థిమితముగా కూలబడింది రాధ. వెనకాల బామ్మ వచ్చి "యేది రాధా! నిన్నటి తర్వాత పద్యాలు చదువు," అంది వత్తులు బుట్టముందు పెట్టుకుని వక్కనముల్తూ. "నేనిప్పుడు చదవలేను బామ్మా!" రాధ యింక విసుగును ఆపుకోలేక పోయింది.

"యేం?" పత్తి విడదీస్తూ బామ్మ వత్తి పల్కింది.


# కాల్గేట్ క్లోరోఫిల్* చిగుళ్లను గట్టిపరుస్తుందని

## వైద్యపరీక్షలో రుజువైంది!



**చిగుళ్లను బలపరుస్తుంది!**

కాల్గేట్ క్లోరోఫిల్ టూత్‌పేస్ట్‌తో రోజూ పళ్లను క్రమంతప్పకుండా తోముకుంటే చిగుళ్లు గట్టిపడడానికి అవసరమైన జీవకణాలు పెరుగగలవు.

**దుర్గంధాన్ని వెంటనే, గట్టిగా నిర్మూలిస్తుంది!**

ఇతర మామూలు టూత్ పేస్ట్‌లకంటే కాల్గేట్ క్లోరోఫిల్ టూత్‌పేస్ట్ దుర్గంధాన్ని గట్టిగా నిర్మూలించగలదని ఇటీవల జరిగిన పరీక్షలో రుజువైంది.

**దంతక్షయాన్ని నివారిస్తుంది!**

భుజించగానే కాల్గేట్ క్లోరోఫిల్ టూత్ పేస్ట్‌తో పళ్లు తోముకుంటే పళ్లమెరుగును హరించే ఆమ్లాలను తగ్గించి, తద్వారా దంతక్షయాన్ని నివారించగలదు!

**ఇంతకు మించి సచేతనమైన క్లోరోఫిల్ కలిగివున్న మరొక టూత్‌పేస్ట్ లేదు!**




పిల్లలకు ఆనందదాయకమైన దాని పెప్పర్‌మింట్ రుచి, వాసన వారికి బాగా నచ్చుతుంది.

* నీటిలో కరిగే క్లోరోఫిలిన్స్ గలవు.

**ఇప్పుడు!** ఆదాయకరమైన పెద్దసైజులో దొరుకుతుంది



# రాధపడినబాధ



"నాకంఠం బాగాలేదు-నొప్పిగావుంది."

"నీ కంఠానికేమే నిక్షేపం లాగుంటుంది. పద్యాలు గొంతెత్తి చదువుతే ఆ నొప్పి గిప్పి గూడా పోయి నాళాలు సరి అవుతాయి."

రాధకు నవ్వు వచ్చింది.

"ఆ! రాధా! ఆ దిక్కుమాలిన పుస్తకాలు నోరు తెరకుండా లోపలలోపల చదువుకుంటే యేమవుతుంది మరి? నరాలు బిగుసుకు పోతాయి. లే! లే! ఇవాళ నీకు బావ దగ్గర్నుంచి ఉత్తరం వస్తుందిలే!"

రాధ నవ్వుకుంటూ ఆధ్యాత్మ రామాయణ గ్రంథంతీసి బామ్మముందు కూర్చుని వరుసగా పది పద్యాలు రాగయుక్తంగా పాడింది. హఠాత్తుగా నాన్నగారిచ్చిన కాగితాలు జ్ఞాపకానికి వచ్చాయి.

"ఇంక చాల్లే బామ్మా! నాన్నగారిచ్చిన కాగితాలు వ్రాయాలి" అంది.

"సర్లే వెళ్లు." అంతవరకూ జోగుతున్న బామ్మ చెంగు పరుచుకుని క్రింద పడుకుంది.

రాధ తండ్రి ఆఫీస్ రూములో వెళ్లి కూర్చుంది. రెండుగంటలసేపు ఆలోచనల్నీ, ఆవేశాలని దూరంగాపెట్టి మనసు కాగితాల మీద లగ్నం చేసింది.

పూర్తయిన కాగితాలు సీరియల్‌గా నంబరువారీ పెట్టి, పెక్‌కు క్లిప్ తగిలించి, మామయ్య అనుకుని వెనక్కు వాలింది. రెండుగంటలు తదేకంగా కూర్చుని వుండడం వల్ల నడుం, మెడ నొప్పిపుట్టింది. "అమ్మాయి గారూ!" వాకిట్లోంచి కేక వినిపించింది. రాధ కాగితాలు వచ్చిన మనిషికిచ్చేసి సంతృప్తిగా నిట్టూర్చి వచ్చి డ్రాయరు ముందుగా కూర్చుంది. నడుము నొప్పి పుడుతోంది. పోనీ కాసేపు పడుకుందామా అనుకుంది. ఇంతలో వాకిట్లో "ఉత్తరాలండీ" పోస్టుమాన్ కేక వినిపించింది. రాధ బామ్మ జోస్యాన్ని వూహించుకుంటూ వాకిట్లోకి వచ్చింది. ఒక వుత్తరమూ, పార్సిల్ వచ్చాయి. రాధ ఆత్రంగావిప్పింది యేమిటో చూడామని. తీరాచూస్తే కథ! బావ వ్రాసినకథ! వుత్తరంగూడా బావ వద్దనుంచే! అందులో యిలా వుంది.

"రాధా,

నా కథ పంపుతున్నాను. కొత్త కాపీ చేసిపెట్టు. నీ వ్రాతతో వెళ్ళినకథ లింత వరకూ తిరిగిరాలేదు. కాబట్టి నీ వ్రాతమీద నాకు చాల నమ్మకంవుంది. ఇది పెద్దనవల. సీరియల్‌గా అచ్చువుతే యెంతపేరువస్తుందో నీ బావకు ఆలోచించుకో! వూరికి నే వుంటావుగాబట్టి కాస్త శ్రద్ధవహించి త్వరలో పూర్తిజేయ ప్రార్థన. నేను సోమవారం ఉదయం 10 గం॥కు వస్తాను. నువ్వు ఆదివారం సాయంత్రానికి పూర్తిజేసి వుంచాలి. (సోమవారం 10 గం. వరకూ నీ అలంకరణే సరిపోతుంది గాబట్టి). ఊరికేవున్న నీకు చక్కని కాలక్షేపం గదూ?

నీ బావ

ప్రసాదు."

రాధకు వళ్ళు మండిపోయింది. చివరా మాటలు యెందుకో? "వూరికే నే వుంటావుగా నా పని చూసిపెట్టు!" ప్రపంచంలో మనుష్యులంతా ఒకటే టైప్ అనుకుంది రాధ. ఆలోచనలోవున్న రాధకు హఠాత్తుగా కథానాయకుడికేక విన్పించింది. రాధ పత్రిక తెరిచింది.

వీధి తలుపెవరో కొట్టారు. తనివాకే చాలా వర్షపువేళలో కథ మొదలుపెట్టాను అనుకుంది. లేచి వెళ్ళి తలుపుతీసింది. ఎవరో ఒకావిడ, ఆవిడను రాధిన్నడూ చూడలేదు. "కనకమ్మగారున్నారా?" అంటూ రాధ సమాధానం చెప్పకముందే లోపలకు వచ్చేసింది.

తర్వాత తెల్సింది బామ్మా, ఆ వచ్చినావిడా చిన్నప్పటి స్నేహితురాండ్రని. ఆవిడ మాటలమధ్యలో అడిగింది. "మీ మనవరాలికి కుట్లు, అల్లికలూ యేమయినా వచ్చా అని?" బామ్మ రావని తలూపింది. ఆవిడ ఆశ్చర్యపోతూ "మరి వూరికినే వుంటోంది గదా? యేంచేస్తుంది? పిల్లలలా కాలం పాడుచేస్తూ కూర్చుంటే తనిలా చూస్తూ ఊరుకోలే" నంది. రాధ కేమనుకోవాలో తోచలేదు.

ఆ రాత్రి పడుకోబోతూ రాధ పత్రిక తెరిచింది. కథ యేమయినాసరే పూర్తి చెయ్యాలనే గట్టి పట్టుదలతో.

"అబ్బబ్బ! అసలే దోమలతో చస్తుంటే ఆ దీపమేమిటే రాధా! కాస్త తగ్గించివేద్దూ. పగలల్లా యేంచేస్తావు? వూరికినే వుంటావుగా!" రాధ రోషంతో పత్రిక అవతలకు గిరాటుకొట్టింది. "అంత కోపమైతే యెలాగే?" బామ్మ మరోవైపు తిరిగి పడుకుంది.

రాధ బరువెక్కిన తలని దిండులో దూర్చుకుంది. బామ్మకు కూరలు తరగాలి. అన్నయ్య పారేసుకున్న పెన్నులు వెతికియివ్వాలి. మామయ్య పూజవిషయాలు చూడాలి. చలిజ్వరంతోవున్న అత్తయ్యకు మందులు చూడటమేగాకుండా పిల్లల్ని చూడాలి. నాన్నగారికి కాగితాలు వ్రాసిపెట్టాలి. బావకు కథలు కాపీచేసిపెట్టాలి. కుట్లుకుట్టాలి, అల్లికలు అల్లాలి. కాని చిత్రమేమిటంటే ప్రతివాళ్ళు యెవరికివాళ్ళే నా విషయం చూడరాదా అంటారు. అందులోగల సబబు వేడెక్కిపోయిన రాధ బుఱ్ఱకు అర్థంగాలేదు. దిండులో మొహం దాచుకుని రైల్లోంచి ఉరకటానికి సిద్ధంగా వున్న కథానాయకుడిని గురించి ఆలోచిస్తూ నిద్దరపోయింది స్కూలుజీవితం వదిలి సహజజీవితంలోకి అడుగుపెడ్తూ తికమక పడ్తున్న రాధ.




## పూవు మీ అదృష్టం చెప్పగలదు



నీ భవిష్యత్తులో ఏమి జరుగబోవునదిన్నీ, నీ సరియైన చర్యనుగురించిన్నీ నీవు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టు కార్డుపైన నీకు యిష్టమగు ఒక పుష్పము పేరున్నూ, నీవు వ్రాయు తేదీ, వేళ వివరములున్నూ, నీ సరియైన చిరునామా యున్నూ వెంటనే వ్రాసి పంపుము.

జ్యోతిష శాస్త్రములోని రహస్య గణితము మూలముగా మేము గుణించి, నీవు కార్డు వ్రాసిన తేదీలగాయతు 12 మాసములలోను నీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవితమార్గము, ఏ వ్యవహారములో నీకు జయము కలుగును. నీ ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు, మార్పులు, ఆరోగ్యవిషయము, పరదేశమగనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము నిధినిక్షేపములు, లాటరీ, అకస్మాద్రవ్యలాభము మొదలగు వానినిగురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు. 1-4-0 లకు మాత్రము వి. పి. గా పంపగలము. (వి. పి. చార్జీలు ప్రత్యేకం) దుష్టగ్రహము లేవయినా వున్న యెడల శాంతిచేయు విధానంకూడా తెలుపుడు చేయడమగును. వివరములు మా పూచీ పైన పంపబడును. మేము పంపిన భోగట్టా మీకు తృప్తిగా నుండనియెడల పైకము వాపసుచేయబడును. ఒకసారి పరీక్షించిచూడుడు. మీ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

Pt. DevDutt Shastri, Raj Jyotishi (WP-13) Jullundur City.

# కులపాలిక

"అన్నం యింకొస్త పెట్టనా? పెరుగు తీసుకునిరానా? ఏమీ మాట్లాడరేమి టమ్మా. రామ! రామ! అస్తమానూ ఆలోచ నేనా! అన్నం తినే కాస్సేపయినా మన స్సుకి విశ్రాంతి నివ్వరాదూ. ఏం ఆలోచనో కానీ మహాప్రభో...నిద్దట్లో కూడా ఆలో చిస్తూనే ఉంటారనుకుంటాను. అసలు మీకు నిద్ర అనేది ఉంటుందా?అని.అన్నం చూసు కోండి, మళ్ళీ కళ్ళెర్ర జేస్తారు. ఒక్క మెతుకు ఎక్కువయినా...తరువాత తినే దాన్ని నేనుండగా ఎందుకండీ అంతకోప్ప డుతారూ...అంటే! అన్నానంటారు కానీ పెట్టేటప్పుడు చూసుకోక తరువాత కేకలేస్తే అదే లెండి - కళ్ళెర్రజేస్తే నాకు భయంగా ఉండదూ. వడ్డించక పోతేనేమో 'ఓసి నీ యిల్లు బంగారంగానూ, తెచ్చిపడేస్తూంటే వండిపెట్టడానికే అంత యిదవుతావేమే'... అంటారు! లేకపోతే తినే వాడికి మొహ మాటం ఉండాలి కానీ వడ్డించే దానికి నీకేం మొహమాటమే' అంటారు. మొన్నటికి మొన్న బాబూరావుగారూ, గోపాలం గారూ వచ్చినప్పుడూ అలానే అన్నారు. అంతకుముందు సువర్ణాక్షి అక్కయ్యా, బావగారూ వస్తే కూడా" అంతకొసిరికొసిరి వడ్డిస్తున్నావేం...వీళ్లేమన్నా మనయింట్లో తిష్ట వేసుక్కూచుంటారా?" అన్నారు. నా మనస్సు ఎంత చిక్కుపోయిందో. అక్కయ్యగారు ఏమీ అనుకొనే మనిషి కాదు కనక సరిపోయిం దనుకోండి; అదే మరొకరయితే ఏమను కుంటారు. మరోరూ మరోరూ అయితే అలా ఎందుకంటానే అంటారు. అదే అలవాట యితే అనకుండా ఉంటారా ఏమిటీ? సూర్య నారాయణశాస్త్రిలుగారూ, మాధవ రామ శర్మగారూ వచ్చినప్పుడు మాత్రం ఊరు కున్నారా...అప్పుడూ అనేసారు. వాళ్లు మిమ్మల్ని బాగా యెరుగుదురు కనక సరిపో యింది కానీ...అదేమిటే పులుసులో ముల క్కాడలు అలానే వదిలేసారూ! మీకెంతో యిష్టమని సౌభాగ్యలక్ష్మి పంపించింది. మీరు తినకపోతే ఆవిడ సాయకాలం వచ్చి నాబుగ్గలు నొక్కేస్తుంది. ఆ అమ్మాయి మరీనూ...అదేమిటో కాని ఖూ రెరిగిన వాళ్లందరూ మీకంటే యిదిగా మాట్లాడ తారు. ఇందరిలోకీ నేనే అసలు మాట్లాడ లేని దాన్నేమో. మాయింట్లో అందరికంటే నేనే ఎక్కువ మాట్లాడతాననుకుంటే నా కంటేనూ...ఇంకో రెండు ములక్కాడలు వేసి కొద్దిగా అన్నంపెడితే పాలోసుకు తింటారుట. అదేమిటే అప్పుడే లేచే సారూ...దొడ్లో నీళ్లు లేవు. కంచంలో చెయ్యి కడిగేసుకోండి. మధ్యాహ్నం కుళాయిలు వదలలేదు. కాస్సేపు నాకు సాయం కూచుంటారుటూ... నేను కూడా అన్నం తినేవరకూ ఇక్కడే కూర్చుంటారుట. అయ్యో నామతీ...ఈ పట్టుచీరనే చెయ్యి తుడుచుకోవటం. తువా

**ఉషశ్రీ**

లదిగో దండెంమీద ఉంది. మూతి కూడా తుడిచేస్తున్నారా. అబ్బా...చాల్లేదురూ... అసలే యిదిగా ఉంటే ఇప్పుడే బుగ్గిల్లాలి కాబోలునేం. నే నింతసేపు మాట్లాడు తున్నా ఊలుకూ - పలుకూ లేదు కానీ నా బుగ్గ కొవాల్సి వచ్చిందనుకుంటూ.

అంతట్లోకే కోపం వచ్చేసిందేమిటి...వాకి ట్లోకి నడవకండి. ఎవరో ఒహరొస్తే కాల క్షేపం మొదలెడతారు. అర్ధరాత్రి పన్నెం డయినా యింక తెమలదా లోకాభిరామా యణం...ఉండండి...పడకకుర్చీ తెచ్చి దొడ్లో మల్లిపందిరి వార వేస్తాను. ఈ వేళ మన దొంతరమల్లి ఎంతనిండుగా పూసిందో. గాలి కదిలిందంటే గుప్పుమంటూన్నది. సుశీల వచ్చి ఓవందమొగ్గ కోసుకు వెళ్ళింది. వాళ్ల లక్ష్మి పొద్దుగూకుతుండగావచ్చి "అత్తయ్య గారూ... మీ మల్లిమొగ్గలేం నాజడలో ఎంత బావుంటాయో...ఎంచక్కా మీరు నాకు తలదువ్వి జడేసి మల్లిదండ పెడతా రుటూ" అంది భడవ. దానికి అయిదేళ్లు నిండా రాలేదు కానీ ఎంత చకచకా మాట్లా డేస్తుందో. అది మీదగ్గరే చదువు కుంటుం దిట. చాల్బాలు. అది యిప్పటికే నాలాంటి వాళ్ళను ఆడించేస్తోంది. ఇంక మీ దగ్గర చదువు మొదలెడితే చెప్ప నే అక్కర్లేదు. ఒళ్లో మేష్టర్ని తినేస్తుంది.

ఇలా కుర్చీలో కూర్చోండి. నేనుకూడా అన్నం తినేసివచ్చి తాంబూలం ఇస్తానేం.. అందాకా యేదన్నా చెప్తూ కూర్చోండి... మీరు మంచిమంచి కథలు చెప్తారుట. నాకు ఒక్కటీ చెప్పరేం...మొన్న లక్ష్మితో పద్మావతిట ఆవిడవచ్చి చెప్పింది. ఆవిడ మీతో చదువుకున్నదిట కాదూ...మీరు వ్యాకరణం కూడా కథలా చెప్పేవారుట. అలాంటివేమీ నాకు చెప్పరేం. అంతే... ఏమన్నా నవ్వేసి ఊరుకుంటారు. అంతేగా అందుకే మా చెల్లి 'బావనవ్వు' అంటుంది. నేనెప్పుడింటికెళ్ళినా అది అలానే అంటుంది.

'ఏమే అక్కా నువ్వు కూడా బావలా నవ్వటం నేర్చుకున్నావా?' అని ఒకటే అల్లరి చేస్తుంది. సిసింద్రిలా...ఉండండి అన్నం కంచంలో పెట్టుకుని వస్తున్నా... ఎంచక్కా వెన్నెట్లో ఎంత బావుంటుందో చిన్నప్పుడేం మేమంతా వెన్నెలకుప్పలాడు కుంటూంటే ఎంత సరదాగా ఉండేదో. ఈ కాలేజీ అమ్మాయిలికి వెన్నెలకుప్పలే తెలీ వుట. మొన్నను సౌభాగ్యం తీసుకొచ్చింది ఓ అరడజనుమందిని. వాళ్లకు మాట్లాడట మన్నా రాదు. ఊరికే ఒకళ్లముఖాలొకళ్లు


**తెల్ల వెంట్రుకలుండవు**

(GOVT REGD)

రంగులనుచూచి మోసపోవద్దు.అది తాత్కాలికము మా సువాసన "మన్ మోహిని హేర్ ఆయిల్" అనేక వనమూలికలతో ఆయుర్వేద పద్ధతిలో తయారైనది. 60 సం॥ ల వయస్సువరకు వెంట్రుకలను నల్లగా వుంచును. ఇదిగాక మెదడుకు చల్లదనము యిచ్చును, ఉన్మాదము, తలనొప్పి వగైరా జబ్బులు రానీయదు. జ్ఞాపకశక్తిని కంటిచూపును వృద్ధిచేయును, కొద్దిగా నెరసివుంటే ఒక సీసా రు. 5-0-0. 3 సీసాలు రు.12-0-0, సగము నెరసివుంటే ఒక సీసా రు. 6-0-0, 3 సీసాలు రు. 15/- పూర్తిగ నెరసివుంటే ఒక సీసా రు. 7/- లు 3 సీసాలు రు. 18/- లు పని చేయలేదని ఋజువుపర్చిన పూర్తి సొమ్ము వాపసు చేయబడును. కోరినవారికి పూచీ.

GENERAL LABORATORIES,
(P. W) P.O. Rajdhanwar (H. Bhag.).

 

# కులపాలిక



దాచుకొని నవ్వటం తప్ప వాళ్ళకేమీ తెలీదు సుమండీ. అబ్బబ్బ... ఈ పచ్చట్లో ఉప్పు సరి పోలేదండీ... ఎలా తిన్నారండీ... అక్కడికి తినేటప్పుడు అడిగానుకొదుటండీ... అద్భుతంగా ఉందన్నారు. అంత ఆలోచన యేమిటో. ఈ పుస్తకాలు వ్రాసేవాళ్ళు మా అన్నయ్యతో మాయింటికి వచ్చేవారు కానీ యింత ఆలోచనతో ఉండేవాళ్ళని ఎరగను సుమండీ. ఆ ఉప్పుబుట్ట కొస్త ఇలా నెట్టండి. ఇదిగో మిమ్మల్నే... ఏమిటి యింతసేపూ మీరు ఆలోచిస్తూనే ఉన్నారా? నేను ఉట్టినోరు తీట వదుల్చుకున్నానా? ఎంతో శ్రద్ధగా వింటూన్నట్టు అలా చూస్తూంటే యింకా వింటున్నారనుకున్నాను. ఇంతా చేస్తే మీ రేదో ఆలోచిస్తూనే ఉన్నారన్న మాట, మహాప్రభో... బ్రహ్మదేవుడి తెలివి తేటలు ఇప్పుడు అర్థమవుతున్నాయి. మా తాతయ్య చెప్పేవాడులెండి. భామతి అని ఓ అమ్మాయి ఉండేదిట. ఆ అమ్మాయికి ఓ మొగుడు—అదేలెండి ఏ అమ్మాయికయినా ఒక్క మొగుడే ఉంటాడు లెండి. ఆ భామతి మొగుడుతో ముప్ఫై యేళ్లు కాపురం చేసిందట, అయినా ఆ అమ్మాయి మొగుడికి ఆ అమ్మాయెవరో తెలీలేదుట. ఉత్తినే నవ్వుతారేం? ముప్ఫై యేళ్ళు కాపరం చేసిందా అని అడిగితే అత్తవారియింట్లో ఉందట. అంతే! మళ్ళీ చూస్తే ఆ అమ్మాయి మొగుడు అలాంటి లాంటి వాడుకాదు. సప్తంగా చదువుకున్నవాడేట మరి. ఆయిల్లాలు ముప్ఫై సంవత్సరాలూ ఆ మహానుభావుడితో ఎలా వేగిందో కానీ... ఆయన యెప్పుడూ వ్రాసుకుంటూనే కూర్చునే వాడుట. అదేం విపరీతమో కానీ, అబ్బబ్బా... చారంతా పానకంలా ఉందండీ; రామరామ... వంటంతా ఈ వేళ యిలా అయిందేమిటో... కొంచెం పచ్చడి వేస్తారా? లక్ష్మితో కబుర్లు చెప్తూ వంట యిలా తయారు చేసాను. పోనుకానీ రమాకాంతం గారు మళ్ళీ పెళ్ళాన్ని పుట్టింటికి పంపేశారుటేం. ఎవళ్ళన్నాం ఏమన్నా అనుకుంటారని లేదేం. పాపం! ఆ అమ్మాయి ఎంతమంచిదీ. ఆ అమ్మాయి కనక వేగుతోంది ఆయనతో. మరెవరయినా మూడో క్షణంలో వదిలేసి పోతారు. లేకపోతే అలాంటి కాపురం ఎవరు చేయగలరూ. నెలకి రెండువందలు తెచ్చుకుంటూ కూడా నెలనెలా మామగార్ని వందా, యాభై పంపమంటే ఎక్కడినుంచి పంపగలరూ. కొండయినా ఒక్కొక్క రాయీ తీసేస్తే కరిగి పోదూ. అదికాక పిల్లనిచ్చుకున్నంతలో వాళ్ళ ఆస్తిఅంతా వీళ్ళకు గుమ్మరించాలని ఉందా ఏమిటి? ఇంత చేస్తే లింగూలింగూ మంటూ ఒక్క యిస్తోకు. వాళ్ళకు రెండు వందలు చాలటం లేదంటే అర్థం ఉందా?

అదిగో చూసారా ... ఎంత గుమ్మ మంటూన్నదో మల్లి పందిరి. గాలి కదిలితే చాలు రయ్యిన వస్తోంది కమ్మగా. మా చెల్లి ఉంటేనా పందిరంతా ఫుణికేసి పక్కల నిండా పోసేసేది. పద్మావతికి మల్లిపువ్వులంటే అసహ్యంట. అదేమిటండీ, ఎవళ్ళకేనా అందమయిన వస్తువుల మీద అసహ్యం ఉంటుందా? వాసన లేకపోయినా రంగుకు మోజుపడి కనకాంబరాలు కూడా తలలో పెట్టుకుంటామే. అలాంటిది ఆ అమ్మాయికి మల్లి మొగ్గలు కోస్తుండగా త్రాచుపాము బుసకొట్టి పగపట్టిందట. అప్పట్నుంచి వాళ్ళ యింట్లో మల్లి అంటు తీసేసారుట. వాళ్ళెవల్లో మల్లి మొగ్గలు పెట్టకోరుట. మాయింట్లో అడవిలా ఉంటుంది మల్లిపందిరి. మా తోటనిండా మొగలి డొంకలుండేవి. త్రాచుపాములు వచ్చేవి కానీ ఎవర్నీ ఏవీ చెయ్యలేదు. ఎంత దుష్ట జంతువయినా దాన్నేమీ చెయ్యక పోతే అది మనల్నేం చెయ్యదు. వెధవ తేలు మాత్రం అలాంటిది కాదు. దానికి మనిషీ, మన్నూ, మశానం అని లేదు. ఊరికే కుట్టుకు పోతూ ఉంటుంది. నిన్నకాక మొన్న మన ఎదురింటి భారతి గారింట్లో చెంబుని కుడితే చిల్లుపడి పోయిందట.

అదిగో అప్పుడే ఎవరో వచ్చినట్లున్నారు ఊరికే అలా తలుపులు బాదకపోతే ఒకటి, రెండు సార్లు పిలిచి వీళ్ళకిష్టంలేదని వెళ్ళి పోకూడదూ. మీరు వెడుతున్నారా... ఉండండీ... ఇంట్లో లేరని చెప్తాను... అబ్బే మీరా నా మాట వినేది. వెళ్ళండి."




జీవితంలో మహోల్లాసం




కాల్గేట్
బొరేటెడ్
బేబీపౌడర్ వాడకంతో

...అందుచేతనే, విజ్ఞులైన తల్లులు తమ పిల్లల అతి సుకుమార శరీరాన్ని బాధాకరమైన చర్మవ్యాధులు సోకకుండా రక్షించడానికిగాను కాల్గేట్ బొరేటెడ్ బేబీ పౌడర్ వాడతారు. అతి మన్నికమైన శరీరాలను మృదువుగా, లాలిత్యంగా వుంచడానికి శాస్త్రీయ పద్ధతులపై తయారుచేయబడింది. తాపమెక్కి ఎంత వేడిమికి చర్మం పెట్లకుండా కాపాడుతుంది —
...రోజంతా చల్లదనమిచ్చి, పిల్లలు సుఖంగా వుండడాని కుపకరిస్తుంది. దాని కమ్మని వాసన మిమ్మూ, మీ పిల్లలను సమ్మోహితులను చేస్తుంది.

ఆదాకు జెయింట్ సైజు కొనండి



కలవరపడు స్త్రీలకు



"కుమారి" మాత్రలు మరువకండి. స్త్రీ ఆరోగ్యం రక్షించును. ఎప్పుడు అవసరం
వెల (సాదా) రు. 3/-
(స్పెషల్) రు. 5/-
(ఎక్స్ట్రా స్పెషల్) 8/-
పోస్టేజి ప్యాకింగు ప్రత్యేకం
Mrs. P. Devee, F.D.S. (AP) Calcutta-40.
స్టాకిస్టు: Indo Medical supplies
No. 3 Pauliappan st, Seven wells
Madras - 1.



బాలి
స్థాపితం 1920
మేహ పాడ. చర్మ. సుఖ వ్యాధులకు గ్యారంటీ చికిత్స
క్యాటలాగు సలహా ఉచితం
రెడ్డి అండ్ కో గోపాలపురం
తూర్పుగోదావరి జిల్లా
(వయా) తణుకు (ఆంధ్రా)
KVR

# రసాభాస

"అయ్యబాబోయ్" అన్న కేక వినిపించింది గట్టిగా.

ఆ భవంతిలో ఉన్న మిగతా మూడు సంసారాలు అదివినవచ్చిన వాకిట నిలచినయి.

"ఏమిటి అమ్మా? అన్నాడు తెలుగు తెలిసిన పెద్ద మనిషి ఒకడు.

"పాముండోయ్" అని పడిపోయింది లత.

"ఎక్కడ? ఎక్కడ?" అంటూ ఆతురతతో ఒక పెద్ద బడిత తెచ్చాడు శ్రీనివాసరావు.

"క్యాహై? క్యాహై" అంటూ అరుస్తున్నాడు సాహెబు ఒకడు.

మిగిలినవాళ్ళుగూడా తలోకఱ్ఱ తెచ్చారు.

సేఠ్ జీ, పెళ్లాం బిడ్డలను "జాగ్రత్త" అని హెచ్చరిస్తున్నాడు జారిపోయే బట్టబిగిస్తూ.

బయట ఒక మంచం వేసి దాని మీద లతను పడుకోబెట్టి మొగాన నీళ్ళు చల్లారు.

కొద్ది సేపటికి తెలివి వచ్చింది ఆమెకు.

లోపల అంతా వెతుకుతున్నారు.

లతకు వణుకు తగ్గలేదు.

సేఠ్ జీ మంత్రించిన విబూది తెచ్చేందుకు దగ్గర ఉన్న పూజారి ఇంటికి కొడుకుని పంపాడు.

సాహెబుకు సంగతిఅర్థమయిందిగాబోలు, ఒక ఇనుపకడ్డీ తీసుకుని తను గూడా బయలుదేరాడు అన్వేషణకు.

లోపల అన్వేషణ జరుగుతోంది.

లతను అమ్మలక్కలు చుట్టు ముట్టారు.

"ఎంత ఉందమ్మా? ఎలా ఉందమ్మా" అన్నది ఒకామె.

"ఇంకా నయం అదృష్టవంతు రాలివి" అన్నది సేఠ్ జీ భార్య పిల్లలను దగ్గరకు తీసుకుంటూ.

ఫలానా చోట చూశానని చెప్పింది లత.

సేఠ్ జీ లోనికివెళ్ళి సంగతి వివరించాడు దూరాన నుంచుని.

దాని వెనుక పెట్టెలున్నాయి. వాటి సందుకుజేరి ఉంటుందన్నారు ఒకరు. జాగ్రత్తగా వాటిని బయటకులాగారు.

"జాగ్రత్త సుమీ" సేఠ్ జీ హెచ్చరిస్తున్నాడు.

పెట్టె లోపల వెళ్ళిందేమోనని సందేహం వెలిబుచ్చి పెట్టె కుమ్మరించాడు సాహెబు.

ఎంత వెదకినా కనిపించలేదు.

"బహుశ ఆ ప్రక్క నున్న వంటగదిలోకి పోయి ఉంటుంది" అన్నారు.

వంటగదిలో అన్వేషణ ప్రారంభమయింది.

ఊరగాయ జాడీలు, అవీ, ఇవీ అన్ని జరిపి చూశారు.

కాని దాని జాడ తెలియటం లేదు.

ఇంతలో విబూది తెచ్చాడు. లతకు కొంచెం పెట్టించాడు సేఠ్ జీ.

తను కొంచెం పెట్టుకొని మిగిలినది తన పెళ్లాం, బిడ్డలను పెట్టుకోమన్నాడు.

వంటగదిలో తలుపులుతీసి ఉన్న అలమర మీదికి పోయింది అన్వేషకుల దృష్టి.

దాంట్లో లతమడి జాడీ లుంచుకుంది.

సాహెబు ఒక్కొక్కటి దింపుతూ, "ఇధర్ హై" అన్నాడు.

"ఎక్కడ, ఎక్కడ?" అంటూ అంతా మూగారు సిద్ధంగా కొట్టి చంపేందుకు.

ఎమ్. సత్యారాయణ

అంతలో సేఠ్ జీగూడ వచ్చి కలిశాడు. దూరాన నుంచొని "అదిగో తోక"అన్నాడు సేఠ్.

అన్నికఱ్ఱలు ఒకేసారి పనిచేసినయి.

కారం జాడీ పగిలి ఒక్కసారి చిందింది. దానివెనుకనుంచి గబాలున క్రిందపడింది.

ఒక్కసారి ముక్కుమీద వేలువేసుకున్నాడు శ్రీనివాసరావు.

"ఆది - ఎంత - పని - చేసింది" అంటూ సాహెబు ఇనుపచువ్వకు పని చెప్పాడు. నెత్తురు కక్కుకు చచ్చింది మూషికరాజం.

మరల రంగంలోకి దిగారు

అలమారులో కనపడలేదు.

తుదిసారి ప్రయత్నంగూడ విఫలమై రంగంలోంచి తప్పుకుని బయటకు వచ్చారు.

సేఠ్ జీ "ఇహ లాభంలేదు. మంత్రించిన ఇసుక తెప్పిద్దాం" అన్నాడు అమ్మలక్కలతో.

అంతలో మూర్తి వచ్చాడు.

బయట మంచంమీద పడుకొన్న శ్రీమతిని చూసి అర్థంగాక కంగారుపడ్డాడు.

గబగబా సేఠ్ జీవచ్చి కథ యావత్తూ వినిపించి "మీ లత అదృష్టవంతులండీ" అన్నాడు.

మూర్తికి అయోమయంగా ఉంది.

సంగతి సందర్భాలు వివరించారు అన్వేషకులు.

"ఇహ లోపలకు రా"అన్నాడు శ్రీమతిని.

బెదురుతూ బెదురుతూ లోపలకువచ్చింది లత.

"ఎక్కడ చూసావో చెప్పు" అన్నాడు మూర్తి.

లత తాను మొదట చూసినచోటు వద్దకు వెళ్లింది.

మూర్తి ఆమె ననుసరించాడు.

అచ్చట పడిఉన్నదాన్ని చూపి "అదేమండీ" అంది లత.

దాన్ని చూడకుండానే కఱ్ఱ ఒకటి తెచ్చాడు మూర్తి. "ఎక్కడ" అంటూ.

లత చూపినదాన్ని జాగ్రత్తగా పరీకించాడు.

పొట్ట చెక్కలయేటట్లు నవ్వి "నీ కండ్లకేమైనా మసగ కమ్మిందేమిటి?" అన్నాడు.

"ఏమిటండీ?" అంది లత.

"అది నా లెదర్ బెల్టు. వంకకు తగిలించింది కిందపడింది" అన్నాడు మూర్తి వచ్చే నవ్వు నాపుకుంటూ.

లతకు ఏడ్వాలో నవ్వాలో తెలియలేదు.

ఇరువురొకసారి ఇంట్లో స్థితిగతులు పరికించారు.

మూర్తికి ఉత్సాహం ఎక్కువయింది.

లత ఏమీ అనలేక సర్దటం ఉపక్రమించింది.

"చప్పనకానీ, ఇల్లు మారుద్దాములే" అన్నాడు మూర్తి.

లత ఒక వాల్చూపు విసరింది "ఊ" అంటూ.

ఆరాత్రి...

"ఏమండీ ఈ సంగతి ఎవరికీ తెలియనీయరుగదూ! మీరు చాలా మంచివారు" అంది లతదగ్గరకు జరుగుతూ.

"అలాగే దేవి" అంటూ లతను దగ్గరకు తీసుకున్నాడు మూర్తి గుప్పుమంటున్న సన్నజాజుల పరిమళం భరించలేక.

లత మాలతీలతలా అల్లుకుపోయింది. ★

# ఆచార్య విభ్రాంతి

## ప్రాచీన గాథాలహరి

పి. గణపతిశాస్త్రి

8

[గతసంచిక తరువాయి]

విదర్భాధిపతి తన అపార సైన్య సంపత్తితో మాళవ రాజధాని మీదికి దండెత్తి వచ్చాడు. క్రమక్రమంగా ఆ విషయం అమరుకదేవునికి పూర్తిగా స్పష్టపడింది. అయినా అతడెక్కడా చెక్కు చెదరలేదు! శాయశక్తులా యుద్ధ ప్రయత్నాలు చేయించాడు. అంతవరకు వినోద విలాసాలలో మునిగి తేలుతున్న మాళవ రాజధానిలో ఆ వార్త ఒక్క మారుగా దిగ్భ్రాంతి కలిగించింది!

విదర్భ సైన్యాలతో పోలిస్తే మాళవ సైన్యం అత్యల్పమనీ, అమరుకదేవుని కా యుద్ధంలో పరాజయం తప్పదనీ రాజ్యవర్ధనుడు భయపడ్డాడు. అయినా అతడు మహారాజాజ్ఞ ననుసరించి రాత్రింబవళ్లే పనిగా యుద్ధసన్నాహాలు చేయించాడు.

ఆయుద్ధంలో తనకిక ఘోర పరాజయం తప్పదనీ, అయినా వీరమరణమే శరణ్యమనీ, తన కాపరిస్థితిలో అదే మహాభాగ్యమనీ అమరుకదేవుడొక స్థిరనిశ్చయానికి వచ్చాడు.

అతడు లీలావతి మృతి క్షణంవరకు జీవిత భాగ్యభోగాలన్నీ యథేచ్ఛగా అనుభవించాడు. ఆ ఆనందతన్మయతతో మైమరిచి తదితర విషయాల గోడే విస్మరించాడు. అయితే లీలావతి మృతితో అతని జీవితాని కొక బలమైన బల్లెపుపోటు నాటుకుంది. చూస్తూ ఉండగానే సమస్తము కలకరిగి పోతున్నట్టు స్ఫురించింది.

ఆపైన మీద మీద విరుచుకు పడనున్న సమర పరాజయ భీభత్సంలో అతనికి ఆ రాజ్యం భాగ్యభోగ్యాలు అన్నీ కేవలం కూరు మరీచకలే అని తోచింది.

రాజ్యానికి వచ్చిన కొత్తలో అతడు విద్యా వయో వృద్ధుల వేదాంతోపదేశాలు, పౌరాణిక సూక్తులు వినక పోలేదు. కాని ఆ సమయంలో అవేవీ అతని చెవి కెక్కలేదు! లీలావతి మృతితో ఆ ఉపదేశాల అంతరార్థం అతనికి కొంతవరకు స్పష్టపడింది. నేడో రేపో పెను ప్రళయమై విరుచుకు పడనున్న మహాయుద్ధభీభత్సంలో ఆ వేదాంతోపదేశాలతని కళ్లకెదురుగా భీకర శిలాస్తంభాలై నిలిచాయి!

తాను ఇతరో! నిత్యము మహానదీ ప్రవాహంలా పరవళ్లు దొక్కుతూ ముమ్ముందుకు సాగిపోయే జీవిత పరమార్థమేమో! నిరంతర ద్వంద్వాలై భాసించే జీవన మరణాలకు, సుఖదుఃఖాలకు, లోలోపల అనుస్యూతమై వెలిగే పరమ రహస్యమేమో!

ఆ విషమైన మథన క్షణక్షణము, అతని అంతరాంతరాలలో ఎలుగెత్తి ఘోషించింది.

కాని అమరుకునికా మథన సమన్వయించే మార్గమేదీ కనబడలేదు. కాని ఆ సందేహాలతన్ని పట్టుకుని వేధించడం మానలేదు. ఇక గత్యంతరం లేక అతడు నిరంతర మదిరాపానంతో మత్తెక్కి మైమరిచాడు!

ఒకనాటి సాయంకాలవేళ రాజ్యవర్ధనుడెంతో ఆత్రంగా అతని దగ్గిరికి పరుగెత్తుకు వచ్చాడు:

"మహాప్రభూ! శత్రువులు పురద్వారం సమీపిస్తున్నారు! వారి అపార సేనావాహిని ఎంతో ఎవరు లెక్కపెట్టలేక పోతున్నారు!"

మహామాత్యుడలాగే తెల్లబోయి నిలుచున్నాడు. అమరుకుడతని భయోద్వేగం గమనించి గట్టిగా గర్జించాడు:

"ఈయుద్ధంలో నేనే స్వయంగా సేనాధిపత్యం వహిస్తున్నాను. రణభేరి మ్రోగించి సైన్యాలన్నిటికీ జైత్రయాత్ర ఘోషించండి! ఆలస్యాదమృతం విషం! కదలండి! అలాగ నిర్ఘాంతపోయి చూస్తారేమిటి?"

రాజవర్ధనుడొక్క అంగలో అక్కడినించి కదిలి వెళ్ళిపోయాడు. అమరుకుడా విధంగా కళ్లు మూసుకుని యుద్ధరంగంలో కురకగలడని అతడెన్నడు ఊహించలేదు! తీరా యుద్ధప్రళయమే ముంచుకువస్తే, మహారాజేదో విధంగా సంధిమార్గం అవలంబింపక పోడని అతని నమ్మిక! నిత్యము భోగలాలసతోను, అలసతతోను మైమరచిన అతడా విధంగా కళ్ళు మూసుకుని రణరంగంలో కురకగలడని మహామాత్యుడు కలనైనా ఊహించలేదు! ఇప్పుడతని ఊహాలన్నీ వట్టి అపోహలై ఎగిరిపోయాయి!

మహామాత్యుడమరుకునికి శత్రుసైన్య వార్త వినిపించేసరికి సాయంకాలం గోధూళివేళ సమీపించింది.

ఆ రోజుల్లో రాత్రివేళ యుద్ధం ధర్మసమ్మతం కాదు. అందుచేత మాళవ విదర్భ సైన్యాలు రెండు ఆ మరునాటి ఉదయం ప్రారంభింపబోయే మహాయుద్ధానికి ఉవ్విళ్ళూరుతూ మహోత్సాహంతో ఎదురుచూస్తున్నాయి.

అమరుకుడానాటి రాత్రి తెల్లవార్లు మేలుకునే ఉన్నాడు. సైన్యాధిపతులందరికీ ఆ యా సమయాలలో అనుసరించవలసిన యుద్ధపద్ధతులు, వ్యూహరచనలు వేర్వేరుగా వివరించి బోధించాడు. వారంతా అతని అచంచల ధైర్యము, వ్యూహరచనా నైపుణి చవిచూచి నిర్ఘాంతపోయారు. అతని ధైర్యోత్సాహాల ధోరణి చూడగానే వారికి కూడా కొండంత ధైర్యం కలిగింది. శత్రువు లెంత సైన్యంతో దండెత్తి ఎత్తివచ్చినా వారిని జయించి తీరగలమని గుండెనిబ్బరం కలిగింది.

ఆ మరునాటి ప్రాతఃకాలం వేళ రణభేరి భీభత్సంగా మార్మోగింది. అమరుకుడొక మారంతఃపురంవైపు వెళ్ళాడు. అతని యోధవేషం చూచి రాణులందరు చుట్టూ గుమిగూడారు. అమరుకదేవుడు కొంతసేపం దరితోను అంటీ అంటనట్టుగా ఇష్టాగోష్ఠి జరిపి వెనువెంటనే అక్కడినుంచి కదిలి వెళ్ళి

పోయాడు. అతని భలోక్తుల ధోరణిని బట్టి రాణులు మహారాజెంతో ఉల్లాసంగా ఉన్నాడని గ్రహించారు. యుద్ధంలో మాళవదేశానికే దిగ్విజయం కలగ గలదని నిశ్చయించారు. అయినా దిగ్విజయం కోరుతూ గృహదేవతలందరికీ బలులర్పించి పూజాపునస్కారాలు చేయించారు.

## ౮

ప్రయాణ రణభేరీధ్వని గంభీరంగా మారుమోగింది. అమరుకదేవుడు క్షణంలో తన ఉత్తమాశ్వం పైకెక్కి కూర్చున్నాడు. తిరిగీ రణభేరి గంభీరంగా మారుమోగింది. మాళవ సైన్యాలన్నీ యుద్ధరంగాని కురకలు వేసుకుంటూ పరుగులు పెట్టాయి. భేరీ ధ్వనులు అదేపనిగా మారుమోగుతున్నాయి. అమరుకుడొక్కమారు వెనుతిరిగి చూచాడు. ఒక్క వేడినిట్టూర్పు విడిచిపెట్టాడు. లీలావతి రాజప్రాసాదంపై నిలబడి అతనివైపు రెప్పపాటు లేకుండా తిలకిస్తున్నట్టు కనబడింది. అమరుకుడు మళ్ళీ ఇంకొకమారు పరిశీలనగా చూచాడు. ఉత్తరక్షణంలో అది కేవలం భ్రాంతిమాత్రమే అని స్పష్టపడింది. అతని చెక్కిళ్ళపై రెండు కన్నీటిబిందువులు దిగజారాయి.

ఆ స్మరణతో అతనికి రణరంగంలో కురికి వీరస్వర్గం చూరగొనవలెనన్న సంకల్పం మరింత బలపడింది. తనకు, తన రాజ్యానికీ ఆ క్షణంతో ఋణం తీరిపోయినదని స్ఫురించింది.

అమరుకదేవుడు రణభేరీ కోలాహలంతో యుద్ధరంగంవైపు సాగిపోతూంటే రాజవీథులలో ప్రాసాదాలపై నిలబడిన పుణ్యపురంధ్రులతనిపై లాజపుష్పవర్షం కురిపించారు. ప్రాచీనకాలంలో జైత్రయాత్రకు బయలుదేరే మహారాజులపై పేలాలు వెదజల్లి ఆశీర్వదించడం ఒక అనూచాన సంప్రదాయం. ఆ సంప్రదాయం ప్రకారమే రాజధానిలోని పుణ్యకాంతలందరు అమరుకదేవుని శిరస్సుపై లాజలతో కలిపిన ఆశీర్వర్షం కురిపించారు.

మహారాజా పుణ్యపురంధ్రులందరికీ సవినయంగా చేయెత్తి నమస్కరించాడు. ఆ క్షణంలో ఆ మహానగర రాజవీథులు మరి తన కంటబడవని అతనికి స్ఫురించింది.

మళ్ళీ అతని హృదయంలో పూర్వస్మృతులన్నీ వరసగా పురివిప్పి నృత్యం చేశాయి. ఆ మహానగరంలో తన జీవితం అంతా ఒక లిప్తలో గడిచి అదృశ్యమై పోయినట్లతనికి తోచింది. అతి డొక్క నిట్టూర్పు విడిచి నిర్లిప్తభావంతో అలాగే ముమ్ముందుకు సాగిపోయాడు. తన పూర్వ జీవితానుభూతులన్నీ పూర్తిగా విస్మరించి వెయ్యాలని నిశ్చయించుకొన్నాడు. కాని ఒక్క లీలావతీ స్మృతి మాత్రం అతని హృదయంలో నీడలా కదలాడడం మానలేదు.

సరిగా అదేసమయంలో విదర్భ దేశ సైన్యం ఒక్కుమ్మడిగా మాళవసైన్యంమీద విరుచుకుపడింది. దానితో మాళవసైన్యంలో అంతటా ఒక పెద్ద కోలాహలం చెలరేగింది. ఆధాటి కాగలేక మాళవసైన్యం కొంతసేపు వెనకంజ వేసింది.

అమరుకుడెలుగెత్తి తన సైనికులందరికీ హెచ్చరిక చేశాడు. విజయమో, వీరస్వర్గమో తప్ప మరి మధ్య మార్గమేమీ లేదని హుంకరించాడు. కళ్ళు మూసుకొని తానే ముమ్ముందుగా శత్రువ్యూహంలో చొరబడ్డాడు.

మాళవసైనికులాతని ధైర్య సాహస పరాక్రమాలు చూచి నిర్ఘాంతపోయారు. మళ్ళీ మహోత్సాహంతో విదర్భ సైన్యంలోలోపలికి చొచ్చుకుపోయారు. శత్రుసైనికులు వారిధాటికాగలేక చెల్లాచెదరై పారిపోయారు.

మాళవసైన్యంతో పోలిస్తే విదర్భ సైన్యం చాలా పెద్దది. మాళవసైనికు లల్పసంఖ్యాకులయినా ధైర్యోత్సాహాలతో వీరవిహారం చేశారు. అపారపారావారంలా విస్తరించిన విదర్భసైన్యం మాళవసైన్య వీరవిహారధాటి కెదురొడ్డి నిలబడలేక చెదిరి పారిపోయింది. విదర్భ సేనాధిపతులందరికీ అది ఒక పెద్ద తలవంపయింది.

ఆ సైన్యాధిపతులా అవమానం భరించలేక తమ సైన్యాల నొక్కచోటచేర్చి అనేకవిధాలుగా ప్రోత్సహించారు. కళ్ళు మూసుకుని మళ్ళీ మాళవసైన్యంతో తలపడవలసిందని ప్రోత్సహించారు. అటుపిమ్మట గోధూళివేళ వరకు ఉభయసైన్యాలకు ఘోర యుద్ధం జరిగింది.

ఆ ఘోరయుద్ధంలో మాళవ సైన్యంలో మరణించినవారి సంఖ్య క్షణక్షణానికి పెరిగిపోయింది. క్రమంగా మాళవసైన్యాధిపతులందరికీ విజయాశ సన్నగిలింది. అయినా అమరుకదేవుడంతటితో నిరుత్సాహపడలేదు. ముందు వెనకలు చూడకుండా కళ్ళుమూసుకుని శాత్రవసైన్యంలో చొరబడ్డాడు. విదర్భ సైనికులదనుకనిపెట్టి ఒక్కుమ్మడిగా అతనిమీద కురికారు. అమరుకుడు వారిలో చాలామందిని హతమార్చివేశాడు.

కాని ఆ సంకుల సమరంలో అతని శిరస్సుపై ఒక పెద్ద గదాఘాతం తగిలింది.



# ★ ఆచార్య విభ్రాంతి ★

ఆ అఘాతానికి తట్టుకోలేక అతడలాగే తన అశ్వంమీద కూలబడిపోయాడు.

అమరుకదేవుని కొంతరవాత బాగా స్పృహతప్పిపోయింది.

అది కనిపెట్టి మాళవసైన్యాధిపతు లతనికి సహాయం చెయ్యడంకోసం శాయశక్తులా ప్రయత్నించారు.

అమరుకదేవునికి మరి ఆనాటి అర్ధరాత్రి వరకు స్పృహకలగలేదు. తిరిగి స్పృహ కలిగిన కొంచెం కళ్లుతెరిచి చూసేసరికి అతనికి తన పరిసరాలన్నీ అత్యద్భుతంగా కనిపించాయి. కొంతసేపటివరకు అతడది మరి ఒకలోకమేమో అని భ్రమపడ్డాడు. అతని కనతిదూరంలో ఒక సన్ననిదీపం వెలుగుతూంది. చుట్టూ యుద్ధకోలాహలం కొంచెమైనా వినబడలేదు. అంతా ప్రశాంతంగానే కనిపించింది. అతడొకమారు లేచి కూర్చుని నాలుగువైపులా పరకాయించి చూడాలని అనుకున్నాడు. కాని శరీరం స్వాధీనంకాలేదు. శరీరం కేసి చూసుకొన్నాడు. ఒళ్లంతా గాయాలే! కట్లే! అప్పటికతనికి తనపరిస్థితికి కొంతవరకు బోధపడింది.

౯

అంతలో కింశుకప్రభ గుడ్ల నీరుగుక్కుకుని అతనికెదురుగా వచ్చి నిలబడింది. అమరుకు డామెవైపుచూచి క్షీణస్వరంతో ప్రశ్నించాడు.

"యుద్ధరంగంలోంచి నన్నెక్కడి కెవరు తీసుకువచ్చారు! మన సైన్యాలేమై పోయాయి?"

కింశుకప్రభ గద్గదస్వరంతో సమాధానం ఇచ్చింది:

"తాము రణరంగంలో మూర్ఛపోయారు! దైవశాత్తు అప్పటితో సూర్యాస్తమయ మయింది.

"మనసైన్యాధిపతులు మిమ్మల్ని భద్రంగా ఇక్కడికి తీసుకువచ్చారు."

కింశుకప్రభ సంగ్రహంగా యుద్ధరంగంలో జరిగిన విశేషాలతనికి తెలియజేసింది. శత్రుమధ్యంలో చిక్కుపడి మూర్ఛపోయిన అమరుకదేవుని సంరక్షణ మాళవసైనికులకు మొట్టమొదట దుష్కరంగానే తోచింది. అయినా అతికష్టంమీద వారతని నెలాగో అలాగ సంరక్షించి సురక్షితంగా మాళవసేనాస్కంధావారానికి జేర్చారు.

అటు పిమ్మట రెండుమూడు రోజులవరకు మాళవ విదర్భ సైన్యాలమధ్య ప్రచండయుద్ధం చెలరేగింది. అప్పటికి అమరుకదేవునికి కొంత స్వస్థత కలిగింది. కాని రాజ్యవర్ధనుడతనిని తిరిగి యుద్ధరంగంలోనికి పోనీయలేదు. సంపూర్ణారోగ్యం కలిగేవరకు మహారాజు మరి యుద్ధరంగంవైపైనా చూడరాదని రాజవైద్యులాదేశించారు. అమరుకునికింకా పూర్ణారోగ్యం కలగలేదు. అందుచేత అతనికి రాజవైద్యుల ఆదేశం శిరసావహించక తప్పలేదు.

అయినా అతడు యుద్ధపరిస్థితులన్నీ అతి జాగరూకతతో గమనిస్తూనే ఉన్నాడు. అప్పటికి యుద్ధం ప్రారంభించి అయిదారు రోజులయింది. క్రమక్రమంగా మాళవ సైన్యం ధైర్యోత్సాహాలు నీరసించాయి. మాళవసైన్యాధిపతులందరు ఏదోవిధంగా సామరస్యమార్గం అవలంబించడమే మంచిదని మహారాజుతో విన్నవించారు. అమరుకునికది మహావమానకరంగా తోచింది:

"ఈ పరిస్థితిలో సామరస్యపద్ధతి ఏదీలేదు! విదర్భాధిపతి కేవలం పగతీర్చుకోడానికే మనపై దండెత్తి వచ్చాడు. మనంచేసిన దానిలో క్షత్రియ ధర్మవిరుద్ధమయినది అణువంతయినా లేదు. ఇంతకీ మన తప్పేముంది? సామరస్యమార్గం అవలంబించవలసినది వారే కాని మనం కాదు!"

మంత్రులకు, సైన్యాధిపతులకు అతని మాటలలోని ఔచిత్యం గోచరించకపోలేదు. మహామాత్యుడు రాజ్యవర్ధనుడుకూడా ఆ పరిస్థితిలో అంతకన్న చేయగలిగినదేమీ లేదని అంగీకరించాడు. దానితో సైన్యాధిపతులందరు తలలువంచుకొని నిష్క్రమించారు.

తిరిగి మాళవ విదర్భ సైన్యాలమధ్య భీకర సమరం ప్రారంభమయింది. అమరుకు డనుక్షణము యుద్ధధోరణి జాగ్రత్తగా పరిశీలిస్తూనే ఉన్నాడు. ఆనాడు మాళవ సైన్యం చెల్లాచెదరై తిరిగి వచ్చింది. ఆ మరునాటితో


మీరు ఎప్పుడు రుచి చూడని చాలా మంచికాఫీ...

...మీరు కొనగల ధరలకు!






స్టేన్సు ఎర్రలేబిల్ ప్యూర్ కాఫీ మీకు కోరిన రుచి, బలము నాణ్యతేగాక ఎన్నో కప్పుల కాఫీకూడ యిచ్చును. ప్రతి ప్యాకేజీపై స్టేన్సు పేరు చూచి మరీ కొనండి. సాటిలేని నాణ్యతకు అదే మీగ్యారంటీ దాని తాజాదనము చెడకుండా గాలి చొరనట్లు ½ పౌ. 1 పౌ. 3 పౌ. 7 పౌ. 14పౌ. & 20 పౌనుల టిన్నులలో ప్యాక్ చేయబడినది.

నేడే ఒక టిన్ను కొనండి. ఎర్రలేబిల్ ప్యూర్ కాఫీనే కోరండి.

ది యునైటెడ్ కాఫీ సప్లై కంపెనీ లిమిటెడ్,
కోయంబత్తూరు, దక్షిణ ఇండియా

మహబూబ్ నగర్ ఏజెంట్లు: మెసర్సు ఎస్. మల్యాల & సన్సు జనరల్ మర్చెంట్సు, మహబూబ్‌నగర్.
పశ్చిమ గోదావరి డిస్ట్రిబ్యూటర్లు: మెసర్సు శ్రీపాద నరసింహం బ్రదర్సు, జనరల్ మర్చెంట్సు, పాలకొల్లు, ఏలూరు.



మాళవసైన్యానికి సంపూర్ణ పరాజయం తప్పదని అందరు నిరాశచేసుకున్నారు.

అమరుకుడానాటిరాత్రి అంతా మేలుకొనే ఉన్నాడు. ఆ మరునాడవసరమైతే తానే యుద్ధరంగంలోనికి హతశేషులయిన సైనికులతోపాటు వీరస్వర్గం చూరగొనాలని నిశ్చయించాడు.

అప్పటి కర్ధరాత్రి గడచింది. అమరుకుడు తన రాజప్రాసాదంలో పై అంతస్తులో కూర్చుని శత్రుసైనికుల గుడారాలవైపు చూస్తున్నాడు. దూరదూరంగా యుద్ధరంగంలో మరణశయ్యలపైపడి దీనంగా ఆక్రోశించే సైనికులదారుణ రోదనధ్వను లతని కర్ణకుహరాలలో మారుమోగాయి. ఆ ఆక్రందన ధ్వనులతో జంబుకాక్రందనాలు మరింత విజృంభించాయి. అతనికి జీవితం అంతా కేవలం బీభత్సమయంగా కనిపించింది. అతడా భయంకరార్తనాదాలన్నీ వింటూ కూర్చున్నాడు. ఒకమారతని హృదయంలో, ప్రశాంతంగా కన్నుమూసిన లీలావతీముఖం ప్రతిబింబించింది. అమరుకుని నేత్రాంతాలలో కన్నీటి బిందువులు నిలిచాయి.

ప్రపంచంలో అంతటా గాఢాంధకారం! అతని హృదయంలోం అంతకన్నా గాఢాంధకారం! అమరుకుని హృదయంలో మళ్లీ ఆందోళన ప్రారంభమయింది! కాని ఆ భయంకరపరిస్థితిలో అతని కేమీతోచలేదు!

ఆందోళనపూరితమై అలిసి సొలిసిన అతని హృదయంలో ఒక హెచ్చరిక గంభీరగా మారుమోగింది. అతడది శ్రద్ధగా ఆలకించాడు:

"తత్త్వమసి!
తత్త్వమసిరాజన్!"
"రాజా! నీవా పరమా
త్మ స్వరూపుడవు సుమా!
నీవాపరమాత్మ స్వరూపుడవుసుమా!"

ఆ హెచ్చరిక అర్థం అది! అతడు మళ్లీ మళ్లీ ఆహెచ్చరిక విన్నాడు! అంతటి అర్ధరాత్రి సమయంలో ఆ హెచ్చరిక ఎక్కడి నించి బయలుదేరినదో అతనికంతు బట్టలేదు!

అతడు నాలుగు వైపులా గాలించి చూచాడు. దూరదూరంగా రాజవీధిలో అంతటా ఆ హెచ్చరిక మాటిమాటికీ అదే తీరులో ప్రతిధ్వనించింది! అనేక గాత్రాలేకమై ఒకే కంఠస్వరంతో ఉచ్చరించినట్లది మారుమోగింది!

భిక్షుకులెవరో ఆ విధంగా గొంతెత్తి అరుస్తున్నారని అతని కనుమానం వేసింది. కాని ఆ గంభీరనాదంలో అతని కెక్కడా యాచకదైన్యం గోచరించలేదు!

ఆ హెచ్చరిక వినగానే అతని హృదయంలో ఒక మహాసముద్రమేదో ఉప్పొంగినట్లయింది. హఠాత్తుగా తన్నెవరో వెన్ను చరిచి మేలుకొలిపిన విచిత్రానుభూతి కలిగింది. క్రమక్రమంగా అతని హృదయంలో ఒక పెద్ద ఆరాటం ప్రారంభమయింది. కాని ఆ ఆరాటానికి గల మూలకారణమేమో అతనికే తెలియలేదు!

ఆ హెచ్చరిక సవ్వడు లతనికేవో పూర్వజన్మలో పరిచితమయిన కంఠస్వరాలలాగే వినిపించాయి. కాని అతనికవి స్పష్టంగా గుర్తుకు రాలేదు! అమరుకుడలాగే ఆలోచిస్తూ కూర్చున్నాడు. తెల్లతెల్లవారే వేళ దగ్గిరపడింది. కాని అంధకారచ్ఛాయలింకా బాగా విడిపోలేదు.

అంతలో నెమ్మది నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ కింశుకప్రభ అతనిదగ్గిరికి వచ్చి నిలబడింది. ఆమె అందెల సవ్వడివిని అమరుకదేవు డామెవైపు చూచి నెమ్మదిగా ప్రశ్నించాడు.

"కింశుకప్రభా! ఆ హెచ్చరిక సవ్వడి విన్నావా? అదిగో విను!"

అతడు తిరిగి ఏకాగ్రహృదయంతో ఆ సవ్వడి విన్నాడు. కింశుకప్రభకు కూడా ఆ ధ్వని వినిపించింది:

"అవును! కాషాయధారు లయిన యతీశ్వరులెవరో ఆవిధంగా హెచ్చరిస్తూ వెళ్ళిపోతున్నారు! అగుగో!"

కింశుకప్రభ వేలెత్తి వారివైపు చూపించింది. అమరుకుడు లేచి నిలబడి ఆవైపుగా చూచాడు. మసకమసక చీకటిలో అతనికి వారిముఖాలేవీ స్పష్టంగా కనిపించలేదు. కంఠధ్వనులు మాత్రం తిరిగి గంభీరంగా మారుమ్రోగాయి. వారొక గడియవరకు నిర్విరామంగా అలాగే గొంతెత్తి హెచ్చరించారు. అంతలోనే ఒకవీథి మలుపులో పడి అదృశ్యులయినారు. అమరుకదేవుడెంతో ఆత్రంగా కింశుకప్రభ కేసి చూచాడు:

"వారినందరినీ ఒక్కసారు కళ్ళారా చూడవలెనని ఉన్నది. వారికి నా విన్నపం తెలియజేసి తెల్లవారగానే ఒక్కమారిక్కడికి తోడుకొని రాగలవా?"

ఆ ప్రార్థన విని కింశుకప్రభ ఆశ్చర్యపోయింది.

"దీనికంత ప్రార్థన చేయవలసిం దేమిఉంది. తమ సంకల్పం వినగానే వారంతట వారే ఇక్కడికి వస్తారు. తెల్లవారగానే వారినందరినీ తమ సన్నిధికి తీసుకు వస్తాను. సరికదా! ఇదిగో ఇప్పుడే వెళ్ళిపోతున్నాను."

ఆమె వెంటనే అక్కడినుంచి వెళ్ళిపోయింది. క్రమక్రమముగా బాగా తెల్లవారింది. రణరంగంలో మళ్ళీభయంకరభేరీ నినాదాలొక్కొక్కటిగా మారుమోగాయి. అది విని అమరుకుడొక ప్రతిజ్ఞ పట్టాడు:

"ఆ యతీశ్వరుల దర్శనం చేసి వెంటనే రణరంగానికి వెళ్లిపోతాను! ఈనాటితో ఈ మహాసంగ్రామం అటో యిటో తేలిపోతుంది! అంతే!"

క్రమక్రమంగా యుద్ధభేరీ ధ్వని భూనభోంతరాళాలు దద్దరిల్లేటట్లతి భీభత్సంగా మారుమోగింది!

—సశేషం.


ముప్పది యేండ్లకుపైగా ప్రఖ్యాతిగాంచినది

రాజా (REGD) కస్తూరి సబ్బు

మీ రాజభోగ్యమైన స్నానమునకు కస్తూరి సుగంధము నొసగు ఈ సబ్బును వాడుడు.

RAJA (REGD) Kasturi Soap MANYAM & Co. BANGALORE

రాజా (REGD) బార్ సబ్బు

మీ యింటిలో శుభ్రపరచు పనులన్నిటికీ ఈ సబ్బు అతి సులవైనది, మితవ్యయంగలది.

RAJA BAR SOAP

రాజా స్నో

Wanted Agents to sell
RAJA KASTURI SOAPS
& BAR SOAPS
for each District all over India
Write for particulars:
MANYAM & CO.,
Raja Snow Buildings, Bangalore-3
Branches:
Bombay, Madras, Madurai.

RAJA SNOW MANYAM & CO BANGALORE

GP

నాటిక:

# మరోలోకంలో

[జనకోలాహలం]

గద్దపాయన: సోదర సోదరీమణులారా! క్షమించాలి... ఇక్కడ సోదరీమణులు ఒక్కరు కూడా ఉన్నట్లు లేదు... [గొంతు సవరించుకొని]...సోదరులారా!

[కాస్సేపు నిశ్శబ్దం]

విశ్వం: ఏం ఆగిపోయాడేం? అరే! నోరు కదులుతూనే ఉంది. మరి...వాడి మాటలు నాకు వినపడడం లేదేం? "ఎవడీ గద్దపు మనిషి? ఎందుకలా విచిత్రంగా నోరు కదిలిస్తున్నాడు? వాడి ముందు అంతమంది అలా మౌనంగా ఎందుకు కూర్చుని ఉన్నారు? ఇదేం కలా? ఏమిటీ విచిత్రం? ఈ ప్రపంచానికి ఏం పట్టింది? అరే! నా ఒంటి మీద ఎవరో చేతులు వేస్తున్నారు. ఎవడితను? డాక్టర్ లా ఉన్నాడే! నన్నెందుకు పరీక్ష చేస్తున్నాడు? అసలింతకీ నేనిప్పుడు ఎక్కడ పడుకొని ఉంట?

[జోరుగా గాలి వీస్తుంది]

ఇదేమిటి? చెట్లు, మనుష్యులు కొట్టుకుపోయేలా ఇలా గాలి వీస్తుందేం చెప్మా?... అమ్మ బాబోయ్! నన్ను కూడా ఈ గాలి ఎగరేస్తోంది. తేలిపోతూంది నా శరీరం... నా శరీరం తేలిపోతుంది...రక్షించండి! రక్షించండి!...

తండ్రి: ర-క్షి-స్తు-న్నా..ర-క్షి-స్తు-న్నా.

విశ్వం: ఎవరది? నన్ను పట్టుకుంది ఎవరు?

తండ్రి: నేను.

విశ్వం: [కోపంగా] నేనంటే? [వెంటనే ఆశ్చర్యంగా] ఆఁ! మీరా? ఇక్కడెందుకున్నారు? ఏం చేస్తున్నారు?

తండ్రి: చచ్చి స్వర్గాన ఉన్నా.

విశ్వం: అదేమిటి-పైన ఎక్కడో గాలిలో విచిత్రంగా ఉన్నారు!... కిందికి రండి... నాన్నా!...అదేమిటి నాన్నా?...

తండ్రి: హుఁ...నాన్న?... నాన్నట-నాన్న! ఎవడ్రా నీ నాన్న? నీకు నాన్నా లేడూ; నాకు కొడుకూ లేడూ.

విశ్వం: అదేమిటి నాన్నా?

తండ్రి: నీ చెల్లాయి పెళ్లికి నాలుగు వేలు ఖర్చు పెట్టమంటే, రెండు వేలతోనే సరి పెట్టేస్తావట్రా వెధవాయ్!

విశ్వం: అదికాదు నాన్నా...మరేం—

తండ్రి: అదో—నాన్నా అని ఆ కూత కూయకు.

విశ్వం: నా మాట వినండి... ముందు నే చెప్పబోయేదివినండి. తర్వాత మీరుమాట్లాడవచ్చు.

తండ్రి: వినదలచుకోలేదు. రెండేళ్ల క్రితం నా సాంవత్సరీక మప్పుడు - ఆ ఉదయాన-ఎవ్వరికీ తెలియకుండా ఆ మిలిటరీ హోటల్ కు వెళ్ళి, ముక్కలవరకు దొంగతనంగా మెక్కుతావట్రా, అప్రాచ్యపు వెధవా!

[ఇంతలో గుడిగంటల శబ్దం]

విశ్వం: నాన్నా ... ఆగండి ... వెళ్ళిపోతున్నారేం?

## జి. వి. జి. కృష్ణ.

తండ్రి: ఆగను ... ఆగలేను ... అదో-ఆ గంటలు వినబడటంలా? ... అది పిలుపు. వెళ్లాలి లేకపోతే—

విశ్వం: [ఆత్రంగా] ఊఁ ... లేకపోతే?

తండ్రి: [కోపంగా] నీకెందుకూ?

విశ్వం: నాన్నా!

తండ్రి: అదో - ఆ కూత కూయవద్దనలే?

విశ్వం: ఆ గంటలు ఎక్కడ్నించి వినవస్తున్నాయ్?

తండ్రి: అలా చూడు...అక్కడ రెండు దేవాలయాలు పక్క పక్కనే ఉన్నాయిగా?

విశ్వం: అవి దేవాలయాలా? అలా ఉన్నాయేం?

తండ్రి: అవి అంతే ... ఒకటి టి. వెంకటేశ్వర్లు గుడికి అనుకృతి. రెండోది పి. జగన్నాథం ఆలయానికి అనుకృతి.

విశ్వం: టి. వెంకటేశ్వర్లు - పి. జగన్నాథమా?!

తండ్రి: అవును ... టి - అంటే తిరుపతి వెంకటేశ్వర్లు. పి-పూరీ జగన్నాథం.

[గాలి]

విశ్వం: నాన్నా. [బిగ్గరగా [నాన్నా.

[గాలి జోరుగా వీస్తుంది]

ఒకడు: ఏరా, మన విశ్వం ఈ మధ్య ఎక్కడా కనిపించడం మానేశాడేం?

రెండవ: ఏమో....

ఒకడు: వాడికీ, నీకూ బంధుత్వం కూడా ఉందటగా?

రెండవ: ఆఁ...అదేం బంధుత్వంలే... వాడికిస్తామన్న పిల్లను నాకిచ్చి పెళ్లి చేశారు ...అంతే.

విశ్వం: ఆఁ—ఎవరిదీ?...ఒరేయ్ రామలింగం. నేను నీకు బంధువుని కానట్రా?

ఒకడు: ఏమండీ?

రెండవ: ఆఁ?

ఒకడు: మీరిప్పుడేమైనా మాట్లాడారా?

రెండవ: లేదే.

ఒకడు: ఎవరో మాట్లాడి నట్లనిపించింది.

రెండవ: అబ్బే—ఎవరూ లేరు—ఎక్కడో ఓ పాడుదోమ గుంయ్‌మని సంగీతం పాడుతూన్నట్లుంది.

విశ్వం: ఓరి వీడి సిగ తరగా! నన్ను పాడుదోమ అంటాడేమిటి? వీడికిదేం పోయేకాలం?...ఇంకా నయం... వెళ్లిపోతున్నారు...లేకపోతే ఇక్కడ ఉండి ఇంకా ఏమేమి వాగేవారో...ఎవరో ఇటు వస్తున్నారు...సార్, మిమ్మల్నే! కొస్త ఆగండి...ఏమీ లేదు—దయచేసి టయిమ్ ఎంతయిందో చెప్పి పొండి కొస్త.

అతను: బుధవారం.

విశ్వం: బుధవారమా?

అతను: అవును...ఈ బస్ స్టాప్ లోనే దిగి పోవాలి.

విశ్వం: బుధవారమేమిటి, బస్ స్టాప్ ఏమిటి? వాట్ నాన్సెన్స్ యూ ఆర్ టాకింగ్?—

అతను: మీరు చీకట్లో పొరపడుతున్నారేమో!

విశ్వం: ఇదేమిటి?

అతను: ఈ వేళ పున్నమి కదూ?

విశ్వం: ఇదొకటా! నువ్వు ఫో నాయనా—నీకొక నమస్కారం.

[గాలి మరింత జోరుగా వీస్తుంది]

విశ్వం: అరే, ఎవరదీ? శర్మ కదూ? నన్ను చూసీ చూడనట్లు పోతున్నాడేం? ఒరేయ్ శర్మా. ఆగరా...

శర్మ: ఎవరదీ?

విశ్వం: నేనురా—విశ్వాన్ని. ఇక్కడు

న్నాను... ఇలా చూడు...ఇటువైపు... అదేమిటి, అలా ఆముదం తాగినవాడిలా మొహాం పెట్టేశావ్?

శర్మ: నువ్వటోయ్ విశ్వం? అదేమిటి జౌట్ ఆఫ్ ఫోకస్‌లో నిలుచొనున్నట్లు న్నావ్? నాకళ్లకేమైనా జబ్బా? పైగా ఫేడ్ అవుట్ అవుతూన్నట్లున్నావ్!

విశ్వం: అంతా విచిత్రం!

శర్మ: అరే, నీ గొంతుకూడా అలా మారి పోయిందేం! సౌండు బాక్సు చెడిపో యిందా, లేక నా చెవిలో రిసీవర్ లోపమా?

విశ్వం: ఇది మరీ విచిత్రం!

శర్మ: అది సరేకాని, ఏమోయ్, భలే మోసంచేశావే. మొన్న శుక్రవారంనాడు మహాబలిపురం వస్తానని ఎగ్గొట్టేశావేం?

విశ్వం: వస్తానని నేనన్నానా?

శర్మ: అవును. ఎలుకల బోనుకోసమని మా ఇంటికి శుక్రవారంనాడు వచ్చినప్పుడు అన్నావుగా? ఇదేమిటి! ఇంతలోనే ఎక్కడికి వెళ్ళిపోయావ్?

విశ్వం: ఎక్కడికి వెళ్ళిపోయానూ?— నీకళ్లెదుటే భూతంలా నిలుచొనిఉంటేనూ!

శర్మ: హుం...ఆ వెధవ అంతే...మాట్లాడుతూ మెల్లగా జారుకుంటాడు.

విశ్వం: వెధవా!...ఒరేయ్ శర్మా, ఆగు ...నిన్నే...ఆగు...హుం వీడికి నిజంగానే చావుడు పుట్టింది.

బంట్రోతు: సార్!

విశ్వం: ఎవరదీ? నువ్వట్రా బోయ్...?

బంట్రోతు: పిలిచారా సార్?

విశ్వం: బెల్లు కొట్టినప్పుడు మాత్రంరాను .....ఉట్టప్పుడు ఇలా పదేపదే వచ్చిపోతూండు.

బంట్రోతు: మీ రిప్పుడు బెల్ కొట్టారు సార్.

విశ్వం: నేనిప్పుడు బెల్ కొట్టానా?

బంట్రోతు: అవును! సార్! కావలిస్తే, అకౌంటెంట్ శంకరం బాబుగార్ని అడగండి. ఆయనే చెప్పారు మీరు బెల్ కొట్టారని.

విశ్వం: ఎలా కొట్టాను? నేనిప్పుడు ఎక్కడవున్నాను?

బంట్రోతు: అదేమిటి సార్, అలా అంటారు? మీ చేతిలో వున్న ఆవస్తువేమిటి?

విశ్వం: నాచేతిలో ఏముంది? ఏమీ లేదే.

బంట్రోతు: అది బెల్ కదా సార్? అరే కాదే! పాతాళభైరవిలా వుంది.

విశ్వం: అంటే?

బంట్రోతు: భావిలో చెంబో, బాలీసో పడిపోతే, తీయడానికి వుపయోగిస్తారు చూడండీ—ఆ ఆయుధమే కదూ?

విశ్వం: ఒరేయ్, నీకేమైనా మతిపోయిందా?

బంట్రోతు: లేదు సార్, మీ చేతిలో వున్న ఆయుధం అదే. అందులో డి. సి. కరెంటు ప్రవహిస్తుందా, ఏ. సి. నా సార్?

విశ్వం: నీ మొహం.....వెళ్ళు ఇక్కడ్నించి...నిన్ను డిస్మిస్ చేసేస్తున్నాను.

బంట్రోతు: అంతకన్నా ముందే నేను రాజీనామా పెట్టేస్తున్నా సార్...సెలవ్.

విశ్వం: హమ్మయ్య వెధవ వెళ్ళిపోయాడు. [ఆవలిస్తాడు] అరే! ఇదేమిటి? నేను అప్పుడే ఆఫీసులోంచి వచ్చేశానేం? ఇప్పుడు టయిమ్ ఎంత? అరే, ఇదేం విడ్డూరం? నాగడియారం వెనక్కి తిరుగుతూందేం? అంతా విచిత్రంగా వుందే! నేనిప్పుడు ఎక్కడున్నాను? నా మెదడులో ఏదైనా మిస్టేక్ జరిగిందా? నాప్రశ్నలకు ఒక్కరూ జవాబు చెప్పరేం? ఇదేం విచిత్రం?

కుర్రాడు: విచిత్రం కాదండి...రూపాయకు యాభై నయాపైసలు...అర్ధ రూపాయకు ఇరవై అయిదు నయాపైసలు...పావలాకు మరేం నరేం...


చూడండి! సన్‌లైట్ సగంబిళ్ళ
మాత్రమే ఈ బట్టలన్నిటిని
ఉతికింది!



అట్లు చేసినట్టిది దాని
అధికమైన నురగ!




సన్‌లైట్ సబ్బు బట్టలను
తెల్లగాను, కాంతివంతముగాను
ఉతుకును

L. 248-50 TL

# ★ మరో లోకంలో ★

విశ్వం: ఏయ్! హూ...ఆర్. యూ?... ఎవరు నువ్వు?

పు|రా: ఐ...యాం మ్...ఎ...బా య్. నేను...ఒక...బాలుడ్ని.

విశ్వం: ఏబ్బావ్ లే ఫో...

పు|రా: సంతోషించాం లెండి...పోతున్నాం.

విశ్వం: ఈవీధి ఎటు వెళ్తుంది? అంతా కొత్తగా ఉందే. ఆవచ్చేదెవరు? శాస్త్రి కదూ?

శాస్త్రి: తనలోతాను [గొణుక్కుంటూ]

చలి...

కలికాలంలో చలి...

ఎముకలు కొరికే చలి...

గజగజలాడే చలి...

వజవజవణికే చలి...

విశ్వం: ఏయ్,...శాస్త్రి రోడ్డుమీదకూడా నీ భావకవిత్వ మేమిటోయ్? ఆగవోయ్... నేనిక్కడ ఉన్నా...వినిపించటంలా?... అరె, వాజమ్మ, నాకేసి చూడకుండా నే వెళ్ళిపోతున్నాడే.

పాపువాడు: సార్!

విశ్వం: [ఉలిక్కిపడి] ఆఁ! ఎవరు మీరు

పాపు: అదేమిటి సార్, అలాఅడుగుతారు? పాపు లోపలికి రండి—బయటనే నిలుచొని ఉన్నారేం?—కొత్త కోటా వచ్చింది సార్ చక్కని బట్టలు వచ్చాయ్...

విశ్వం: ఆఁ...మీరా? ఇలా మారిపోయారేం?

పాపు: ఏం మారానండీ? ఈ వేళ ట్రిప్లికేన్ నించి మా పాపుకు సరాసరి నడిచి వచ్చాను. అందువల్ల అలసిపోయానేమో!

విశ్వం: ఆలాగా! మీ కారు ఏమయింది?

పాపు: మంచినూనె లేక ట్రిప్లికేన్ హై రోడ్డులో ఆగవలసి వచ్చింది.

విశ్వం: మీ కారు మంచినూనెతో నడుస్తుందేమిటే?

పాపు: అది కారు సార్...మా ఇంట్లో మంచినూనె అయిపోయింది. అందుకోసమని ట్రిప్లికేన్ హై రోడ్డులో ఒక కొట్టు వద్ద కారును ఆపి, మంచినూనె తీసుకొని ఇంటికి తిన్నగా వెళ్ళిపొమ్మని మా డ్రైవర్‌తో చెప్పి నేను చక్కా నడుచుకు వచ్చేశాను. సాయంత్రం మా ఇంట్లో ఓ చిన్న పార్టీ వుంది లెండి.

విశ్వం: అలాగా......సరే, నేను మీకు రెండు వందల యాభై రూపాయలు ఇవ్వాలి కదూ?

పాపు: రెండు వందల యాభై రూపాయలా!

విశ్వం: అవునండి. పోయిన నెలలో పండక్కి బట్టలు కొన్నానుగా

పాపు: అదేమిటి సార్, ఉదయం మీరే స్వయంగా వచ్చి, రెండు వందల యాభైకి చెక్కు ఇచ్చేసి వెళ్ళిపోయారుగా? ఇంతలోగా మరిచారేమిటి?

విశ్వం: ఆఁ అలాగా?

పాపు: అవును సార్......

విశ్వం: ఈజ్ ఇట్? సరే నేవస్తాను... నాకొక అర్జంట్ పనుంది. [కొంత ఆగి, ఉన్నట్టుండి హెచ్చు స్థాయిలో]...ఏమిటీ విపరీతం? నా జ్ఞానేంద్రియాలు నన్ను మోసం చేస్తున్నాయా? నామతి కోల్పోతున్నానా? [వెంటనే తగుస్థాయిలో] అరే, అప్పుడే ఇంటి దగ్గరికొచ్చేశానే? ఇంతకీ ఇది మా ఇల్లేనా?

[తలుపులు తట్టిన చప్పుడు]

విశ్వం: సుశీలా—సుశీలా!

సుశీ: అబ్బ—ఎవరదీ? వస్తున్నా ఉండండి...తలుపుకు గొళ్లెం పెట్టలేదు. మెల్లగా తోయండి...[హఠాత్తుగా] ఎవరుమీరు?

విశ్వం: ఇంటికి వచ్చి రాకముందే సరసాలా?

సుశీ: సరసాలేమిటీ? ఎవరు మీరు?

విశ్వం: తెలీటంలా?

సుశీ: పగటి వేషగాళ్లా?

విశ్వం: నాన్‌సెన్స్! నీకు మతిపోయింది.

సుశీ: ఆఁ మీరా? ఇదేమిటి, ఇలా మారిపోయారు? ఎక్కడ్నించి వస్తున్నారిప్పుడు?

విశ్వం: నీసరామర్శలు తర్వాతగాని, ఆకలేస్తోంది....ముందు టిఫెన్ తీసుకురా...

సుశీ: టిఫెనా ఇప్పుడేకదండీ—అరగంట క్రితం మీరు ఫలహారం చేసి వెళ్లారు?

విశ్వం: ఏమిటే నువ్వనడం?

సుశీ: అవునండి...మీ ఫ్రెండ్సు కూడా ఎవరో వచ్చారుగా?

విశ్వం: నా ఫ్రెండ్స్ వచ్చారా?

సుశీ: అవును... వాళ్ళకు కూడా నా చేతు ఫలహారం ఇప్పించారుగా?

విశ్వం: ఏమిటే నువ్వనడం?

సుశీ: అసలు మీరెవరు? ఇదేదో మోసం లాగుంది. ఎవరయ్యా నువ్వు? ఆడదాన్ని—ఒంటరిగా కొంపలో ఉన్నానని తెలిసి, ఇలా మా వారిలా వేషం వేసుకు వచ్చి నన్ను బెదిరిస్తావా? నీ పప్పులు నా దగ్గరేం ఉడకవు. ఫో-ముందు...పోతావా పోవా? లేక, కేకలేసి నలుగుర్ని పిలిపించనా?

విశ్వం: సుశీలా!

సుశీ: ఏయ్, అలా పేరెట్టి పిలుస్తావేం? ఊఁ...మర్యాదగా కదులు...కదుల్తావా, లేదా?

విశ్వం: సుశీలా!

సుశీ: పోతావా-పోవా? [బిగ్గరగా] హనుమాయమ్మగారూ! మంగళాంబగారూ? దొంగ వచ్చాడు - దొంగ...[ఇంకా బిగ్గరగా] దొంగ ... దొంగ ... మా ఇంట్లో దొంగ పడ్డాడు...పరుగున రండి.

విశ్వం: ఛీ...నీకు బుద్ధి లేదు. నీకు మతిపోయింది...అదో-ఆ ఎదురింటావిడ వస్తున్నట్లుంది. ఆమె వస్తే-మన మానం పోతుంది. వంశ గౌరవం మంట కలుస్తుంది. అదో-ఇంకెవరో కూడా వస్తున్నారు. నేనీ క్షణంలో తప్పుకోకపోతే నానా గొడవలౌతాయ్... నే నే పోతాను...హుఁ...

(34-వ పేజీ చూడండి)


కేశసంపదకు

రీటా కురుళ్ళకు బలమునిచ్చి, నిగనిగలాడు నిడుపాటి వెంట్రుకలను పెంచునట్టి అద్భుతమైన హెయిర్ టానిక్. తల వెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేనుకొరుకు, ఇంకను తలవెంట్రుకలకు సంబంధించిన సమస్త వ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేనకువేలు వాడి గుణమును పొందియున్నారు. మీరుకూడా నేటినుండియే రీటా వాడుడు.

రీటా
హెయిర్ టానిక్




బుడుగూ!

నీ ఖబుర్లు విని ఇన్ని కుంచెం రోజులే అయినా బోల్డు రోజులయినట్లుందిలే. మరి బడి తెరచిం తరువాత నిఝంగా కనబడు తావా ప్రతివారం.

మరే మాకు ఇక్కడ ఇంకో "బుడుగు" వున్నాడు తెలుసా. అంటే వీడు మా అన్నయ్య కుడుకులే. నీకన్న కుంచం చిన్న వాడే అనుకో. అయినా వీడున్నాడే అంతా నీలానే వుంటాడనుకో ముద్దొస్తూ.

డెబ్బయిఫది రోజులప్పుడు ఏం జరిగిందో చెప్పనా—మరేమో బుడుగునాన్న "రాధా! కాఫీ! కాఫీ!" అన్నారు. బుడుగు అమ్మ హాచ్చర్యపడిపోయి "ఎవరండీ! ఆ రాధ?" అనేసిందా కొంచెం కోపంతో "బుడుగు వాండ్ల అమ్మలే" అని చెప్పాడు బుడుగు నాన్న. అప్పుడు రాధకుకోపం ఇట్టే మాయ మయిపోయి బుడుగుని గాఠిగా ముద్దు పెశేసు కుంది. నేను మరి అప్పుడక్కడలేను గాని వున్నట్లయితే "హారి గోపాళం! భలే తమాషా చేశావే!" అనే దాన్ని. అప్పుడు గోపాళం నాకు ప్రయివేటు కూడ చెప్పేసే వాడు కదూ! ఏం?

మరే మా బుడుక్కు ఛాలాఛాలా అత్త లున్నారా? ఈ అత్తలు, ఈ రాద– ఎప్పుడు "వురేయ్! బుడుగూ! బురుగు! అని పిలు స్తుంటారు. వాడితోమేం ఎవరం మాట్లాడినా నీ భాషే అనుకో. మరి నీకు మాదిరే ఈ బుడుక్కి కూడ పక్కింట్లో లావుపాటి పిన్ని గారుంది తెలుసా! ఈ పిన్ని గారికే బుడుగు అమ్మ బుడుగుతో "వురేయ్! బుడుగూ! బబ్బ పోసుకు నేప్పుడు గాన పెసూనాంబ వస్తే ఎలానమ్మా" అని నీభాషలో మాట్లాడు తుంటే ఎంత ఇష్టం అనుకున్నావు. ఇంత గాఠిగా నవ్వేస్తుంటుంది. (కుశోలో నీపిన్ని గారంత లావు కాదనుకో) ఒకసారి యే మయిందనుకున్నావు ఇలా మాట్లాడుకుంటే పిన్ని గారి కుగుడు వచ్చాడా" పుస్తకాల్లో వచ్చినవి చదివి వదిలేస్తారు గాని ఇలా కంఠతాపట్టి ఎప్పుడూ మాట్లాడుకుంటారా!" అనేశాడు. పిన్ని గారు హాస్దలిపోయిం దనుకో. మేమంతా ఇంచక్కా నవ్వేశాం.

ఇక చాలా మరి! మా బుడుగు సంగతులు!! మరి వీడి అస్సలు పేరు యేమిటో చెప్పనా— చిన్నారి "రాందేవ్" మా బుడుగుతో ఆగు కోటానికి వస్తావా మరి. నీ అస్సలు పేరు ఇంతవరకు చెప్ప నేలేదు తెలుసా! ఈతడవ తప్పకుండా చెపుతావు కదూ!

వస్తా...టా!...టా!

"వాణి" వేటపాలెం.

* * *

బడుగూ! బంగారు తండ్రీ!!

అంత అరజంటుగా (హాఠాత్తుగా) ఖదలు రాయడం మానేస్తే ఎలా మరి? నిఝంగా నాకు భోల్డు ఖోపం, ఆపైన తాపం (అంటే ఏడుపులే) వచ్చేసింది.

నువ్వు ఇంచక్కా మాంఛి-బోల్డు నవ్వించే ఖథలు రాస్తుంటే ఎంత బావుణ్ణు! మా యింట్లోకూడ చిన్న బుడుగున్నాడు. కాని వాడు రాధకన్నా, నీకన్నా, నాకన్నా, వాడికన్నా, చిన్నవాడు. అంచేత వాడికి ఖదలేరావు. అస్సలు మన భాషేరాదు. వాడి ఊంగాభాష మాకు తెలియటంలా. నువ్వైతే ఇంచక్కాడికషనరీలా అర్థాలు చెప్పేస్తావుగా మరి. అందుకని మావూరు ఓసారిలావస్తావూ? మావూరు ఆందర పెరదేశ్ ముఖ్యనగరంట. (ఇలా అని అన్నాయె చెప్పాడులే!) అంటే మాయింట్లో అందరికి అమ్మే ముఖ్యంకదూ? అలా అన్నమాట మావూరు. మావూరుకూడా మీరాధలా ఛాలా కుంచెం, బోల్డు బావుం టుంది! అందుకని నీవు పే...ద్ద తొందరగా రైలు యింజను ఎక్కి ఇసెపీడుగా వచ్చేయ్!

నిఝం జటకా ఏం ఖర్మ! మాయింట్లో పేద్దం నిఝంకారే, చిన్నది వుంది. నిన్ను దానిమీద ఝూంమని వూరంతా ఊరేగిస్తా! నీకోసం మూరు దంటిడీలు, ప్పదిబీడీలు, ముప్పయిడెబ్బై, బఠానీలు, పసకొండు చాకె లేటులు, ఛాలా ఫకోడీలు దాచివుంచా వక చిన్న గోనె బస్తాలో!

వస్తావుగా కేపో మూడ్రోలుకో.

ప్రియమైన అక్క— పి. ఉమాదేవి.

హైదరాబాద్.

* * *

డియర్ బడుగూ, నిన్ను బడుగు అనిపిలిచి చాలా అనుమానంచేశా. అందుచేత నన్ను కొంచెం క్షమించాలి. లేకపోతే చాలా ఆపదలో పడిపోతా, బుడుగూ సీగాన పెసూ నాంబను తీసుకుని మావూరు రావూ, మీ ఇద్దరికీ ఇంగ్లీషు నేర్పేస్తా.

నీ ఫ్రెండ్, నందూరి వెంకటేశ్వర రావు, (గుంటూరు).

* * *

ప్యారి నేస్తం బుడుగుబాయి.

నాకీ పేర్ లాంకిషర్. ఇదర్ నేన్ బాగా ఉన్నాను. నాకీ యీమధ్యన చాలా కోపం అయిపోయిందిగా మాటలు బంద్ చేసినావ్. మజాగా ఎప్డు మాట్లాడి మాకీ ఖుషిచేస్తావ్. బాయిబుడుగు? నీకీ ఖైసా ఉందో. నాకీ భలేగుస్సా వొస్తుంది. జల్దీగా నీవు నాకీ జవాబురాస్తావురా దోస్తో.

బీగంపేట, నీకీ దోస్తీ.

* * *

# అసంప్రేక్ష్యకారిత్వము... పంచతంత్రము






















ఎన్నాళ్ళుంటివి నీవిచట?
ఎన్నాళ్ళేమిటి! ఎన్నేళ్ళో!


నాక తద్దిన మెన్నాళ్ళు?


ఏదినమెవ్వడు తూపికతో
ఈ ధననిధికై రాగలడో
తద్దినమే నతద్దినము
అద్దుర్భాగ్యున కంటుకొనున్


అంతట మూడవ బ్రాహ్మణుడు
ఎంతకు మిత్రుడు రాకుంటన్
అడుగుల జాడల బడి నడచి
కడకా స్థలమును చేరుకొనెన్


కెంపులు,పచ్చలు నీలాలూ గంపల నిండా దొరికినవా!
కెంపుల,పచ్చల గొడవేలా! కొంపలు మునిగెను బలికాడా!


జరిగినదంతా తెలుసుకుని
కరిగిన మదితో విప్రుడనెన్
చెప్పినమాటలు వినకుండా ఇప్పుడు వగచిన పని ఏమి!


ఆరయగ విద్యాబుద్ధులలో
నరునకు బుద్ధియె ముఖ్యమగున్
బుద్ధిహీనులగు విప్రులకు
సిద్ధించెను దుర్మరణం!
ఎవరా విప్రులు? ఏమా కథ?

# కృతజ్ఞత

వీరాపురమనే వూర్లో నాలుగురోడ్లు కలిసేచోట వొక మూలగా నారాయణ టీ దుకాణం వుంది. మంచి వ్యాపార దక్షుడవడం చేతనూ, వాక్చాతుర్యం కలవాడవడం చేతనూ నారాయణకు మంచి రాబడివచ్చేది. అటు ప్రక్క వచ్చేవాళ్లందరూ గుక్కెడు టీ త్రాగి కాని వెళ్ళేవారు కాదు. ఆ కొట్లో నిత్యమూ టీ త్రాగి చాలా మంది-చుట్టలు వెలించుకుంటూ బాతాఖానీ మొదలుపెట్టే వారు. ఎప్పుడూ గల్లా పెట్టె గలగల లాడేది. ఇలా సాగిపోయేది నారాయణ వ్యాపారం.

ముసలివాడైపోయినా తనే వోపికతో కొట్టు నడిపేవాడు. కాని యెన్నాళ్లని పని చెయ్యగలడూ? తాను జబ్బు పడిపోవడంతో తప్పనిసరిగా తనవొక్కగా నొక్క కొడుకు వెంకప్పకు కొట్టు అప్పజెప్పవలసి వచ్చింది. "నాయనా! యెవరికీ అరువు లివ్వకు. అందరితో మంచిగా మాట్లాడు. అసలే మనం చేసేది చిన్న వ్యాపారం, అశ్రద్ధచేస్తే మనకేం రాబడొస్తుంది? నాలో శక్తి వున్నంతవరకూ పనిచేసాను. ఎప్పటికైనా నీకే కదా కొట్టు అప్పజెప్పాలి! కష్టపడి పని-చెయ్యి,' అని బోధించాడు కొడుక్కి.

వెంకప్పజాలిగుండె కలవాడు. అతనికి లోకం పోకడలేవీ తెలియవు. ఎదుటివారి కష్టాల్ని చూడలేడు. నారాయణకతని అసమర్థత తెలుసు. కానియేం చేయగలడు? ఇప్పుడతనిని కొట్టుకి పంపకతప్పదు. వెంకప్ప ఆరోజే దుకాణంవద్ద కూర్చున్నాడు. టీ కోసం వచ్చిన వాళ్లందరూ వెంకప్పను చూచి ఆశ్చర్యపడ్డారు. వెంటనే నారాయణ క్షేమం గురించి అడగడం మొదలుపెట్టారు. ఇతను కొంచెం అమాయకుడని తెలుసుకొని, టీ యెంత బాగా చేసినా, "అబ్బాయ్! టీ యిలా చేస్తే యెలా? పాలు పూర్తిగా తగ్గిపోయాయి. మీ నాన్న యెలా చేసేవాడో తెలుసా?" అని రకరకాలగా మందలించి యెవరి కవసరమైనవి వారు వేసుకొనేవారు. టీమీద వాళ్ల విమర్శనలు విని విసిగిపోయేవాడు వెంకప్ప. నారాయణమట్టుకు లాభసాటి విధానాలను కొడుక్కు చెప్పేవాడు.

ఒకరోజు పదకొండు గంటల వేళప్పుడు టీ కెవరూ రాకపోవడంచేత రోడ్డుమీదకు చూస్తూ కూర్చున్నాడు వెంకప్ప. ఎండ తీవ్రంగా కాస్తోంది. ఆ దారంట పోయే వాళ్లలో కొంతమందతన్ని పలకరించబోయినా, అతను పరాకుగావుండి వాళ్లతో మాట్లాడలేదు. అతను వంటరిగా వచ్చేపోయే జనాన్ని చూస్తున్నాడు. అంతలో ఆ దారంట పోతున్న బిక్షాకొకడు నడుస్తూ నడుస్తూ శోషవచ్చి పడిపోయాడు. అనుకోకుండా తటాలున లేచి అతని దగ్గరికి పరుగెత్తాడు వెంకప్ప. అప్పటికే చాలమంది అక్కడ మూగిపోయారు. వెంకప్ప అతని ముఖంమీద నీళ్ళు జల్లి, తెలివి వచ్చిం తరువాత కొట్టువద్దకుతీసుకొనివచ్చి టీఇచ్చాడు. అతని బట్టలు ఖరీదైనవైనా మాసిపోయి చిరిగిపోయాయి. ఒకప్పుడు బాగా బతికున్న వాడిలా కనిపించాడు. అతను కొంత సేద తీరిన తరువాత, వెంకప్ప తనకోసం తెచ్చుకున్న అన్నం అతనికి పెట్టాడు. అతను ఆత్రుతతో తినివేశాడు. వెంటనే అతను వెంకప్పకి నమస్కరించి వెళ్ళిపోయాడు.

## కొడవంటి లీలా మోహనరావు

అంతే! అతని సంగతేమీ చెప్పలేదు. కాని వెంకప్ప చాలా సంతృప్తిపొందాడు.

వెంకప్ప జాలిగుండె తెలుసుకున్న వాళ్లందరూ "రెండురోజుల నుండీ తిండి లేదు. ఒంట్లో శక్తిలేదు. ఎక్కడా కానీ వచ్చేమార్గం లేదు" అని రకరకాలుగా తమ కష్టాలు చెప్పుకొని వెంకప్పదగ్గిర వుచితంగా టీ త్రాగి పోయేవారు. మరికొందరు టీ త్రాగి తరువాత డబ్బు లిస్తామని బాకీ యెగగొట్టేవారు. ఇలా వ్యాపారం సాగేసరికి దుకాణం యెత్తేసే పరిస్థితి యేర్పడింది. బొత్తిగా డబ్బు లేకపోవడంచేత అప్పుకూడా చెయ్యవలసి వచ్చింది. వ్యాపారం దివాలా తియ్యడంతో శాశ్వతంగా కళ్ళు మూసాడు నారాయణ. ఇంక తన కక్కడ పనిలేదని యిల్లమ్మివేసి అప్పులుతీర్చి, వున్న కొద్దిడబ్బూ తీసుకొని వెంకప్ప దేశాంతరం బయలుదేరాడు.

అలా వెంకప్ప చాలాదూరం సాగిపోయాడు. వున్న డబ్బయిపోయింది. అక్కడక్కడ కొన్నాళ్లు కూలీపని చేసాడు. కాని రెండురోజుల నుండీ అదీ దొరకలేదు. ఆకలికి పేగులు మెలికలు తిరిగిపోసాగాయి. తన దీనస్థితికి చాలా విచారించాడు. అలా నెమ్మదిగా ఆ అపరిచిత నగరంలో నుండి నడచిపోతున్నాడు. అంతలో ఒక గుఱ్ఱపు బగ్గీ అతన్ని రాసుకుంటూ పోయింది. ఆ వూపుకు వెంకప్ప చాలాదూరం తొలగిపోయాడు. "ఛీ! వెధవలు! చూసుకోవక్కర్లా...!" అని అరిచాడు ఆవేశంతో. వెంటనే ఆ బగ్గీ ఆగిపోయింది. అందులోనుండి వొక సంపన్నుడు నెమ్మదిగా క్రిందికి దిగి చిరునవ్వు నవ్వుతూ, "దెబ్బ తగిలిందా భాయ్?" అని ప్రశ్నించాడు. తన తిట్లుగాని విన్నాడేమో అని వెంకప్ప వణికిపోయాడు. "నీకేం భయంలేదు నాతో రా" అని ఆ సంపన్నుడు వెంకప్పను బగ్గీ యెక్కించి తను కూర్చున్నాడు. అతని ప్రవర్తనకు వెంకప్ప ఆశ్చర్యపోయాడు. అతని అందమైన ముఖం తనకెక్కడో పరిచయమైనట్లే తోచింది వెంకప్పకి.

ఆ బగ్గీ వొక భవనం ముందాగింది. బంట్రోతు పరుగెత్తుకొని వచ్చి బగ్గీ తలుపులు తెరిచాడు. అందులోనుంచి దిగి వెంకప్పనాహ్వానించాడా సంపన్నుడు. వెంకప్ప సందేహిస్తునే ఆ సంపన్ననుసరించాడు. ఇద్దరూ కాళ్ళుకడుక్కొని భోజనాలకు కూర్చున్నారు. అక్కడ నేకమైన వంటకాలు అమర్చివున్నాయి. ఆకలిగా వుండటంచేత వెంకప్ప గబగబా భోంచేశాడు. భోజనాలయింతరువాత విశ్రాంతి తీసుకునే స్థలానికి యిద్దరూ వెళ్ళారు. వెంకప్ప కిదంతా కలగా తోచింది. ఆ సంపన్నుని ప్రవర్తన అంతకంతకూ ఆశ్చర్యాన్ని కలిస్తోంది. తని నెందుకింత ఆదరిస్తున్నాడో బోధపడలేదు వెంకప్పకి. తన పరిస్థితిని గూర్చి ఆలోచించసాగాడు వెంకప్ప.

"ఏమిటాలోచిస్తున్నావు భాయ్, నన్ను గుర్తించలేదా?" అన్నాడా సంపన్నుడు సంభాషణ నుపక్రమిస్తూ. వెంకప్ప విచిత్రంగా చూస్తూ వూరుకున్నాడు. "ఒకరోజు నీ కొట్టుదగ్గరుగా మధ్యాహ్నం పదకొండుగంటలవేళ వొకడు శోషవచ్చి పడిపోయాడు. జ్ఞాపకముందా? అప్పుడు అతనికి శుశ్రూష చేసి అన్నంపెట్టావు. తెలుసా? అతనే నేను" అన్నాడు. వెంకప్ప ఆశ్చర్యంతో వుక్కిరిబిక్కిరైపోయాడు. "నేను అప్పటికీ ధనవంతుణ్నే. తీర్థయాత్ర చెయ్యాలని బుద్ధిపుట్టి బయలుదేరాను. అలా చాలా ధూరం పోయాను, త్రోవలో నాదగ్గరున్న ధనం యావత్తూ దొంగలు కాజేసారు. వెంటనే యీ వూరు చేరడానికి వెనక్కి బయలుదేరాను. మీ వూరు వచ్చేసరికి తిండిలేక శోష వచ్చిపడిపోయాను. నువ్వు ఆదరించి భోజనం పెట్టావు. తగువాత నానా యాతనలూ పడి యెలాగో నాయిల్లుచేరాను. నిన్ను మట్టుకు నేను మరచిపోనేలేదు. ఇందాక నీతిట్లు విన్పించి, తెర తొలగించి చూచి

# చెప్పుదెబ్బలు

కలెక్టర్ ఆఫీసులో రెండుగంటలు కొట్టారు. ప్యూను చంద్రమౌళి నా టేబిలు దగ్గర కొచ్చి నిలబడ్డాడు. వాడలా రెండు గంటలు కొడ్తూనే నా టేబిలు దగ్గరికి రావడం అన్నాళ్లనించి వస్తున్న అలవాటు. రెండు గంటలకు చంద్రమౌళి నా టేబిలు దగ్గరికి వచ్చాడంటే కాఫీకి టైమైందని అర్థం. కాఫీకి పోదామని ఆలోచిస్తూండగానే పుస్తకం దూరంగా జరిగింది, పెన్నా జేబులో చేరింది, కాళ్ళు చెప్పులకోసం వెదికాయి. కాళ్ళు టేబిలు క్రింద అటూ యిటూ ఆడించాను. ఒక చెప్పు కాలికి తగిలింది. మరొకటి దూరంగా వుందికాబోలని కాలును రెండడుగుల వ్యాసార్థంతో త్రిప్పాను. "ఏమిటది?" అన్నాడు చంద్రమౌళి విసుగ్గా. "చెప్పురా, చెప్పు కనబడలేదు." అంటూ కుర్చీ వెనక్కి లాగి చెప్పు ఎక్కడవుందో నని టేబిలు క్రిందికి వంగి చుటూ చూపుమేర దూరం చూశాను. లేదు, ఎక్కడా కనబడలేదు. "ఎక్కడకు పోయిందిరా చెప్పు?" అన్నాను చంద్రమౌళి. "ఏమో నాతో చెప్పలేదు. ఈ చుట్టుపక్కల ఎక్కడా లేదు," అన్నాను. 'కాఫీ త్రాగివచ్చి వెతుకుదాంరా!" అన్నాడు చంద్రమౌళి. సరేనంటూ రెండో చెప్పు నక్కడవదిలి కాఫీకి బయల్దేరాము దారిలో మా ఆఫీసు ప్యూన్ నర్సయ్య కనిపించాడు. "నర్సయ్యా ఒక చెప్పు కనబడలేదు. కొంచెం వెతికి చూడు, యిప్పుడే వస్తాను" అన్నాను. "సరేసార్" అని వెళ్లిపోయాడు.

ఇరవై గజాలు నడిచేసరికి అబ్బా! అంటూ

---

విన్నా గుర్తుపట్టాను. ఇంక నువ్విక్కడే వుండిపోవాలి" అన్నాడా సంపన్నుడు.

"నేను పెద్ద సాయమేం చేసానండీ?" అన్నాడు వెంకప్ప.

"అలా అనకు. నీ శక్తికొలదీ, బీదవాడవైనా సాయపడ్డావు నేను ధనవంతుడినై యీ మాత్రం సాయం చెయ్యలేనా...?" అన్నాడా సంపన్నుడు.

అప్పటినుండి యిద్దరూ అన్నదమ్ముల్లాగా వొక్కచోటనే మెలిగారు. ★

కూర్చున్నాను, కుడికాలి బొటన వ్రేలికింద పల్లేరుకాయను తీక్షంగును. "మాశావా చంద్రమౌళీ, ఒక్కరోజు చెప్పులు లేకపోతే ఎల్లాకష్టపడాల్సి వస్తుందో. చెప్పులువేసుకుని ఎన్నిసార్లు పోలేదు ఈదోవన ఎప్పుడన్నా గ్రుచ్చుకుంది యీ వెనవకాయ," అన్నాను. "అందరూ చెప్పులేసుకుంటే అవి ఎవరికి గ్రుచ్చుకోవాలి: వాటిబ్రతుకే యితర్లను బాధపెట్టడం" అన్నాడు.

కాఫీ త్రాగి తిరిగివచ్చేసరికి మానర్సయ్య "సార్ ఎంత వెదికినా కనబడలేదు. ఆఫీసంతా వెదికాను. ఎక్కడా లేదుసార్" అన్నాడు. "ఎక్కడా కనుపించలేదు. మరి ఎక్కడకుపోయింది, ఎలాపోయిందంటావు" అన్నాను. "అదేసార్ నేనూ ఆలోచిస్తుండాను. మీ చెప్పు ఎవరుసార్ దొంగలించేది!

భారత్‌సింగ్

కుక్కలు తీసుకపోతాయా అంటే అది మన ఆఫీసులోకి రావు" అన్నాడు.

కుక్కలు మా ఆఫీసుకు రావని నాకూ తెలుసు: మా ఆఫీసు ప్యూనులు కుక్కల్ని మంచి అగుపాజల్లో వుంచుతారు. హద్దు మీరిందా నడుము విరిగిందే. ఒక్కసారి మా ఆఫీసుకువచ్చి మా నర్సయ్య చేతిదెబ్బ తిన్నకుక్క ఈ జన్మలో కాదు యిక ఏడు జన్మల్లోనైనా మా నర్సయ్యవుండేచాయలకు రాదు. "యిక మీ చెప్పు ఎవరుసార్ దొంగలిచ్చేది" అన్నాడు మా నర్సయ్య. వాడి వుద్దేశ్యం ఏమిటి? నావంటి ప్రచండ వీరుడి చెప్పు దొంగలిచే సాహసం ఎవరికీ లేదనా, లేక నా చెప్పులు ఎంతటి నీచుడైన దొంగ కూడా దొంగిలించేందుకు పనికిరావనా.

మీ నెజగుతో ఏదన్నా విషయం మాట్లాడాల్సివస్తే ముప్పైసార్లు రిహార్సల్సు వేసుకొంటె మాట్లాడలేనే యిక నేనెట్లు వీరుణ్నవుతాను? వీరుడి లక్షణాల్లో కొన్నైనా మెలి తిరిగిన మీసాలు, రింగుల క్రాపు, అజానుబాహు విగ్రహంకూడ లేవు. ఇక ధైర్యంకూడ చాలా తక్కువ. నా అజ్ఞల్ని పాలించేవారు ఎనిమిది ఆరు సంవత్సరాల వయస్సుకల నా సుపుత్రులు. నా భార్య ప్రేమావతి, మా ఆఫీసు ప్యూను నర్సయ్య కూడా అప్పుడప్పుడు నే చెప్పే మాట వింటారు. కాని అత్యవసర సమయాల్లో వింటారని నే చెప్పలేను. 'ఒక్క కాఫీ తెస్తావా నర్సయ్యా' అంటే 'పనుందిసార్ పోయి త్రాగిరండి' అన్నరోజు లున్నాయి. 'ప్రేమా ఒక్క వక్క వుంటే యిస్తావూ' అంటే, 'అదిగో ఆ అలమారాలో పెట్టెలో వుంది, తీసికోండి' అన్న రోజులు కూడ వున్నాయి. ఇంతటి నేను వీరుణ్ణి ఎలా అవుతాను? ఇక నేను వీరుణ్ని కాదు కాబట్టి నా చెప్పులు ఎవరుకూడ దొంగలించేందుకు పనికిరావనే నర్సయ్యా ఉద్దేశ్యం.

దీర్ఘంగా ఆలోచిస్తే నర్సయ్య చెప్పిన మాట నిజం. నా చెప్పులు నాకు తప్ప మరెవరికీ పనికిరావు. రెండు సంవత్సరాలకు పూర్వం ఓ శుభదినాన వర్షం జల్లులుజల్లులుగా కురుస్తున్న సమయంలో ఒక 'వెల్ కం' గొడుగు ఒక ఫ్లెక్స్ చెప్పులజతకొని, గొడుగుపట్టుకొని, చెప్పులు చంకన పెట్టుకొని యింటికి పోయినట్లు జ్ఞాపకం. అప్పుడు నా చెప్పులు ఎంతో ముచ్చటగా వుండేవి. ఎక్కడా ఒక్క మేకు కూడ లేకుండా అంతా మెషనుకుట్టు. నల్లచర్మంతో తయారుచేసిన చెప్పులు నా ఎర్రటి పాదాలకి ఎంతో అందాన్నిచ్చేవి. కాని యిప్పుడు కనబడని చెప్పుకు దానికి పోలిక లేదు. ఆ చెప్పు ఎంత అందంగా వుండేదో, యీ చెప్పు అంత అందవికారి. బొటనవ్రేళ్లు పెట్టుకొనే చర్మం వూడిపోయింది. నాలుగుసార్లు టైర్లు కుట్టించాను. ఒక్క మేకైనా లేని చెప్పుకు యిప్పుడు యిరవై మేకులున్నాయి. చెప్పులేసుకుపోతున్నా బొటనవ్రేలు దగ్గర ముల్లుగ్రుచ్చుకొనేది. వ్రేళ్లపెట్టేచోట నేల తగులుతుంది. యిన్ని కష్టాలు పడుతున్నా ఆ చెప్పులే ఎందుకు వాడాలి? వాటిమీద నాకేమీ ద్వేషం లేదు. కొత్త చెప్పులు కొనాలంటే డబ్బు కావాలి. ఏడురూపాయలు పెట్టి చెప్పులు కొంటానని మా ప్రేమావతితో చెప్పేనా, యిక 'ఈ గృహమేకదా నరకసీమ' అనే దాంతో ప్రారంభించి, 'మీ



# చెప్పు దెబ్బలు



తాతగారు చెప్పలేందే అడుగు బయటపెట్టే వాడు కాదు' అని ఆపి ఒక రోజు నిరాహారదీక్ష చేసి కూర్చుంటుంది.

రాత్రి మా ప్రేమావతితో చెప్పాను "నా చెప్పుల్లో ఒకటి పోయింది. రేపు కొత్త చెప్పులు కొనాలి" అని.

"ఏమిటీ ఒక చెప్పు పోయింది! ఏకుక్కో పందికొక్కో తీసుకపోయి వుంటుంది. రేపు ఆఫీసు చుట్టూ వెదకండి."

"మా ఆఫీసుకు కుక్కలు రావు, పందికొక్కులు లేవు. ఎలా పోయిందో అర్థం కావడం లేదు" అన్నాను.

"కుక్కలెందుకు రావూ, మీ ఆఫీస రేమన్నా కుక్కల్ని గూడా భయపెట్టా రేమిటి? మరి కుక్క తీసుకుపోకపోతే మీరే ఎక్కడన్నా విడిచేసి వుంటారు. మరీ అంత మందబుద్ధి అయిపోయారేం? చెప్పులు ఎక్కడ వదిలింది జ్ఞాపకం లేకపోతే యిక ఉద్యోగం ఎలా చేస్తారండీ" అన్నది మా ప్రేమ.

నా కన్నా ఎక్కువ తెలివిగల అబల నా భార్య అయినందుకు నా ఆనందం హద్దు మీరి కోపం వచ్చింది.

"చాల్లే! నేనా మందబుద్ధిని. టేబిలు క్రింద వదిలిన చెప్పుల్లో ఒకటి కనబడకపోతే నేనేం చేసేది. రేపు రా! మా ఆఫీసుకి నా చెప్పు వెదికి పట్టుకొస్తువు గాని" అని దుప్పటి ముఖంమీదకు లాక్కున్నాను యిక ప్రేమావతి మాటలు వినకుండా నిద్రపోదామని.

## 2

ఎక్కడికో పోతున్నాను. నా చెప్పు కోసం వెదుకుతున్నాను. ప్రతి చెత్తకుండీ దగ్గరా నిలిచి జాగ్రత్తగా చూశాను. రోడ్డు ప్రక్కలంతా చూశాను. రోడ్డులో నిద్ర పోతున్న ప్రతి కుక్క దగ్గిరా ఆగి చెప్పు కోసం వెదికాను. రోడ్డు వదిలి మామిడి తోటలో ప్రవేశించాను. కాళ్ళ క్రింది ఆకులు గలగలమని శబ్దంచేశాయి. దూరంగా ఏదో ఆకారం లేచి నిలబడి నా వైపుగా వస్తోంది. నా దగ్గరిగా వచ్చి నా ప్రక్కగా వెళ్ళిపోయింది ఒక తెల్లమచ్చల నల్లకుక్క. కుక్క ప్రక్కకు తిరుగుతూనే దాని నోట్లో పట్టుకొనివున్న వస్తువు కనిపించింది. ఏమిటది. నా చెప్పేనా. నా చెప్పు ఈ కుక్క దగ్గరి కెందుకొచ్చింది? 'ఛేయ్, చేయ్' అని ఒక రాయి విసిరాను. దూరంగా ఎవరో 'యిజ్జూ' అని పిలిచారు. కుక్క ఆ వస్తువు కొంచెం దూరంగా వదిలి వెళ్ళిపోయింది. దగ్గరగా పోయి చూశాను. ఆ వస్తువు నా ప్రియమైన చెప్పు. ఆనందం హద్దులు మీరింది. దగ్గరగాపోయి చేతితో తాకాను. "ఎవరు నీవు?" ఆ తోటంతా ధ్వనించింది. నా గుండెలు జల్లుమన్నాయి. చుట్టూ చూశాను. ఎవ్వరూ లేరు. మరల చేతితో తాకాను. "ఎవరు నీవు?" మరల అదే శబ్దం వినబడింది. జాగ్రత్తగా ఆలోచించి చూశాను. ఆ ధ్వని నా చెప్పులోంచి వస్తూంది. నా చెప్పు మాట్లాడుతూంది. ఆశ్చర్యం, భయం వేశాయి. ప్రళయం వచ్చేసిందా? లేక ప్రపంచంలో పెద్ద మార్పు జరిగిందా? రెండు సంవత్సరాలు నాకు సేవచేసిన చెప్పు నన్నే ఎవరు నువ్వు? అని అడిగిందే లోకంలో కృతజ్ఞత ఎక్కడుంది. రోజులు మారాయిగా, చెప్పులకు మాటలొచ్చాయేమో.

"నేను నీ యజమానిని, సూర్యనాథాన్ని" అన్నాను.

"నీవు నా పాతయజమానివి కదూ!"

"మరి కొత్త యజమాని ఎవరు?"

"కుక్క"

"కుక్క నీ యజమానా, కాదు సూర్యనాథం నీ యజమాని! నిన్ను నేను ఏడు రూపాయలకు కొన్నాను. నిన్నటినించి కనబడకపోతే వెదుకుతున్నాను. ఇప్పుడు కనబడ్డావు. పోదాం రా మా యింటికి."

"మరలా నన్ను తీసుకపోతావా? ఎందుకు యింకో రెండుసంవత్సరాలు సేవ చేసేందుకా? ఇప్పటికే నీసేవలో నా జీవితమంతా గడిచిపోయింది, ఇన్ని సంవత్సరాలు సేవ చేసినా నన్ను నీ బానిసగా చూశావు."

"నేనా, నిన్ను ఎంతగా ప్రేమించానో నీకు తెలుసా? నీవు కనబడక పోతే వెతికేందుకు ఎందుకొచ్చాను? నీమీద ప్రేమ చేతనే గదా."

"నామీద ప్రేమ చేతనేనా నాలుగు సార్లు మైలుకొట్టి నా దేహాన్ని తూట్లుపొడిచావు? నామీద ప్రేమ చేతనేనా నన్ను రెండు సంవత్సరాలు ఉపయోగించుకొని మరలా నన్ను తీసుక పోయేందుకు తయారయ్యావు?"

"నువ్వు ఈ విషయం అప్పుడే చెప్పి వుంటే నిన్ను వదిలేసేవాడినిగా" "మాకూ హృదయం వుంది. ఇతరుల కష్టాలు మాకూ తెలుసు. నా జీవిత ప్రమాణం ఒక్క సంవత్సరమైనా నీవు బీద గుమాస్తావని నిన్ను కష్టపెట్టకూడదని నీవు పెట్టే బాధలకోర్చి చూశాను. ఒక్క సంవత్సరం కాదు, రెండు సంవత్సరాలు దాటి పోయాయి. మూడో సంవత్సరం వస్తోంది. కాని నా మీద నీ అధికారం తగ్గలేదు. నువ్వు నన్ను గురించి ఎప్పుడూ ఆలోచించలేదు. పరోపకారం కోసం ఎంతటి బాధనైనా సహిస్తాను. కాని మీకు ఉపకారం చేస్తే జ్ఞాపకం పెట్టుకొనే బుద్ధి మీకు లేదు, ఎంతకాలం మీ సేవ చేసినా విశ్వాసం లేదు."

"నిన్ను గురించి ఎన్నోసార్లు ఆలోచించాను. కాని ఏం చెయ్యను నా సంసారం విషయం నీకు తెలియందికాదు. ఎనభైరూపాయల జీతంలో ఆరుగురం జీవించాలి. గౌరవం కాపాడుకోవాలి. ఏడురూపాయలు పెట్టి ఒక్క చెప్పుల జత కొంటానని మా ప్రేమావతితో యిప్పటికి యిరవైసార్లన్నా చెప్పి వుంటాను. "ఏడురూపాయలా, ఆ ఉండే చెప్పులు చాలవా మీరు చేసే ఉద్యోగానికి. ఏం! కలక్టరు పనిచేస్తున్నారా పది జతలుండేందుకు. ఆ ఏడురూపాయలిస్తే చంటివాడికి ఆరుపాల డబ్బాలొస్తాయి. మన రెండోవాడికి రెండు నెలలు స్కూలు ఫీజు కట్టవచ్చు" అంటుంది ప్రేమావతి. నేనేం చేసేది. సంసారం గుట్టుగా జరగాలంటే భర్త భార్య మాట వినాలని నీకు తెలుసనుకుంటాను."

"నాకూ తెలుసు. కాని భార్య మాటవిని నన్ను యిలా కష్టపెట్టడం ఏంబాగుంది? చూడు, నావంటి నిండా ఎన్ని అతుకులున్నాయో? ఎన్ని సీలలున్నాయో? అదే ఒక మనిషికి యిన్ని సీలలు కొడితే బ్రతుకు


ఋతుక్రమం ఆలస్యమైతే?
విచారపడవద్దు ప్రఖ్యాతిగాంచిన
దేవి పిల్సు వాడండి
"దేవి పిల్సు ముఖ్యంగా ఆలస్యమైన, క్రమంగాకాకపోయిన, బాధతోగూడిన, లేకఆగిపోయినబహిష్టుకు దేవి పిల్సు బాగుగ గుణం ఇచ్చును
పూర్తికోర్సు ప్యాకెట్టు 28 మాత్రలు వెల రు 11/-
సగంకోర్సు ప్యాకెట్టు 14 మాత్రలు వెల రు 6/8
పోస్టేజి అదనము
ప్రతిచోటదొరకును
DEVI Pills INDICATED IN DELAYED SCANTY PAINFUL & ARRESTED MENSES
SEENU & Co.
1. అన్ని సందర్భములలోను శీఘ్రముగాను, అమోఘముగాను పనిచేయును
2. ఏస్థితిలోను ఆరోగ్యమునకు ఎట్టిహాని కలిగింపవు.
SEENU & CO., 28, THANDAVARAYA GRAMANI STREET, MADRAS 21. GRAMS "ORCAS" (ESTD 1946) PHONE 55357
(ADVT PERMITTED UNDER G O MS NO.1121 HEALTH)

తాడా? నీకు నామీద అధికారం వుంది కాబట్టి నువ్వేం చేసినా ఊరుకోవాలి. నా కష్టాలు నీతో చెప్పేదాన్ని కాదు. కాని నా జీవితంలో అవసాన దశ ప్రవేశించింది. నీతో బాధంతా చెప్పేయాలనుకున్నాను."

"నిజంగా నిన్నెంతో బాధ పెట్టాను, క్రూరుణ్ని. నాకూ తెలుసు నిన్ను యింతగా బాధపెట్టకూడదని. కాని మానవుణ్ని. పరిస్థితుల ప్రాబల్యంతో ఎలాటిపనులైనా చేయాలి. నీ కష్టాలను నేనైనా విన్నాను, నాకష్టాలు వినేవారెవరు? నా భార్యకు కావలిసిందల్లా కూడు, గుడ్డ, తనపిల్లల ఆరోగ్యం. డబ్బు ఎక్కువగా తీసుకురమ్మని వేధిస్తుంది. నా భార్యకు నాకష్టాలతో పనిలేదు. నా భార్య నన్నెప్పుడూ ఆదరించదు. మా ఆఫీసరుకు నామీద యిష్టంలేదు. నాకన్నా వెనక ఉద్యోగంలో చేరినవారు ఉన్నత పదవుల్లో వున్నారు. కాని నేను గుమాస్తాగానే ఉన్నాను నేను లంచాలు తీసుకోనని, సూటిగా పోతానని మా ఆఫీసరుకు నామీద అసహ్యం. నేను నా కష్టాలు ఎవరితోనూ చెప్పను. మానవులలో పరస్పర సానుభూతి తక్కువ. తోటి మానవునితో కష్టాలు చెప్తే కడవరకు విని ఓ నవ్వునవ్వి ఊరుకుంటాడు. 'నేనేం జేయగలను నువ్వు చేతగానివాడివి' అనే ఉద్దేశ్యంతో. అదే ఒకడు సుఖపడుతున్నాడని తెలిసిందంటే వాడిని గురించి చాలా బాధపడ్తారు. నీకష్టాలు నేను విన్నాను కాబట్టి నాకష్టాలూ చెప్పాను."

"నీవు పడే బాధలు నాకు తెలుసు. నీ బాధలు చూసే నీతో యింతకాలంగా నా కష్టాలు చెప్పలేదు. నీవు ఒక నెలలో ఎన్నిరోజులు అన్నం తినవో నాకు తెలుసు. నీకోటు క్రింద చొక్కాకు ఎన్ని చిరుగులున్నాయో నువ్వొకసారి నీ భార్యతో చెప్పావు. నీ భార్య చీరకొనమన్నప్పుడెంత బాధపడేవాడివో నాకు తెలుసు. నా రెండున్నర సంవత్సరాల సేవలో నిన్ను గురించి చాలా తెలుసుకున్నాను. అందరూ నీవలెనే బాధపడే వారున్నారా? లేరు. జీవితమంటే ఆనందం అనేవాళ్ళున్నారు. జీవిస్తున్నామంటే సుఖిస్తున్నామనే వారున్నారు. వారంతా మమ్ము ఎంతో హీనంగా చూస్తున్నారు."

"ఈదినాల్లో మానవుల్లోనే ఎన్నో తరగతులేర్పడి సామాన్యుడికే గౌరవం లేదే, ఇక చెప్పులకెల్లా వుంటుంది?"

"ఏం! చెప్పులనెందుకు గౌరవించరు? పాదరక్షలు పద్నాలుగేళ్లు అయోధ్యరాజ్యాన్ని సుస్థిరంగా పాలించాయని తెలుసా? కాని ఐదేళ్లలో రెండు మంత్రివర్గాల్ని మార్చి మూడోదాన్ని నిర్మించింది ఆంధ్ర దేశం. చెప్పు ఏమిటి యిల్లా మాటలు మాట్లాడుతోందని ఆశ్చర్యపోతున్నావా? చెప్పానుగా నా అవసానదశ ప్రవేశించింది. నా మనస్సులోదంతా చెప్పేస్తున్నాను. సూర్యనాథం! నేనింత సేపూ మాట్లాడినా, మీ మానవుల్ని ఏమన్నా నీకేమీ విసుగూ, కోపం రాలేదేమి?" "విసుగా? విసుగు, కోపం నా ఇరవై ఒకటోయేట రెవిన్యూలో చేరినప్పుడే వదిలేశాను. నేను కాదు. అవే నన్ను వదిలేశాయి. కోపం, విసుగు, అవమానం, హృదయం అనేవి లేకుండా జీవిస్తున్నాను."

"సూర్యనాథం నేను యిన్ని సంవత్సరాలు నీ సేవచేసినందుకు ఒక ప్రత్యుపకారం చేస్తావా?"

"ఏమి చెయ్యాలి?"

"నేను దైవసందర్శనంకోసం జీవితాంతం వేచి చూచాను. కాని నా ఆశ తీరలేదు. నాజీవితంలో నా ఒకటే కోరిక. దేవుణ్ణి దర్శించుకోవాలి. నాకీ మాత్రం సహాయం చేశావా నీఋణం వచ్చే జన్మలో తీర్చుకుంటాను."

"నువ్విలా చూసేందుకు వీలవుతుందా? పూజారి నిన్ను చూస్తేనే మండిపడ్తాడే"

నేను దేవాలయంలోకి రావడం నీకు ఇష్టమేగదా."

మాకు నిన్ను దేవాలయంలోనికి తీసుకపోడానికి నాకు అభ్యంతరం లేదు. కాని పూజారి ఒప్పుకోడు. మీరు దేవాలయంలోనికి వస్తే అపవిత్రమై పోతుందట."

"అపవిత్రత! మేము దేవాలయంలోని కొచ్చినంత మాత్రాన అపవిత్రమైపోతుందా? మేము ఏ కార్యముచేసి అపవిత్రులమై పోయాము. మానవసేవయే మాధవ సేవగా మా జీవితాంతం మీకు సేవచేయడం అపరాధమా? మానవుల్ని ఏ ఆపదా రాకుండా కాపాడడం మా నేరమా? మీలో అపవిత్రులు లేరా. వారంతా దైవసాన్నిధ్యానికి రావచ్చా? రోజులు మారాయి. హరిజనులకు దేవాలయ ప్రవేశార్హత లభించింది. అప్పటి వరకు 'అపవిత్రులైనవారు' పవిత్రులుగా మారారు. ఇంకా కాలం మారే అవకాశం వుంది. మాకు దేవాలయ ప్రవేశార్హత లభిస్తుంది. ఇప్పటి మాఘోరాలు అప్పటికి తగ్గుముఖం పట్టవచ్చు. మేమూ దైవసాన్నిధ్యాన్ని చేరే రోజు వస్తుంది" అంది చెప్పు.

"ఏమిటి అలా ఉపన్యాస మిస్తున్నావు. నాకేం మాత్రం రాజకీయపు వాసన లేదే. మరి నా చెప్పువు నువ్వు పెద్ద నాయకుడిలా మాట్లాడుతున్నావు. నువ్వు చెప్పినదంతా నిజం. రేపే నీ ఉపన్యాసం నా పేరు పెట్టి పత్రికల్లో వేయిస్తాను. అయిందేదో అయింది. రాపోదాం. మన యింటికి" అన్నాను, చెప్పును చేతిలోకి తీసుకొంటూ.

"అయ్యా! ఏదో కోపంలో మాట్లాడేశాను. ఏమీ అనుకోకు. ఇప్పటి వరకు నా మీద నీవు చూపిన ప్రేమకు నా ధన్యవాదాలు. ఇక నేను నీ సేవ చేయలేని స్థితిలో వున్నాను. నా జీవితంలో ముఖ్యమైన కోరిక దేవుణ్ని దర్శించాలని. కాని నా కోరిక వచ్చే జన్మలోనైనా తీర్చుకుంటాను. ఇక నీతో నా బాంధవ్యం తీరింది. అవసాన దశలో వున్నాను. నా మనసులోని బాధను చివరకు నీతో చెప్పుకొన్నాను. ఇక ఈ లోకంతో నాకు పనిలేదు. నమస్కారం. వచ్చే జన్మలో నీకు సేవ చెయ్యగలిగితే నా అదృష్టం. నా గురించి నువ్వేమీ బాధపడవద్దు" అంటూ తలవాల్చుకొంది.

ఆ మాటలు వింటూంటే నా మనస్సులో ఏదో ఆత్మీయుణ్ణి పోగొట్టుకున్నట్టు తల పోశాను. తన జీవితమంతా నా సేవలో గడిపిన చెప్పు నన్ను విడిచివెళ్ళి పోతోంది. నా శరీరం వేడెక్కింది. కళ్లలో నీళ్ళుతిరిగాయి.

పల్లకుక్క వచ్చి నా చెప్పును నోటితో పట్టుకుపోతోంది. చెప్పు నావైపు విచారంగా చూస్తోంది. నా గుండె దడ ఎక్కువైంది. కన్నీటిబొట్లు కాలిమీద పడింది. కళ్లు తుడుచుకొని చూశాను. కుక్క చెప్పును తీసుకపోతోంది. "ఛయ్ ఛయ్" అన్నాను. నా ప్రియమైన చెప్పును రక్షిద్దామనే ఉద్దేశంతో.

"ఏమిటండీ తెలవార్లు, ఏదో మాట్లాడ్డం, చెయ్యులున్ను. నిద్రలోకూడ కుక్కల్ని తరుముతున్నారేమిటి? నిద్ర లేవండి" అంటుంది మా శ్రీమతి ప్రేమావతి. నిద్రలేచి చూచాను. సూర్యకిరణాలు జామచెట్టుమీద పడుతున్నాయి. కుక్కా లేదు. చెప్పూ లేదు. పిల్లలు ఆడుకుంటున్నారు. "ఏం కళ్లల్లో నీళ్లున్నాయి? నిద్రలో ఏడ్చారేమిటి?" అంది "నేనా, ఏడ్చానా? అవును కలలో చెప్పుకనబడింది. నీతి నేర్పింది. మానవుల్ని గూర్చి చాలా బాగా మాట్లాడింది"

"ఏమిటి చెప్పు మాట్లాడిందా? ముఖం కడుక్కోండి మళ్లీ చెప్తురుగాని. చెప్పేమిటి, మీతో, కర్రలు, రాళ్ళు, బల్లలు అన్ని మాట్లాడుతాయి. మీలాగా వినే వాళ్లుంటే మాట్లాడకేం జేస్తాయి?" అంటూ స్లోమార్చింగ్ చేస్తూ వెళ్ళింది మా ప్రేమావతి. ★


**అధైర్యపడవద్దు**

శాస్త్రీయమైన, నిజమైన SEX— ADVICE పొందవచ్చును. మీకు ఉండుకొన్న లక్షణములు వ్రాయుచూ, యింకా వివరాలకు కవరు పంపేది.

డాక్టరు రత్నంసన్స్, (Estd 1904)
మలక్ పేట బిల్డింగ్స్, హైదరాబాద్ - 2.
(దక్కన్)

#  మరోలోకంలో 

(26-వ పేజీ తరువాయి)

[కొన్సేపాగి] హమ్మయ్య...బతికి బయటపడేసరికి తల ప్రాణం తోకకి వచ్చింది. దీని కిదేం పాడుబుద్ధి? ... ఏమిటిదంతా? [కొంత హెచ్చుస్థాయిలో] నాకేమైనా మతిపోయిందా? ఈ ప్రపంచానికేదైనా విపరీతం సంభవించిందా? లేదు-లేదు... నాకే మతి పోయినట్లుంది...ఇప్పుడేం చెయ్యను? అదో-అక్కడెవరో 'మన స్తత్వ శాస్త్రవేత్త' అని గేటు ముందు బోర్డు వేసుకుని ఉన్నారు. వెళ్ళి, ఆయన్ని కలుసుకుంటాను.

మన స్తత్వశాస్త్రవేత్త: ఓహో...మీరా? రండి...రండి.

విశ్వం: నన్ను మీరు ఎరుగుదురేమిటి?

మన: ఎరక్కేం? మిమ్మల్ని చూస్తేనే, మీ రెందుకు నా దగ్గరికి వచ్చారో తెలుస్తూనే ఉంది. మీరు ఏదో ఆపదలో ఉన్నారు కదూ?

విశ్వం: అవునండి డాక్టర్ గారూ, సరిగ్గా ఊహించారు.. ఈ వేళ నించీ—

మన: అదంతా తర్వాత చెబుదురుగాని, ముందు నా ప్రశ్నలకు జవాబు లియ్యండి... మీరు ఆస్పత్రిలో పుట్టారా, ఇంట్లో పుట్టారా?

విశ్వం: ఆఁ?...నాకు తెలీదు.

మన: పోనీ-ఇంకో ప్రశ్నకు సమాధాన మియ్యండి. మీకు సైకిల్ తొక్కడం తెలుసా?

విశ్వం: ఆఁ.

మన: మీరు సైకిల్ ఎక్కేటప్పుడు పెడల్ మీద కాలు పెట్టి ఎక్కుతారా, లేక వెనక చక్రం ఇరుసు పక్కన హబ్ ఉంటుంది చూడండి-ఆ హబ్ మీద కాలు పెట్టి ఎక్కుతారా?

విశ్వం: ఉండండి— జ్ఞప్తికి తెచ్చుకొని చెప్తాను.

గడ్డపతను: [హడివిడిగా] అదో-ఇక్కడ ఉన్నావా? త్వరగా రా...కొంప మునుగుతుంది.

విశ్వం: ఎవరయ్యా నువ్వు?...అరే నువ్వా? [మెల్లగా] ఈ గడ్డపాయన్ని ఎక్కడో చూసినట్లు జ్ఞాపకం.

గడ్డ: రమ్మంటే అలా చూస్తూ కూర్చుంటా వేమిటయ్యా? ముందు పద...

విశ్వం: ఎక్కడికయ్యా?

గడ్డ: లేచి రావయ్యా. పదమూడు నిమిషాలు పూర్తి కావొస్తుంది. నువ్వు త్వరగా చేరుకోవాలి.

విశ్వం: నేను రాను.

గడ్డ: దయచేసి రావయ్యా. నీ కాళ్లు పట్టుకుంటాను. పదమూడు నిమిషాలు గాటితే-నన్ను బ్రతకనివ్వరు.. నా తల మీద వెంట్రుకలుండవు ..నా పేరు ప్రతిష్ఠలు పోతాయి. హత్యా నేరం కింద నన్ను ఉరితీస్తారు...రావయ్యా అంటూ ఉంటే...

విశ్వం: అరే-ఇదేమిట? వదలవయ్యా! ఇంత పెద్దమనిషిని-నా షర్టు కాలర్ పట్టుకొని, అలా లాక్కుని పోతావేమిటి? అరే, నీకే కదూ చెప్పేది? ఏమిటండీ డాక్టర్ గారూ, మీకేమైనా మతి పోయిందా? అతను నన్నిలా బరబర లాక్కుపోతూంటే చూస్తూ ఊరు కుంటారేమిటి?...అరే-ఆగవయ్యా. కాలర్ చిరుగు-నొప్పెడుతోంది.. నేనే వస్తాలే...అరే-అరే

[గాలి జోరున వీస్తుంది]

[చప్పట్లు-జన కోలాహలం]

సోదర సోదరీమణులారా!...క్షమించండి.. సోదరులారా, చూశారా, ఇందాక ఈ బల్లమీద పడున్నది వొట్టి కట్టె. మీరందరూ చూశారు. ఒక డాకర్ కూడా పరీక్ష చేశాడు.. ఇలా పూర్వకాలంలో ఎంతో మంది మునీశ్వరులు యోగసమాధిలో ఉండి, తమ భౌతిక శరీరాలను ఎంతో కాలం—ఒక్కొక్కసారి రోజుల తరబడి సమాధి చేసేవారు. హిమాలయపర్వత ప్రాంతంలో ఒక యోగి పుంగవుని వద్ద శిష్యరికం చేసి, నేనీ విద్యను నేర్చుకున్నాను. మీరు ఈ ఆఖరి విద్యను చూసి, ఆనందించారు. ఇంతటితో ఈ వేళటి నా ఇంద్రజాల ప్రదర్శన కార్యక్రమం ముగిసింది. అన్నట్టు [తగ్గుస్థాయిలో] మీ పేరేమిటండీ?

విశ్వం: [ఆవులిస్తూ] విశ్వం.

గడ్డ: మహాశయులారా! చూశారా? వీరి పేరు విశ్వంగారు...ఈ విద్యను ప్రదర్శించడానికి మీలో ఎవరినైనా రమ్మని పిలిస్తే, ముందు ఒక్కరు కూడా రాలేరు. ఆఖరికి ఎవ్వరూ రాకపోయేసరికి, పాపం వీరే ఎలాగో ధైర్యం చేసుకువచ్చి, ఈ బల్ల మీద పడుకున్నారు. ఏ యోగీశ్వరులకో సిద్ధించే యోగసమాధి మహదావకాశాన్ని పొందగలిగే అదృష్టం ఈ విశ్వంగారికి దక్కింది.. వీరికి నా తరఫున మా ట్రూప్ తరఫున కృతజ్ఞతాపూర్వకాభివందనాలు అర్పించుకుంటున్నాను.

[చప్పట్లు...జనకోలాహలం] ★

[ఆలిండియా రేడియో, మద్రాసు కేంద్రంవారి సౌజన్యంతో.]




# లల్లూరాం అండ్ కంపెనీ

(స్థాపితము 1928.)

ఎన్నో సంవత్సరాలుగా మన్నికకు, నాణ్యతకు, సరసమైన ధరలకు ప్రసిద్ధికెందిన

* ఇనుప పెట్టెలు * ఉక్కు బీరువాలు

* క్యాషు బాక్సులు

## లల్లూరాం అండ్ కో,

వెలగలేటివారి వీధి, విజయవాడ-1. క్రొత్త షోరూమ్ - మారుతి సినిమా కెదురుగా.



# అతిమూత్రవ్యాధి నెమ్మదించును

మూత్రంలో చక్కెరపోవటం అతిమూత్ర వ్యాధి (DIAFETES) అంటారు. ఇది ఎంత ఉపద్రవకరమైన వ్యాధి అంటే. దీని పాలబడినవారు ఆరోజుకారోజు మృత్యువుకు ఆసన్నమౌతుంటారు ఈజబ్బు లక్షణాలలో ముఖ్యమైనవి ఎక్కువగా దాహం, ఆకలి తరచుగా వేసి, రక్తంగాని, లేక చక్కెరలేకుండగాని మూత్రం బయలు వెడలటము, దురద మొదలైనవి వీనస్ ఫారమ్ అనేక సంవత్సరముల పరిశోధనల ఫలితంగా తయారు కాబడినది దీన్ని వాడటంవల్ల వేనకు వేల మందిమృత్యుముఖమునుండి బయటపడ్డారు దీన్ని వాడితే రెండవలేక మూడవ రోజు నుండేమూత్రంలో చకెర తగ్గించి అత్యధిక మూత్రంకూడా నివారిస్తుంది మూడురోజుల తర్వాత మీకు బాగా తేలిక ఇస్తుంది దీనికి పత్యంలేదు ఇన్ జెక్షన్లు అవసరం లేదు. వివరములు గల ఇంగ్లీషు కరపత్రానికి వ్రాయండి ఉచితంగా పంపెదము.

50 బిళ్లల బుడ్డి ఖరీదు రు. 6-12-0 లు. ప్యాకింగు పోస్టేజి ఉచితము.

Venus Research Laboratory(A,P.W)
P. O. Box No. 587, Calcutta.

# వనితా లోకం

## ★ నేపాల్‌లో పెళ్ళిముచ్చట ★

వివాహ సమయంలో నేపాల్ దేశంలో ధనవంతుల ఇంటి పెండ్లికుమార్తె ఒళ్ళు పట్టనన్ని నగలు ధరిస్తుంది. రాచ కుటుంబంలో కన్య అయితే ఇక ఆ అలంకారాలకు మితి కెండదు. పుట్టింటివారు పెట్టే నగలే గాకుండా, అత్తవారు పెట్టేవి మరికొన్ని ఉంటాయి.

భారతీయుల్లో నేపాల్ ప్రజలు చాలా గర్విష్ఠులని ప్రతీతి. అయినా వంశం మంచిదైతే దరిద్రులయినప్పటి ధనవంతులు తమ కంటె తక్కువ డబ్బున్న పిల్లలనైనా పెళ్ళి చేసుకుంటారు. మధ్యవర్తులు పెండ్లిసంబంధాలను కుదురుస్తారు. ముహూర్త నిశ్చయం, వివాహం ఎక్కడ జరగాలో అన్నీ నిశ్చయించు కుంటారు. వివాహ కానుకలను, అనుకున్న రోజుకి ఆడపెళ్ళివారు మగపెండ్లి వారికి పంపుతారు. కట్నం ధనరూపంలో గాని బంగారం వెండి రూపంలో గాని ఉంటుంది. మగపెళ్ళివారు బంధుమిత్రులతో వివాహానికి తరలివస్తారు.

ఆడపెండ్లివారి ఊరువచ్చిన మరునాడు ఉదయమే పెండ్లికొడుకు ఆడపెళ్ళివారింటికి ఊరేగి వెడతాడు. ఆడపెళ్ళివారింటిదగ్గర పువ్వులదండలు వేసికొంటారు. సర్వసాధారణంగా రాజపుటానాలో పెండ్లికొడుకు సాహసి, బలశాలి, యుద్ధనిపుణుడు అయి ఉంటాడు. అటువంటి ఉత్తముని, పెళ్ళికూతురు పుష్పమాలవేసి అతన్ని భర్తగా ఎంచుకుంటుంది. ఈ ఆచారం రామాయణంలో రాముడు శివధనుర్భంగంచేసి సీతను చేపట్టే ఆచారం ప్రకారం వచ్చినది.

పెండ్లికూతురును బాగా అలంకరించి గాజ్పై బెట్టి, ఎదురుగా పువ్వుల దండలుంచిన పళ్ళెరం ఉంచుతారు. పెండ్లికుమార్తె తండ్రి, ఆమె హస్తాన్ని లేవనెత్తితే, ఆమె ఆ చేతితో పవిత్రమైన కుంకుమను పెండ్లి కుమారుని నుదుట ఉంచి, అతని చేతి వ్రేలికి ఉంగరం తొడుగుతుంది. తరువాత అదే విధంగా పెళ్ళికుమారుడు కూడ చేస్తాడు. అప్పుడే పెళ్ళికుమారుడు, ఎఱ్ఱని రాళ్ళతో పొదిగిన నగను పెండ్లికుమార్తె మెడలో కడతాడు. ఆ సమయంలోనే ఒకరినొకరు ప్రప్రథమతః చూసుకుంటారు.

### మూడురకాల పూలమాలలు

పెండ్లిసమయంలో కట్టే పువ్వుల దండలు మూడు రకాలుగా ఉంటాయి. ఒక్కొక్క పువ్వు కొన్ని గుణాలకి చిహ్నంగా పరిగణిస్తారు. ఒకరకమైన గడ్డిలో చేసిన దండ ఒకటి ఉంటుంది– అది ఎండిపోదు.–జీవితపర్యంతం సౌఖ్యవంతంగా ఉండవలసిందని తెలియజేసేందుకు అది చిహ్నం. రెండోదండ జాస్మిన్ పువ్వులు– అది ప్రేమకు చిహ్నం. మూడోది మంచిగంధం కొమ్మలకు వెండి దారం చుట్టినది– అది ఆరోగ్యానికి, చిరాయువుకు చిహ్నం.

చామర్తి సావిత్రి

సూత్రధారణ జరిగాక పెండ్లి కుమారుడు తన విడిదికి వచ్చి పెండ్లికుమార్తెకు తాను బహుమతిగా ఇచ్చే ఆభరణాలు, బట్టలు, అలంకారాలు పెద్ద పెద్ద పళ్ళాలలో పెట్టి వాటిపై మెరిసే ఖరీదైన సిల్కుగుడ్డలు కప్పి ఊరేగింపుతో పంపుతాడు. ఆ ఊరేగింపుకి ముందు ఒక తెల్లనివస్త్రాన్ని ఎగుర వేస్తూ వెడతారు. ఆ వస్త్రంపై పెండ్లి కుమారుని చేతిగుర్తు ఎఱ్ఱరంగులో ముద్రిస్తారు–ఆగుర్తు మీదే పెండ్లి కుమార్తె తన చేతిగుర్తు ముద్రిస్తుంది. ఆ రెండు హస్తాలగుర్తులు వారి అనుబంధాన్ని ధృవపరుస్తాయి.

ఆ మరునాడు పెండ్లికుమారుడు వెండి అంబారీగల, ఏనుగునెక్కి ఊరేగుతూ వాద్య బృందాలతో ఆడపెళ్ళివారింటికి వడతాడు. పెండ్లికుమార్తె తండ్రి వచ్చి ఏనుగుచుట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చేస్తాడు. అతనితో కూడా ప్రదక్షిణం చేసేటప్పుడు పవిత్రగంగా జలంతో మరికొందరు వెనకనే ప్రదక్షిణం చేస్తారు.

ఆ తరవాత పెళ్ళికూతురు తరఫు స్త్రీలు మంగళగీతాలు పాడుతూ పెండ్లికొడుకుపై మల్లెపూలవర్షం కురిపిస్తారు.

ఏనుగు పల్లకి (అంబారి) నుంచి పెండ్లికొడుకును ఒక బలిష్ఠుడైన గూర్ఖా తన భుజాలపై ఎక్కించుకొని వివాహ వేదిక దగ్గరకు తీసికొని వెడతాడు. అక్కడే హోమం ఉంటుంది. పూర్వ సంప్రదాయ ప్రకారమే శాస్త్రోక్తంగా మంత్రయుక్తంగా వివాహకాండ జరుగుతుంది. కన్యాదాత, కన్యాదానం చేయడం అప్పుడేనన్నమాట.

వధూవరులు ఒకరికొకరు పెరుగుఅన్నం తినిపిస్తారు. ముందెవరైతే ఎదుటివారికి అన్నం తినిపిస్తారో, ఆ ముందు తిన్నవాళ్ళు అవతలివారికి జీవితాంతం లోబడి వుంటామని తెలియచెప్పేందుకు ఆ కార్యక్రమం సాగుతుంది. ఒక్కొక్కప్పుడు పెండ్లికుమార్తె ముందుగా పెండ్లికుమారుని నోటికి పెరుగుఅన్నం తినిపించడం పొరబాటున జరిగితే నానా హంగామా జరుగుతుంది.

ఆ తరవాత పెండ్లి కుమార్తె భర్త తెచ్చిన ఆభరణాలను వస్త్రాలను ధరించి అతనితో కలసి అత్తవారింటికి వెళ్ళిపోతుంది.

ఈ తంతు అంతా మూడు రోజులపాటు జరుగుతుంది. ఈ మూడు రోజులూ విందు భోజనాలూ, వినోదాలూ ముమ్మరంగా సాగుతాయి.



## ప్రకృతి ప్రసాదించిన పరమౌషధాలు

# మంచిగంధము

ప్రకృతి మాత మానవజాతి కుపయోగం నిమిత్తం అమూల్యమైన వస్తు సంపుటి మన కళ్లముందు పెట్టింది. వాటి వుపయోగాల్ని తెల్సుకోకుండా కాళ్ళతో విదలించేస్తున్నాం. ప్రతీవస్తువు మన కనేక విధాల వుపయోగిస్తుంది. యివన్నీ మనకెలా వుపయోగపడ్తాయో సుదీర్ఘంగా ఆలోచించే మనపూర్వులు మన దైనందిన కార్యకలాపాదుల్లో అమర్చేరు. అట్టివాటిల్లో కొన్ని తెల్సుకుంటే కొంతవరకూ వుపయోగపడవచ్చు. ఇదివరకు మంగళకరమైన పసుపు గురించి తెలిపితిని. ఇపుడు మంచి గంధం గురించి వ్రాస్తాను.

సంస్కృతమున చందన, శ్వేతచందన, భోగవల్లభ అనియు, హిందీలో చందన్ అనియు, తెలుగులో శ్రీగంధమని, గంధమని, చందనమనీ, ఆంగ్లమున శాండల్ వుడ్ అనీ పిలుస్తారు.

**ఉత్పత్తి:** భారతదేశంలో చాలా చోట్ల (మలబారు, అస్సాం, మైసూరు అడవుల్లో) పెరుగుతుంది. ముఖ్యంగా మైసూరులో గంధపుటడవులే ప్రభుత్వోద్యాజమాన్యాన్న పెంచబడుతున్నాయి.

ఈ గంధమునుండి తైలం తీస్తారు. దీన్నే చందన తైలము (Sandal wood oil) అంటాం. ఈచందన అత్తరు తీయుటకుగాను మైసూరు ప్రభుత్వం ఒక ఫ్యాక్టరీ స్థాపించింది. కల్తీ లేకుండా ప్రశస్తమైన చందన అత్తరు, ఈ ఫ్యాక్టరీలో తయారుచేసి భారత దేశంలోను, విదేశాల్లోను విక్రయించుచున్నారు.

గంధపుచెక్కతో అనేకవిలాస వస్తువులు తయారుచేస్తున్నారు. బొత్తాములు, బొమ్మలు, చేతి బెత్తాలు మొదలైనవి తయారవుతున్నవి.

దీన్ని అన్ని మతాలవారు పూజల్లో వుపయోగిస్తారు. అన్ని శుభకార్యాల్లోనూ ముఖ్యంగా వాడతాము. ఇది మనోహరమైన పరిమళద్రవ్యము. వేసవికాలంలో స్నానం చేసినతర్వాత మంచి గంధము శరీరమునకు పూసిన - లేదా ఒకచుక్క చందన అత్తరును చేతులకు రాసుకొని శరీరమంతా అద్దిన ఘుమఘుమ పరిమళాన్ని విదజల్లును. మంచి చలువ జేయును. వేసంగిలోవచ్చు, పేటుట లేక పేలుట వుండదు. (చర్మంమీద పుట్టు చిన్న చిన్న నీటిపొక్కుల్లాంటివి) ముఖానికి పూసిన, కండ్లకు మిక్కిలి చలువ జేయును.

> మూలమునన్ భుజంగములు
> మూర్ధమునందు విహంగముల్, ద్విపా
> ద్యాళ మతంగముల్ విపుల
> శాఖలయందు ప్లవంగవర్గముల్
> పూలను భృంగముల్, సవిధ
> భూమికురంగము లేమి కోరియో
> యేలని బంటులై కొలుచు
> నెప్పుడు చందన వృక్షరాజమున్.
>
> ('మధుర పండితరాజము'నుండి)

## క్రిమిసంహారి

మంచిగంధం ముఖ్యంగా క్రిమిసంహారి. అందుకే పెద్దలు చెప్పేరు - చందనం క్రిములకొక నారాయణాస్త్రం, మానవులకొక మన్మథ బాణమని - మంచి గంధం పొట్టు పూజల్లో ధూపం వేసుకోటాన్కి పనికి వస్తుంది పడకగదుల్లో యీ గంధం పొట్టు కాలిస్తే పరిమళమైన సువాసన వచ్చుటేగాక ఆ గదిలోని దోమలు, క్రిములు నశిస్తాయి.

నూతన వధూవరులకు పెండ్లి సమయంలో శరీరానికి పూస్తారు, పేరంటాల్లో పేరంటాళ్ళకు గంధం, పసుపు కలిపి గడ్డమునకు, చేతులకు రాస్తారు. కొంతమంది పండితోత్తములు, వేదశాస్త్రజ్ఞులు గంధాన్ని బొట్టుగా కూడా పెట్టుకుంటారు.

దురదృష్టవశాత్తు మన మీనాడు చాలా వరకు చందనం వుపయోగించడం తగ్గించేశాము.

## ఉపయోగాలు

**చంటిపిల్లలకు:—** సవికాలంలో చంటి పిల్లలు వుడుకులలోను, వుడుకు జ్వరాల్లోను బాధపడతారు. అట్టి వారికి చాలా చిరాకు వుంటుంది. స్థిమితంగా వుండలేరు. అస్తమానూ పోరుపెట్టి, గోల చేస్తూవుంటారు. అటువంటప్పుడు మంచి గంధం చెక్కతో స్వచ్ఛమైన మంచినీళ్ళతో (పన్నీరుతో తీస్తే చాలామంచిది) గంధం తీసి శరీరాన్కి (ముఖము, వీపు, చేతులు, ఛాతీ పూస్తేవుడుకు రాదు. చలవచేస్తుంది. సుఖంగా నిద్రపడుతుంది. చెమట విస్తారం పట్టనీయదు. చిరాకువుండదు. పసిపిల్లలు చాలా ఆనందంతోను,హాయిగాను వుంటారు. ఇది చెమటవల్ల వచ్చే దుర్గంధాన్ని తొలగించును.

పిల్లల్లో సాధారణంగా ఉడుకువల్ల పెద్ద పెద్ద గెడ్డలు, కురుపులు, చర్మం మీద చిన్న చిన్న పొక్కులు యీ వేసంగిలో వస్తాయి. అలాంటివాటిచే పిల్లలు చాలా బాధపడుతూ వుంటారు. కుదురుండదు. నిత్యము యీ గంధం తీసి మధ్యాహ్నం వేళ పూస్తే గెడ్డలు, గాని, కురుపులు గాని, పొక్కులు గాని వుండవు. చర్మానికి మంచి మృదుత్వమును, సౌందర్యము నిస్తుంది. చర్మరోగాలు అసలు రావు. గజ్జి, చిడుము, దురదలు వుండవు. గజ్జి, చిడుము, దురదలు వున్నచో మంచి గంధమునకు (నీళ్లతో తీసింది) బదులు—స్వచ్ఛమైన చందన అత్తరును వుపయోగిస్తే యెంతవంటి మొండిచర్మవ్యాధులు-తామర, గజ్జి కురుపులు, దురదలు వగైరాలన్నీ మాడిపోతాయి.

చాలామంది చెమట పుట్టకుండా చర్మం మీద పౌడర్లు చాలా దట్టంగా అద్దుతూ వుంటారు.

దానివల్ల స్వేదరంధ్రాలు కప్పడిపోవును, అప్పుడు చర్మంద్వారా బయటకు పోయే మలినాలు బంధించబడి పోతాయి.

చర్మంలో రోమకూపాలదగ్గిర తైలగ్రంధులున్నవి. యివి ఒక విధమైన తైలమునుత్పత్తిచేసి చర్మం మీదకు పంపుచున్నవి. యీ తైలం వల్లనే చర్మమునకు మృదుత్వము వచ్చుచున్నది.

కాబట్టి ముఖ్యంగా పిల్లలకు (వీలైనచో పెద్దలుకూడ) సబ్బులు, పౌడర్లు, స్నోలు వగైరాలు వాడవద్దు. పిల్లల చర్మం చాలా సునిశితమైనది. సబ్బులు వగైరా వాడుటచే చర్మంయొక్క స్పర్శాజ్ఞానం క్షీణించును. ఈ స్పర్శజ్ఞానం కొన్ని నెలల్లో, లేక 2, 3 సం॥ల్లో క్షీణించక పోవచ్చును. కొన్ని సంవత్సరాలకి తప్పక క్షీణించును. ముఖ్యంగా పిల్లలకు శీకాయిగుండ, కుంకుడుకాయ పులుసు, నలుగుపిండి స్నానం చేయుటకును వుపయోగిస్తే చాలా మంచిది.

సంగాని ప్రభావతి, భానుమతి

(హోమియో వైద్య సిద్ధాంతం ప్రకారం మానవుడికి ఏ వ్యాధివచ్చినా చర్మమే కారణ మని ఋజువుచేశారు.)

స్నానానంతరం శ్రీ గంధాన్ని పూసిన ఉడుకులు, ఉడుకు జ్వరాలు, తాపము, దుర్గంధము, మాలిన్యము, శ్రమ, అస్తి మితం ఉండవు. ఇది చర్మవ్యాధులు దరికిరానీయదు. చలువచేసి పరిమళ భరితమై ఆహ్లాద కరంగా వుంటుంది. యిల్లే పెద్దవాళ్ళకి.

## ఒక విశేషం

చెమట వేసవిలో విస్తారం పట్టుటచే శరీర మందలి లవణములు చెమట ద్వారా పోవుటవల్ల నిస్త్రాణ, వడదెబ్బ కల్గుచున్నవి. మంచిగంధము వడదెబ్బకు, నిస్త్రాణకు పర మౌషధం. మంచిగంధము పొట్టుగాని, చెక్క కషాయంగాని బియ్యపు కడుగు, తేనె కలిపి లోపలికివ్వదగును – పైకి గంధం పూయాలి. యీ మంచిగంధంలోని విశేష మేమిటంటే అధికంగా చెమట పట్టువార్కి తగ్గించును. చెమట పట్టని వార్కి చెమట బుట్టించును.

ఈ మంచిగంధము లోపలికి వాడుటవల్ల మనకి అనేక వుపయోగములు గలవు. యేకారణంచేతనైనా రక్తం చెడినచో అట్టి దుష్ట రక్తాన్ని హరించి రక్తశుద్ధి గావించును. తాపం, విదాహం, శ్రమ, వాత, పిత్త, శ్లేష్మములను హరిస్తుంది. మేహరోగాన్ని, క్రిమిరోగాల్ని, కాస శ్వాసలను, అరుచి, మనోభ్రమలను రానీయదు. ఒకానొకచో అవి ఉన్నట్లయిన ఉపశాంతి కలిగిస్తుంది. అయితే దీనిని తగు మోతాదులో వాడాలి. అతి సర్వత్ర వర్జయేత్ అన్నారు గదా.

వాత, పిత్త, శ్లేష్మములను జయించును కాబట్టే అనుభవజ్ఞులయిన ఆయుర్వేద వైద్యులు తీవ్రతాప జ్వరాలలోను, సాధారణ, శీత పైత్య జ్వరాలలోను మంచిగంధపు కషాయం తిప్పతీగ కషాయం కలిపి యిస్తూంటారు. అట్లు చేయుటవల్ల అప్పటికి ఉపశాంతి కలుగుటయే గాక వ్యాధి తగ్గుముఖం పడుతుంది.

రాజయక్ష్మ—క్షయ—వ్యాధి చాలా ఘోరమయిన వ్యాధి. ఈ వ్యాధిచే అనేక మంది మృత్యువాత పడిపోతున్నారు. ఆహార విహారాదుల యందు జాగ్రత్త వహించక పోవుట వల్లను, తరుణ వ్యాధుల అనంతరము తగిన పథ్యపానాదులలో జాగ్రత్త వహించక పోవుటవల్లను, మన శరీరంలో వ్యాధినిరోధక శక్తులు క్షీణించుట వల్లా ముఖ్యంగా యీ వ్యాధి పోకుతుంది. ఆరోగ్యవంతమైన ప్రతీ మానవ శరీరానికీ ఆయా వ్యాధుల బారినుండి తప్పించుటకు, ఆయా వ్యాధుల క్రిములను జయించుటకు భగవంతుడు ప్రతీ శరీరంలోను వ్యాధి నిరోధక శక్తులను (రెసిస్టన్స్ పవర్) ప్రసాదించేడు. అందుచే మన పూర్వులు ఎంతటి గాలిచొరబడని గృహాలలో నివసించినా, చిన్న చిన్న కిటికీలతో గృహ నిర్మాణాలు చేసినా, నేటి ఆరోగ్య సూత్రాలను ఆనాడు పాటించక పోయినా మంచి ఆరోగ్యవంతులుగానే ఉండేవారు గదా! యే క్షయరోగం వాళ్ళని బెదిరించలేక పోయింది. నేడో? మనమెంత నవీన పద్ధతులలో ఆరోగ్య సూత్రాల్ని పాటిస్తున్నా, విశాలమైన గదుల్లోను, ధారాళమయిన గాలి ప్రసరణ యున్న, గృహాలలో నివసిస్తున్నప్పటికీ అనేకమయిన టి. బి. శానిటోరియంలు ఉన్నా ఆ శానిటోరియంలలో నేటి క్షయ రోగులకు స్థానం చాలనంత యెక్కువ రోగుల్ని క్షయ క్రిమి ఉత్పత్తి చేసేస్తోంది. రోజు రోజుకీ క్షయరోగుల సంఖ్య వృద్ధిఅవుతోంది గాని తగ్గుటలేదు. యెన్ని వ్యాధినిరోధ ఔషధాలు (Preventive Medicines) వాడినా ఫలితం ఆశించినంత కనుపించుటలేదు. ఇది అంతా ముఖ్యంగా మానవశరీరంలోని వ్యాధి నిరోధక శక్తి (Resistance Power) తగ్గిపోవడం వల్ల నేది.

ఈ క్షయ వ్యాధి నివారణౌషధాలలో — (ఆయుర్వేద శాస్త్ర బద్ధముగా తయారు కాబడిన మందులు.) శ్రీగంధం ప్రముఖస్థానం ఆక్రమిస్తుంది. మహాచందనాది తైలం వగయిరా—కాబట్టి, మంచి గంధము విరివిగా నుపయోగిస్తే యీ వ్యాధి నిరోధకానికి చాలా ఉపయోగం ఉండవచ్చు.

ఇంకా ఆయుర్వేద శాస్త్ర బద్ధములైన యితర ఔషధాలలో చాలా వ్యాధులకు (కుష్టువ్యాధి, ప్రమేహము, రక్తపిత్తము (Haemoplegia) ఉన్మాదము, క్రిమి వ్యాధులు, జ్వరాలు, స్త్రీలకు గలుగు బట్టవిడుపు వ్యాధులు అనగా కుసుమ దీన్నే తెల్లబట్ట అనికూడ అంటారు. రక్తకాస, క్షయ మొదలయిన వాటి మందులలో ప్రముఖస్థానం ఆక్రమిస్తుంది.

బాహ్యప్రయోగాలు, కీళ్ళ నొప్పులకు మంచిగంధము, కచ్చూరాలు, హారతి కర్పూరం, కలబంద రసంతో నొప్పులున్న చోట పట్టువేస్తే తగ్గిపోతుంది. ఈ పట్టువేసి అనేక

## సాంఘిక వైద్యం:

# ★ నాలుక సంరక్షణ ★

మనము నాలుకను జాగ్రత్తగా కాపాడుకొనుట అవసరమైన విషయము. ఎందుకనగా మంచి తెచ్చినా నాలుకే, చెడుగు తెచ్చినా నాలుకే. ఇది చిన్న అవయవమైనను గొప్పపనులు చేయగలదు. పగ తేగలదు. స్నేహమూ తేగలదు.

మా ఇంట్లో పని కుర్రవాడు ఉండేవాడు. వాడు నోరు తెరిస్తే అబద్ధాలు. వాడు పది మాటలు చెప్పితే వాటిలో ఒక్క నిజముంటుంది. ప్రతిరోజూ నేను, "నీ నాలుకమీద చురక పెడతా" నని భయపెట్టేదాన్ని. ఉన్నవి లేనివి కలిపి అటు మాటలు ఇటు, ఇటు మాటలు అటు చెప్పి తగువులు పెట్టేవాడు. అటుఇటు కూడ చెప్పదెబ్బలు చీవాట్లు తిని ఏడుస్తు ఉండేవాడు.

కొందరి నాలుక స్థితి చెప్పనే లేము. ఎప్పుడు చూచినా ఒకరి విషయమే చెప్పతుంది: పైకి చాల స్నేహంగా నమ్మకంగా ఉండి కుటుంబాలలోని రహస్యాలు రాబట్టుకుంటారు. ఈ రకం నాలుక యజమానులు తరువాత ఊరంతా చాటిస్తారు. నోరు తెరిస్తే వారి విషయము డప్పాలు చెప్పకొనుట. ముఖ్యంగా ముగ్గురు నలుగురు ఆడవాళ్ళు చేరితే ఎక్కడెక్కడి విషయాలో ఎవరెవరి విషయాలో చెప్పుకుంటూరు. తీరా ఈ సంగతులు బయటికొస్తే యల్లమ్మ మీద పుల్లమ్మ, పుల్లమ్మమీద యల్లమ్మ చెప్పకుంటారు. ఆఖరికి నలుగురు ఒకరిజుట్టు ఒకరు పట్టుకునే పనవుతుంది.

మరి కొందరి నాలుక రహస్యాలు దాచుకోలేక స్నేహభావంగా ఉండే పొరుగు మనిషితో చెప్పతూ, "దీన్ని రహస్యంగా ఉంచాలి సుమా!" అంటారది. ఆ పొరుగు మనిషి నాలుక ఆ మాటను మరియొక మనిషితో చెప్పతు ఆ మాటను రహస్యంగా ఉంచమంటుంది. ఈ విధముగా దానిలో రహస్యమే ఉండదు.

కొన్ని నాలుకలు, యజమాని కోపంగా ఉన్నప్పుడు నోటికి ఏ మాటవస్తే అదే వాగుతాయి. దానివల్ల తరువాత కలిగే నష్టమేమిటో దానికి తెలీదు.

నాలుకను జాగ్రత్తగా కాపాడుకొను విధమేదనగా కోపమొచ్చినప్పుడు త్వరపడి నోరు జారుట కంటే 1,2,3,4 అని 10వరకు లెక్కబెట్టుకున్నట్లయితే కొంతవరకు కోపము చల్లారును. మనము మాట్లాడునప్పుడు ఎదుటి వారి నాలుక విషయము కూడ గుర్తెరిగి మాట్లాడవలెను. మాట్లాడే ప్రతిమాట కూడ రెండుసార్లు ఆలోచించనిదే, నాలుకకు పని చెప్ప కూడదు.

ఎ. చంద్ర, చిన్నగంజాం.



ఈ డిజైన్ టేబుల్‌క్లాత్ మీాద, దిండు కవర్‌కు, కర్టెన్ మీాదాకూడా వేసుకోవచ్చు. మధ్య పెద్దపువ్వు, ఎరుపులోనూ, పైన పువ్వు ఊదా రంగులోనూ కుట్టాలి. మధ్యపువ్వుకి పై రెండు పువ్వులు గులాబీలోను, క్రింద రెండు పువ్వులూ పసుపులోను కుట్టాలి. తర్వాత ఆకులు, కాడలు ముదరాకు పచ్చలోకుట్టి, మొగ్గ లన్నీ ఎరుపులో గొలుసు కుట్టుతో నింపితే డిజైను కంటికి నదరుగా ఉంటుంది.

## టేబుల్ క్లాత్ మీాదకు డిజైనులు

ఇ. నిర్మల (మద్రాసు).



ఈ డిజైను కూడా టేబుల్ క్లాత్‌కు, కర్టెన్‌కు, దిండుకవర్‌కు, బెడ్‌షీట్‌కు కుట్టవచ్చును. ఒక పువ్వు రెడ్ కలర్; 2 వ పువ్వు రోజ్ కలర్; 3 వ పువ్వు బ్లూకలర్‌లో కుట్టి, చిన్నపువ్వు డార్క్ యెల్లో, మొగ్గలు రెడ్, ఆకులు కాడలు డార్క్ గ్రీన్‌లో వేసుకోవచ్చు.

## మంచి గంధము

మంది ఈ నొప్పులనుండి విముక్తు లయ్యారు. వచ్చినవి చాలా త్వరితంగా పోతవి.

ఇతర వ్యాధుల చికిత్సలో మంచి గంధం వాడే చిటకాలు:

**విసర్పి:**

మంచిగంధం, హారతి కర్పూరం, మాచికాయ కలిపి సర్పి ఉన్నచోట తడి ఆరిపోకుండా పూయాలి. మాడిపోతుంది.

[సర్పి వ్యాధిలో చాలా భయంకర రకాలున్నవి. అందు జంఝుపుసర్పి, అగ్నిసర్పి చాల ప్రమాదకర మైనవి. అటువంటప్పుడు శ్రీగంధము, నీలిమందు, ముద్దహారతి కర్పూరం, కచ్చూరాలు, కొకిదొండాకు పసరతో (మంచినీళ్ళకు బదులుగా పన్నీరు ఉపయోగించుట మంచిది.) గంధం తీసి, మెత్తటి బ్రష్‌లోగాని, కోడి వెంట్రుకతో గాని సర్పి వున్నచోట పల్చగా పూయాలి. (ముద్దగా అంటించరాదు) చేతితో గంధము నెన్నడూ పూయకూడదు.

(42-వ పేజీ చూడండి)

## స్త్రీలు — వ్యాయామం:

# శరీరం కృశించిపోకుండా---

స్త్రీలుగా, మనం సౌందర్యాన్ని చక్కగా పోషించుకొనే ప్రయత్నించడం, అందంగా ఉండాలని ఆపేక్షించడం సహజమైనదే. సౌందర్యానికి, శరీర సోయగం ప్రథమ సోపానం. ఈ సౌందర్యం దేవుడిచ్చిన కండరాల వంపుల మీద ఆధారపడి ఉండడం సత్యదూరం కాదు.! అందుకోసం చొక్కిపోయిన బుగ్గలూ, గుంటలు పడిన కళ్ళు కొంతవరకూ అందానికి అడ్డువచ్చేవే! అలాగే వయస్సు ముదిరేక అది మూడుకాళ్ళ ముసలమ్మ ఆకారం రావడం వయస్సులో ఉన్నవారు తెలుసుకోలేని విషయం. ముఖంలో చర్మం ముడుతలు పడడం, మెడ క్రింద చర్మం కాలీసంచులులాగ వ్రేలాడడం, ముఖ్యంగా ఆహార లోపం వలన చర్మం మృదుత్వం కోల్పోయి ఎండు కర్జూరపు

జి. సావిత్రి, మదరాసు.

ఆకారం రావడం తెలుచుకోడాన్కి కూడా విపరీతంగా ఉంటాయి. ముఖ్యంగా శీతాకాలం చర్మం పగిలి ఇబ్బంది కూడా కలుగజేస్తుంది. అంతేకాకుండా ఓపిక సహనం లేకపోవడం. ఇంకా బలహీనావస్థలో సక్రమంగా యోచించలేకపోవడం. ఏ చిన్నపనికీ తట్టుకోలేకపోవడం, గ్రామంలో కలిగే ప్రతి అనారోగ్యలకీ తనే ముందు బలికావడం అనూహ్యమైన విషయాలు!

### కారణం ఏమిటి?

ఏదో జబ్బు వలన క్షీణించిపోవడం వేరే విషయం. ఏజబ్బూ లేకుండా శరీరం కృశించిపోవడం ప్రారంభిస్తే ఆలోచించదగ్గది. ఇందుకు కూడా గ్రంథులే కారణం, ముఖ్యంగా వారసత్వంగా వచ్చే గ్రంథుల బలహీనత! అయితే ఆందోళన, ఆతురత, నిత్యమూ మనోవ్యాకులత, చింత ఇది మనిషిని కృశింపచేయడమే కాదు. నశింపచేస్తాయి కూడా. ఈ తత్వం గల మనుష్యులకు విశ్రాంతి అవసరం. అయితే మంచం మీద పడుకొని ప్రక్కనే భోజన సదుపాయాలు చేసుకున్నంతమాత్రాన విశ్రాంతి లభించినట్టు లెక్క కాదు. విశ్రాంతి మనస్సుకు కావాలి. మనస్సు అశాంతికీ, ఆందోళనకు దూరం కావాలి. నరాలు స్థిమితపడాలి. మానసికంగానూ శారీరకంగానూ విశ్రాంతి తీసుకోవాలి. అందుకోసం తగిన వైద్యమే సాధనం. అయితే నూటికి తొంభైతొమ్మిది మందికి, మితంగా విశ్రాంతి, సలక్షణమైన వ్యాయామం, తగిన బలకరమైన ఆహారం కండ పట్టింపగలదు.

### కొన్ని కిటుకులు

ప్రప్రథమమైన సూత్రం ఏమిటంటే ఆహారం. ఆహారం ఎంత తిన్నాం అనే కాక ఏమి తిన్నాం అనేది ముఖ్యంగా ఆలోచించాలి. క్రొవ్వునూ, కండనూ అధికం చేసే గుణప్రధానమైన భోజనం చేయాలి. రెండోది: విశ్రాంతి తీసుకోవాలి. మూడు: వ్యాయామం. ఈ విషయం విపులంగా 'స్త్రీలు: వ్యాయామమూ' అనే వ్యాసంలో విపులీకరించాను.

### విశ్రాంతి

విశ్రాంతి గురించి రెండు వాక్యాలు చెప్పదలచాను. తీవ్రమైన ఆలోచనలతోనూ తరగని తలపులతోనూ ముఖ్యంగా చింతాగ్రస్తమైన యోచనలతో ఎంతశక్తి, ఎంత ఆరోగ్యం వృథా అయిపోతోందో చెప్పడానికి వీలులేదు. అనంతమైన ఆలోచనతో రాత్రి సమయంలో నిద్రరాక నిలకడలేని నూతన నవనూతన ధ్యాసలతో శిథిలమై పోతుంది. శరీరమూ, మనస్సూ ఇలాంటి దుస్థితికి బలికాబడ్డ సోదరీమణులు పగలు రెండు గంటలైనా రాత్రి పదిగంటలకు పూర్వమే నిద్రపోవడాన్కి ప్రయత్నిద్దా

(42-వ పేజీ చూడండి)

## ★ మొక్కజొన్నతో మరికొన్ని ★

మొక్కజొన్నలను అనేక రకములుగా ఉపయోగించవచ్చు. పల్లెటూళ్ళలో (ఇవి విరివిగా పండించేచోట) కొన్ని ముదరవీ, లేతవీ అన్నీ కలిసి అమ్మేస్తూంటారు. కొద్దిగా ఉంటే కాల్చుకునే తినేస్తాం. లేత, ముదర రెండురకాలూ ఉన్నప్పుడూ, ఎక్కువగా ఉన్నప్పుడూ ఇలా ఉపయోగించవచ్చు.

ముదరపొత్తుల్ని తీసుకుని, వాటి గింజలన్నీ ఒల్చి పొట్టు లేకుండా చూసుకుని, తగుమాత్రం నీళ్ళుపోసి, జీలకఱ్ఱ, ఇంగువ, ఎండుమిర్చి, ఉప్పూ వేసి, రుబ్బి, కొంచెం దళసరిగాగాని, పల్చగాగాని అట్లు వేసుకుంటే కమ్మగా ఉంటాయి. కరకరలాడుతూ ఉండాలని కోరేవాళ్లు చారెడు వరిపిండి కలుపుకోవాలి.

మరీ లేతపొత్తులైతే (గింజలు ఒలవడానికి రానివి) పొత్తుల్ని చీలికలుగా చేసి కొద్ది ఉప్పువేసిన నీటితో ఉడకనిచ్చి, మెంతి మజ్జిగ పోగిచి దానిలో వీటిని ఊరవేస్తారు. ఇదొక రుచి.

సాధారణంగా ఇది ఎక్కువ మందికి నచ్చదు. కాని అట్లు, వడలు, పోగిచిన గింజలు, పకోడీలు, ఉప్మా చాలా బాగుంటాయి. వడలకి కొంచెం పిండిగట్టిగానూ, (అంటే మరీ పల్చగా కాకుండా) రుబ్బుకుని అల్లం, కరివేపాకు, ఉల్లిపాయ ముక్కలు, పచ్చిమిర్చి, జీలకఱ్ఱ అన్నీ (మసాల వడకు వేసినట్లే) వేసి చేస్తే వడలు చాలా కమ్మగా ఉంటాయి. వీటికి వరిపిండి తప్పకుండా వెయ్యాలి. లేకపోతే వడలు సరిగా లేకపోవడమే కాకుండా కరకరా, కమ్మదనము ఉండవు. ఇక సెనగలను పోగిచినట్లే ముదరగింజల్ని ఒలిచి ఓ గంట సేపు నానబెట్టి మినపప్పు, మిరపకాయ ముక్కలూ, కరివేపాకూ, జిలకఱ్ఱ పోపు వేయించి ఇష్టమైతే నీరుల్లి, వెల్లుల్లి నూరిన ముద్ద వేసి, తగుమాత్రం ఉప్పువేసి, కొద్దిగా నీళ్ళుచల్లి, మూతపెట్టి బాగా మగ్గనిచ్చి దింపితే మద్రాసు బీచ్‌లో అమ్మే (సుండల్) ని గుర్తుకుతెస్తాయి. పులుసు పెట్టిన వంకాయ కూరలోగానీ, కమ్మని కూరలోగానీ తొలిరోజున నానపెట్టిన గింజలను కూరలో వేసి వండితే వంకాయ, సెనగలు కూరలాగ ఉంటుంది. ముదరగింజల్ని పొట్టు లేకుండా చెరిగి, బాగా పదిరోజులు ఎండనిచ్చి, సేరుగింజలకు నాలుగు మిరపకాయలు, చిటికెడు ఉప్పూ వేసి, మరలో పోసి నూకగా విసిరించి ఉప్మా చేసుకోవచ్చు. లేదా పిండిగా పోయిస్తే అప్పటికప్పుడు తడిపిపెట్టి అట్లు వేసుకోవచ్చు.

పైన చెప్పినట్టే రుబ్బి పుణుకులు, పకోడీలు, గారెలూ కూడా చెయ్యొచ్చు. ఇవన్నీ ఆనాటి కానాడే బాగుంటాయి. కాని విసిరించిన పిండి, నూక నిలవ చెయ్యవచ్చు.★

అల్లమరాజు సర్వమంగళ.

# ★ సయాం కవలలకథ ★

కవలపిల్లలు కలిసిపోయి పుట్టారన్న కబురుతో ఊరంతా అట్టుడికినట్టుడికిపోయింది.

"కలికాలం వచ్చిపడిందనుకున్నారు" జనం అంతా సయామీస్ భాషలో.

దేశానికి అరిష్టం అన్నారు పెద్దలు.

అందువల్ల వాళ్ళని వధించడం మంచిదని అభిప్రాయపడ్డాడు రాజు.

శాస్త్రీకంగా శోధించితే, అందువల్ల కవలల జన్మరహస్యం అవగతం చేసుకోవచ్చునని ఆశపడ్డారు వైద్యశాస్త్రజ్ఞులు.

ఆ కవలలను కన్నతల్లిమటుకు అలా అనుకోలేదు. అంతకుముందు ఆమె పదిమంది పిల్లల్ని కన్నది. వీళ్ళతో కలిపి పన్నెండు (లేక పదకొండు) అనుకుని, మామూలుగానే వీళ్ళని సాకసాగింది. డబ్బు కక్కుర్తిపడి అమ్మకోలేదు. అందరిలాగే వాళ్ళకీ ఆటాపాటా నేర్పించింది. వాళ్ళలాగే పెరిగి పెద్దలై, ఇద్దరమ్మాయిల్ని పెళ్ళాడి కాపరం చేసి ఇరవై ఇద్దరు పిల్లల్ని కన్నారు.

## 63 ఏళ్ళ సుఖజీవనం

ప్రపంచ ప్రఖ్యాతి నందుకున్న ఈ సయామీస్ కవలలు 1811 లో పుట్టి 1874 వరకూ దర్జాగా సుఖంగా బతికారు. వీళ్ళ తండ్రి చైనీస్ జాలరి. తల్లి చైనీస్ మహిళే కాని, ఆమె పూర్వీకులు సయాం జాతీయులు.

ప్రపంచం ఆ పిల్లల్ని సయాం కవలలంది. సయాం ప్రజలు వాళ్ళని చైనీస్ కవలలన్నారు. చివరికి "సయాం"లో పుట్టిన ఈ చైనీస్ కవలలు 14 వ ఏట నుండి చనిపోయే నాటివరకూ అమెరికాలోని ఉత్తర కరోలినా రాష్ట్రంలో అమెరికన్ రైతులుగా జీవితం గడిపారు.

ఒకడిపేరు చాంగ్; రెండోవాడిపేరు ఎంగ్.

వాళ్ళిద్దరికీ "అవినాభావ సంబంధం" అనతగ్గది ఎనిమిది అంగుళాల కైవారం ఉన్న చిన్న మాంసఖండం. వాళ్ళిద్దరి రొమ్ముకల దగ్గరా పుట్టి కలసి నిలచిఉండేది. పొట్టిగా ఉన్నా ఒకడు ఎడవేపు మరొకడు కుడివేపు

## సి. వి. విజయలక్ష్మి

పూర్తిగా తిరిగి నిలబడడానికి వీలుగా సాగేది. వాళ్ళు అందరికీ మల్లేనే పరుగెత్తగలిగేవారు, దుమికేవారు. గుర్రపుస్వారీ చేసేవాళ్ళు పిల్లిమొగ్గలు వేసేవాళ్ళు.

## తరహాలు వేరు

ఇలా శరీరాలు కలిసినా, వాళ్ళ తత్వాలు భిన్నంగానే ఉండేవి. వైద్యులు పరీక్షించిన మీదట, తత్వాలు వేరనీ, వాళ్ళని జంటకట్టి పట్టించిన ఆ మాంసఖండం మధ్యనబొడ్డు ఒక్కటే తప్ప, మిగతా భాగాలన్నీ సంపూర్ణంగా ఇద్దరికీ విడిగా ఉన్నాయనీ చెప్పారు. ఆ బొడ్డుఉన్న ప్రాంతం మధ్యన సుండు సూదితో గుచ్చితే ఇద్దరికీ నొప్పిపెట్టేదట. కొంత అటూఇటూగా గుచ్చితే ఎవరో ఒకరికే నొప్పికలిగేదట.

శరీర తత్వాలలాగే మన స్తత్వాలు కూడా దాదాపు వేరువేరుగానే ఉండేవట.

చిన్నతనంలో ఆడుకుంటున్నప్పుడు ఇద్దరూ చిలిపి కజ్జాలు పెట్టుకునేవారు.

## "చాంగ్‌దే పైచెయ్యి"

"ఇంక చాలు ఇంటికెళ్దాం" అనేవాడు ఎంగ్.

"ఛఫ్ - అప్పుడే కాదు" అనేవాడు ఛాంగ్ కొస్త దురుసుగా. సాధారణంగా చాంగ్ మాటే చెల్లేది,

పెద్ద అయినా ఇలాగే ఉండేది వాళ్ళ తరహా.

ఛాంగ్ రాత్రి పది పదకొండుగంటల వరకూ పిల్లలతో ఆడుతూ కూర్చునేవాడు. "నిద్దరొస్తాంది పోయి పడుకుందాం పద" అనేవాడు ఎంగ్.

చాంగ్ ఒకపట్టాన కదిలేవాడు కాడు. అంతవరకు ఎంగ్ ఆవలిస్తూ విసుక్కుంటూ కూచునేవాడు. అంతకన్న ఏంచేస్తాడు, ఎవరో ఒకరు లొంగాలికద!

## బార్నమ్ మ్యూజియంలో

చాంగ్ ఎంగ్‌ల 13వ ఏట రాబర్ట్ హంటర్ అనే బ్రిటిష్‌వర్తకుడు వాళ్ళమ్మకి నచ్చచెప్పి, వాళ్ళిద్దర్నీ వెంటబెట్టుకుని దేశదేశాలు తిప్పి, వాళ్ళనిచూపి డబ్బు చేసుకునేవాడు, ఆ తరవాత వాళ్ళెన్నడూ స్వదేశం వెళ్ళలేదు. అమెరికాలోనే స్థిరపడిపోయారు. అక్కడ కొన్నాళ్ళు పి.టి. బార్నమ్ మ్యూజియంలో నిలబడి కిరాయి గడించుకునేవారు. 21 ఏళ్లు వచ్చాక స్వయంగానే ఆ వ్యాపారం ఆరంభించారు.

"సంయుక్తసయాం సోదరులు వస్తున్నారు. అందరూ తప్పక చూడండి. టిక్కెట్టు, 50 సెంట్‌లుమాత్రమే" అని కరపత్రాలు అచ్చువేయించి పంచి పెట్టించేవారు ఊరూరా.

## నిజానిజాలు

ఇలా డబ్బు గడించి దాంతో మంచి వైద్యుడిచేత ఆపరేషన్ చేయించుకుని విడిపోవాలని వాళ్ళు ఆశపడేవారుగాని పరీక్షించిన ప్రతి వైద్యుడూ ఆపరేషన్‌చేస్తే మరణం ఖరారని చెబుతూ వచ్చాడు. నిజం ఇదైనా, ఆ రోజుల్లో గిట్టని వాళ్ళు చాలమంది, "ఈ సయాం కవలలు నిక్షేపంలా ఆపరేషన్ చెయించుకోవచ్చుగాని, సిగ్గులేకుండా డబ్బుకోసం అని అలా జంటగా ఉంటున్నారని" అభాండాల్లు ప్రచారం చేసేవారట.

పండిత డి. గోపాలాచార్యులవారి
అరుణ
గర్భాశయ రోగనివారిణి
ఆయుర్వేదాశ్రమం,
(ప్రైవేటు) లిమిటెడ్., మద్రాసు-17.

# 29 కానుపులలో 69 మంది పిల్లలు

ఈ నెల 6వ పోర్చుగీసు తూర్పు ఆఫ్రికాలోని ఒక నగరంలో ఒక ఆఫ్రికన్ మహిళ ఒక్కసారి ఐదుగురు పిల్లల్ని కన్నది...(నలుగురు ఆడపిల్లలు.) ఇలా ఈమె ఇంతకు ముందు కానుపులలో ముగ్గురేసి నలుగురేసి పిల్లల చొప్పున 14 గుర్ని కన్నది.

ఈ నెల 8 వ తేదీ ఉదయం సిలియా ఫిలిప్ అనే బ్రిటిష్ యువతి ఒక లండన్ ఆస్పత్రిలో నలుగురు పిల్లల్ని ప్రసవించింది. నలుగురూ ఆడపిల్లలే. ఒక్కొక్కరూ మూడు పౌనుల ఒక ఔన్సు నుండి నాలుగు పౌనుల మూడు ఔన్సుల లోపు బరువు వున్నారు. తల్లీ పిల్లలూ కులాసాగా ఉన్నట్లు ఆస్పత్రి అధికారులు ప్రకటించారు.

ఇలా నలుగురేసి ఐదుగురేసి పిల్లలు పుట్టడం, కవలలకన్న చాల అరుదు. కొన్నాళ్ల క్రితం జరిగిన పరిశోధనల ఫలితంగా నూటికోచోట కవలలు పుడతారనీ, ముగ్గురేసి పుట్టడం పదివేల కానుపులలో ఒక్క సందర్భంలో జరగవచ్చుననీ, అలాగే, కవల కవలలు పుట్టడం మూడు నాలుగు లక్షల కానుపులలో సంభవింపవచ్చుననీ తేలింది. అందుకే నలుగురైదుగురు పుడితే అది పెద్ద విశేషంగా చెప్పుకుంటారు.

గర్భధారణ జరిగాక, పిండం ఎదిగి ఒకే బిడ్డగా రూపొందడం మామూలు. కొన్ని సందర్భాలలో ఏ కారణం వల్లనో ఆపిండం తొలిదశలోనే రెండుగానో మూడుగానో విడిపోయి ఆ వేరైన ఆ ఖండాలే క్రమంగా ఒకొక్క బిడ్డగా రూపొందుతాయి. అందువల్లనే కవలలుగా పుట్టేవాళ్లంతా ఒకే జాతిగా వుంటారు. కొందరు ఆడ, కొందరు మొగ వుండరు. వాళ్ల పోలిక లలాగే తత్వాలూ తరహాలూకూడా ఒకలాగే ఉంటాయనీ, ఒకేరకం జబ్బులు (వస్తే గిస్తే) వాళ్లందరికీ వస్తాయనీ అంటారు. అలా అండం ఖండాలయినపుడు అవి పూర్తిగా విడిపోకపోతే, పిల్లలు ఒకరికొకరు ఏదో ఒక అంగం ద్వారా అంటుకుపోయి జంటగా పుడతారు. (సయాం కవలలవలె)

ఐతే మినహాయింపులు కూడా వున్నాయి. కవల లందరు ఒకే అండం నుండి పుట్టడం అస్తమానం జరగదు. ఒకొక్కసారి రెండేసి పిండాలు, విడివిడిగానే నిలచి, పెరిగి, రూపం ధరిస్తాయి. అపుడు ఒక ఆడపిల్లా ఒక మొగ పిల్లవాడూ కలిసి పుట్టవచ్చు. పోలికలు కూడా మామూలు సహోదరుల పోలికలను మించి వుండకపోవచ్చు.

ఒకసారి కవలల్ని కన్న తల్లులు మళ్లీ కనడం సంభవమా? అని పరిశీలిస్తే, వయసు పెరిగినకొద్దీ కవలలను కనే అవకాశాలు పెరుగుతాయని తేలింది. అంతే కాదు. కానుపుకానుకు కవలల సంఖ్యకూడా పెరగవచ్చునట!

ఎక్కువపిల్లల్నికన్న తల్లులు ప్రపంచం మొత్తంమీద నేటికి అగ్రస్థానం ఒక రష్యన్ మహిళదట. ఆమె మొత్తం 29 కానుపులలో అరవై తొమ్మండుగురు బిడ్డలను కన్నది. (నలుగురేసి చొప్పున నాలుగు కానుపులు, ముగ్గురేసి చొప్పున ఏడు, కవలలు పదహారు!) ఆమె భర్త మరొకామెను వివాహమాడగా, ఆమె రెండుసార్లు ముగ్గురేసి బిడ్డలను, ఆరుసార్లు కవలలను అందిచ్చిందట!

మరొక ఫ్రెంచి వనిత వరుసగా ఏడు కానుపులలో 21 మంది బిడ్డలను కన్నదట. దీనికి కారణం ఎవరితత్వమని ఒక వైద్యుడు ఆచూకీ తీయగా, ఆమె భర్త దరిమిలా మరొక స్త్రీని వివాహం చేసుకొని తొమ్మిది నెలలు తిరిగేసరికి ఆమెకూడా ముగ్గురు పిల్లల్ని ఒక్కసారి కని ఊరుకుందని తేలింది! 

ఇలాటివి పడలేక దారిపోయేవాళ్లంత ఎన్నిరోజులయినా తేరిపారచూడడం మానక పోవడంచేత, చాంగ్ ఎంగ్‌లకు ప్రాణం విసుగెత్తి, ఈ జనానికి దూరంగా పోవాలనుకున్నారు.

## రైతు జీవితం

చివరికి 1839 ప్రాంతాలలో ఉత్తర కరోలినా కొండప్రాంతంలో ఒకమారుమూలపల్లె చూసుకుని అక్కడ వందెకరాల భూమి కొని వ్యవసాయం పెట్టారు. అక్కడి మనుషులు నాగరికత బలిసిన వారుకారు కొబట్టి, ఒకసారి వింతగాచూసినా, తరువాత క్షణం నుండి వాళ్లని మామూలు మనుషులుగా తమవంటివారుగానే చూచి ఆదరించారు.

కొద్దిరోజుల్లోనే చాంగ్ ఎంగ్‌లు ఇద్దరమ్మాయిలను చూచి ముచ్చటపడ్డారు. పడి ఆ సంగతి వాళ్ళకుచెప్పి విడివిడిగానే హృదయాలు అర్పించారు. ఆనక సలక్షణంగా ఒక రోజున రెండు పెళ్లిళ్ళు జరిగాయి. చాంగ్ భార్యపేరు అడెలైడ్ ఏట్స్. ఎంగ్ భార్య శారాఏట్స్. ఆ అమ్మాయిలిద్దరూ అప్పచెల్లెళ్లే. వాళ్ల తలితండ్రుల పూర్వీకులు డచ్ ఐరిష్ జాతీయులు.

## వేరు వేరు కాపరాలు

సరే దంపతులు వేరు వేరు కాపరాలు పెట్టారు. అందుకని రెండు ఇళ్ళు కట్టారు. ఊరికి ఈ చివర ఒకటీ, ఆ చివర ఒకటీను.

చాంగ్‌కోసం అని మూడు రోజులు ఎడలైట్ కాపురం ఉన్న ఇంట్లో ఉంటే, ఆ తరవాతి మూడు రోజులూ ఎంగ్ భార్య శారా ఇంట్లో ఉండేవాళ్లు. ఇలా వంతులు వేసుకుంటూ 25 ఏళ్ళు వాళ్ళు సుఖంగా కాపరాలు చేశారు.

## 22 మంది పిల్లలు

ఎంగ్, శారా దంపతులకు ఏడుగురు కొడుకులూ ఐదుగురు కూతుళ్ళూ పుట్టారు. చాంగ్ ఎడెలైడ్‌లకు ఏడుగురు కొడుకులూ, ముగ్గురు కూతుళ్ళూ పుట్టారు.

పిల్లలికి ఆటా పాటా చదువూ సంధ్యా నేర్పుకుంటూ, పెద్ద పొరపొచ్చాలు లేకుండా ఇలా సుఖంగా పాతికేళ్ళ జీవితం సాగించారు.

డబ్బుకి మరీ కటకట అయినపుడు, ఆపరేషన్ కోసం ఇంకో గొప్ప వైద్యుణ్ణి చూదామనిపించినపుడూ వాళ్ళు యూరప్ దేశాలు పర్యటించి తమను తాము ప్రదర్శించుకునివస్తూ వుండేవాళ్లు.

ఇలాటి ప్రదర్శనలు ఆంధ్రదేశంలో కొందరు చూచి ఉంటారు. మొన్నటి పుష్కరాలకొక, ఆక్రితంసారి గోదావరి పుష్కరాలకీ, దరిమిలా విడిగా రెండు మూడుసార్లూ — వీళ్లలాగే అంటుకుపోయిన కవలలు (ఇద్దరు ఆడవాళ్లు) ప్రదర్శనలు ఇస్తూ ఉండడం జ్ఞాపకం ఉండిఉంటుంది.

## చాంగ్ మద్యపానం

సరే ఇలా, ఒకసారి ఈ సయాంజంట యూరప్ వెళ్ళివచ్చాక, 1872 లో ఒకరోజు చాంగ్‌కు పక్షవాతం వచ్చింది. కొంచెం చెముడుకూడా వచ్చింది. దాంతో అతడు దిగులుపడి, అవిచారంతో మద్యపానం బాగా అలవాటు చేసుకున్నాడు. అయినా ఎంగ్ మట్టుకు ఎన్నడూ ఒక చుక్కకూడా తాగలేదట. సోదరుడు తాగినా, దానివల్ల

# ★ సయాం కవలల కథ ★

మత్తెక్కడం వంటి లక్షణాలు ఇతనిలో కనబడేవి కాదట!

ఈ తాగుడు విషయంలో ఇద్దరికి తగవులు వచ్చాయి. కొన్నాళ్లు మాట్లాడుకోవడం మానేశారట...అయినా వంతుల ప్రకారం మూడేసి రోజులకు బసమార్చడం మటుకు విధిగా పాటించేవారు. తమ చిరాకులూ పరాకులవల్ల పెళ్లాంబిడ్డల్ని నొప్పించడం ఇష్టంలేక.

1874 జనవరి నెలలో చాంగ్-ఎంగ్‌లు చాంగ్ భార్య యింట్లోఉండగా చాంగ్‌కు గుండెనొప్పి వచ్చింది.

ఆ రోజు వారి లెక్క ప్రకారం శారా ఇంటికి మారాలి. "వద్దులే" అన్నాడు ఎంగ్ సోదరుడి అస్వస్థత చూచి.

ఫరవాలేదు పద అన్నాడు చాంగ్.

## మృతి

మర్నాడురాత్రి ఎంగ్‌కు హఠాత్తుగా మెలకువ వచ్చింది—సోదరుడికి వంట్లో బాగుండలేదన్న ఆందోళనవల్ల ప్రమాదం ఉన్నదన్న అనిర్వచనీయ సందేహం వల్ల లేచి పిల్లల్ని పిలిచాడు, ఒకకొడుకు చాంగ్ వాడిచూచి "బాబాయి పోయాడునాన్నా" అన్నాడు.

"అయితే నేను పోతున్నాను" అన్నాడు ఎంగ్.

పిల్లలు డాక్టర్ను పిలుచుకొచ్చే సరికి ఎంగ్ కళ్లుమూశాడు.

అనంతరం శవపరీక్ష జరిగింది. "ఆపరేషన్ జరిగి ఉంటే, వీళ్లు ఇన్నాళ్లు బ్రతికి ఉండరు" అని తేలింది.

బ్రతికినవారు సుఖంగా, దర్జాగా వుండగలగడానికి కారణం వాళ్లను కన్నతల్లి శక్తియుక్తులన్న సంగతిని మటుకు ఎన్నడూ మరువరాదు.

చిన్నతనంలో, ప్రతివాళ్ళు వాళ్ళను విచిత్రజీవులుగా చూచి హేళన చేసిన వేళ ఆ పిల్లల మనసులు గాయపడి, వాళ్ళు ఆత్మవిశ్వాసం కోల్పోకుండా కాపాడినది ఆవిడే.

"మీరు అందరిలాంటివారే" అని వాళ్ళకి నూరిపోసి, అందరిమల్లెనే ఆటలూ పాటలూ నేర్పి కులాసాగా ఉంచుతూ పెంచిన ఆమె సంకల్ప బలం, సాధనా కలసి వాళ్లకి ఆత్మవిశ్వాసాన్ని ధైర్యాన్ని కలిగించాయి. వాళ్ల పురోభివృద్ధికి తల్లే కారణమైంది.

చాంగ్ ఎంగ్‌ల సంతానం, మొన్నటివరకూ బ్రతికి ఉన్నారు. ఆపిల్లల పిల్లలూ, వారి కొడుకులూ, మనుమలూ, మునిమనుమలూ నేటికీ చాలామంది ఉన్నారు అమెరికాలో. వారంతా కర్షకులే. ఇప్పుడు ఆ వంశీయుల ఇంటిపేరు బంకర్. ★

(పైవారం కవలల కథ.)

## స్త్రీలు : వ్యాయామం

(39-వ పేజీ తరువాయి)

మని తీవ్ర ప్రతిజ్ఞ తీసుకోవాలి. ఈ విశ్రాంతికి తోడు పరిశుభ్రమైనగాలీ, పగలు పరిశుభ్రమైన వెల్తురూ వచ్చేచోట గడపాలి. తన మనస్సులో ఆందోళన కల్గించే భయానక సమస్యను ఉచిత రీతిలో పరిష్కరించుకొని తీవ్ర ఆందోళనా, అలసట, ఆయాసాన్ని తగించుకోకపోయినట్టయితే గుండె అమితంగా కొట్టుకొని, శరీరాన్ని అడకత్తెరవలె నలిపి నరికివేస్తోందని మరచిపోరాదు.

ఆహారం అధికంగా భుజించాలి. ఆహారం అధికం చెయ్యడం జాగ్రత్తగా క్రమపద్ధతిలో జరగాలి. జీర్ణకోశంలోని అవయవాలకు క్రమేపీ అధిక ఆహారాన్ని చేయాలి.

అంతకంటె ముఖ్యమయింది ఆహారం యొక్క గుణం. పాలు పరమప్రసాదంగా స్వీకరించాలి. పాలు సంపూర్ణ ఆహారం అని చెప్పాలి. కండను పెంచడంలో పాలు ప్రధానాహారం! ముఖ్యంగా శరీరపోషక పదార్థాలు అన్నీ ఉండి అజీర్ణాన్ని కల్గించని అమృతమే పాలు! అంటే పాలలో కొద్దిగా నీళ్ళు కలపడం మరిచిపోవద్దు. (కొనుబడి పాలైతే అమ్మేవాడే కలుపుతాడనుకోండి!!) వెన్న ఎన్ని రూపాలలో ఎంత ఎక్కువ ఎన్నిసార్లు తినగలిగితే అంత మంచిది! పంచదార టీలోనూ కాఫీలోనూ, పాలల్లోనూ, వెన్నలోనూ ధారాళంగా కలుపవచ్చు. మీగడ తినగలిగితే మంచిదే. జీడి, పిస్తా, బాదం మొదలైన పప్పులు ముఖ్యమైనవి. ★

## మంచి గంధము

(38-వ పేజీ తరువాయి)

అంటువ్యాధులు చాలా ప్రమాదకరమయినవి. యేమాత్రం అశ్రద్ధ చేసినా అపాయం కల్గును.]

సెగగడ్డలకు :

దుష్టరక్తం వలన సెగగడ్డలు ఏర్పడతాయి. యీ మంచిగంధము పన్నీరులో తీసింది పైన పూస్తే బాధ తగ్గిపోతుంది.

తలపోట్లకు :

వేడివలన జనించే తలపోట్లకు కచ్చూరాలు, మంచిగంధం కలిపి పట్టువేస్తే యీ బాధ పోటు తగ్గిపోతుంది.

మొటిమలు :

చందన అత్తరు నుపయోగిస్తే మొటిమలు రావు.

తామర, గజ్జి, చిడుము, దురదలకు కూడా చందన అత్తరునే ఉపయోగించుట మంచిది.

కండ్ల మంటలు:

మంచి గంధము మాడున పెట్టుకొనినచో కండ్ల మంటలు తగ్గును.

ప్రదరములు:

మంచి గంధము, వేప చెక్కల యొక్క కషాయం సేవిస్తే దుర్వాసనతో నున్న ప్రదరములు (ఋతువ్యాధులు) తగ్గుతాయి.

వాంతులు:

కరివేపాకుయొక్క నేట కషాయం లేదా దానిమ్మను చెక్క కషాయంలో వేసి ఎత్తు మంచి గంధపు చూర్ణం కలిపియిస్తే వాంతులు కట్టును.

లేదా ఉసిరికాయ రసంలో గంధపు పొట్టు కలిపి యిచ్చినా వాంతులు తగ్గును.

దీనిని యెక్కువగా లోపలికి సేవిస్తే పురుషులకు తీరని నష్టం కల్గించును.

## రక్తచందనం

దీనిలో రక్త చందన మని మరియొకటి గలదు. ఇది యెర్రగా ఉంటుంది సువాసన, పరిమళం ఉండవు. దీనితో తయారు కాబడ్డ బొమ్మలు ప్రసిద్ధ క్షేత్రాల్లో అమ్ముతారు.

యీ రక్త చందనం కూడ మంచి చలువ చేస్తుంది. ముఖ్యంగా చర్మాన్ని శుభ్రపరస్తుంది. కుష్ఠువ్యాధిలో చాలమేలు చేయును కాలిన పుండ్లమీద దీని గంధం, నీలి మందు కలిపి పూస్తే త్వరితంగా గుణమిస్తుంది. రక్త చందనము, దుష్పి కొమ్ము అరగదీసి పట్టు వేసినచో మేహ వాత నొప్పులు నిమ్మళించును. వేడి ఆవుపాలల్లో దీని గంధమును (½ తులం) ఒక చెంచా తేనె కలిసియిస్తే అతిశీఘ్రకాలంలో గుండెనొప్పి శమించును. రక్తచందనపు గంధంలో నీలిమందు కలిపి నాభిదగ్గర (బొడ్డుచుట్టూ) పట్టువేస్తే మూత్రమును విప్పును.

శ్వేతచందనం, రక్తచందనం అనేక ఆయుర్వేద మందుల్లో వాడతారు. ఆరోగ్యమే మహాభాగ్యం, ఆ మహాభాగ్యాన్ని గంధమును విరివిగా ఉపయోగించి పొందండి. ★

ఉత్తరాలు:

# అపోహాలకు తావులేకుండా ఉంటే...

పవని నిర్మల ప్రభావతిగారు వ్రాసిన వ్యాసాన్ని చదివేను. పెళ్ళిగాకుండా ఇంట్లో వుండే ఆడబిడ్డ అధికారము చలాయిస్తారనే మాట వాస్తవము. దానివల్ల కోడళ్ల అభిమానము దెబ్బతినుట సత్యము. అలాంటి పరిస్థితులు కలగకుండా సంసారములోని శాంతి మాయం కాకుండా చూచుకొనే బాధ్యత కుటుంబంలో అందరి మీద ఆధారపడి యుంటుంది. కోడలు ఎంతమంచిదైన ఒక్కొక్కప్పుడు అత్తమామలు అధికార దుర్వినియోగము, ఆడబిడ్డల అనవసర ప్రసంగాలు చిరాకు కలిగించడం సహజము. కాని కొందరు కోడళ్లు తమ వివాహామునకు పూర్వమే అత్తగారిల్లంటే ఒక పాతాళ గృహామని దాన్లో వుండే వారంత రక్కసులనే అభిప్రాయాన్ని ఏర్పరచుకుంటారు. తమ తమ బంధువుల, స్నేహితురాళ్ల అనుభవాలవల్ల ఏర్పడ్డదే ఐనా, అలాంటి వాటిని అందరికీ పట్టించి, అందరూ అంతే అనుకోడం శోచనీయము. అత్తమామలు, ఆడబిడ్డలందరు తమలాంటి వారేనని మఱచి, వారు కేవలము రాక్షసాకృతులు గలవారని అనుకోడము వెర్రితనము.

"మంచి-చెడు" అనేవి ఒక్క అత్తమామలోగాని, కోడళ్ళలోగాని మూర్తీభవించిన విశేషణాలుగావు. అది మానవకోటికి సంబంధించినవి మాత్రమే. కాబట్టి అది ఏ వ్యక్తిలో ఐనా ఏరూపాన్నైనా కనుపించడం మనం నిత్యజీవితాల్లో చూస్తున్న విషయము. ముఖ్యంగా మనం ఆశించేది ఈ ఒడిదుడుకులు మనస్పర్థలు లేకుండా మన జీవితాల్ని సంతోషవంతము చేసుకోడము. ప్రతి స్త్రీ జీవితంలో ఆడబిడ్డగా మొదలెట్టి ఒదిన, కోడలు, అత్త జీవితాలను చవిచూస్తుంది. ఆడబిడ్డగా నున్నపుడు తన రాబోయ్యే "వదిన" జీవితాన్ని గూర్చి వాపోదు. తానొక అత్తగారైనపుడు తను కోడలుగా గడిపిన జీవితాన్ని జ్ఞాపకముంచుకుంటే ఆవిడ తప్పకుండా పూజ్యురాలవుతుంది. "అత్త"ల జీవితాలు గడుపుచున్న వారికి తాము కోడలుగా గడిపిన జీవితాన్ని జ్ఞాపకముంచుకొని మెలగమని నా మనవి. ఆడబిడ్డలు (ముఖ్యంగా పెళ్ళికానివారు) తమ భవిష్యజ్జీవితాన్ని దృష్టిలో నుంచుకోమని నా విన్నపము. కోడలు (ముఖ్యంగా క్రొత్తగా విద్యార్థినీ జీవితాలను విరమించిన వాళ్లు) అత్తవారింట్లో అందరు ఆప్తులని, వాళ్లలో ఏదైన తప్పంటే వీలైనంతవరకు కొన్నాళ్ళవరకు కొంత బాధపడ్డా ఆ తప్పులను లెక్కచేయకుండా సంసారంలో సామరస్యము కుదిరేట్టు చేసే బాధ్యత తనమీద వుందని గ్రహించాలని మా ప్రార్థన.

రాయసం నిర్మల వెంకటమీనాక్షీ దేవి

* * *

## ఈ కోడళ్లు

"ఆడబిడ్డలు" అనే వ్యాసంలోని విషయాలన్నీ యథార్థమే, కాని కోడళ్ల గురించి కూడా కొస్త ఆలోచించడం మంచిది. కోడళ్లు మాత్రం ఏమైనా తక్కువవారా? తాము అత్తవారింటికి వచ్చినప్పటినించీ, తామే ఆ యింటికి పెద్దలమన్నట్లు, అధికారమంతా తమ చేతుల్లోనే ఉన్నట్లు ప్రవర్తిస్తారు. నిన్నగాక మొన్న ఆ యింటిలో అడుగుపెట్టి పెద్దగా అధికారం చెలాయిస్తూ ఉంటే, అన్నేళ్లనించీ ఆ యింట్లో ఉంటూ ఒక్కసారిగా అధికారమంతా కోడళ్ల చేతుల్లోకి రావడం కొందరు ఆడపడుచులు సహించలేరు. అందుకే చీటికీ, మాటికీ కుటుంబంలో కలతలు ప్రారంభమాతూంటాయి.

నే చెప్పేదేమిటంటే లోకంలో గయ్యాళి ఆడపడుచులూ ఉన్నారు, గయ్యాలి కోడళ్లూ ఉన్నారు. అతి నమ్రతతో నడచుకుంటూ అందరిచేత 'ఎంత మంచిది' అనిపించుకున్న వాళ్లూ ఉన్నారు. మొత్తానికి వారూ, వీరూ అంటే కోడళ్ళూ, ఆడపడుచులూ సర్దుకుపోతే ఏ గొడవా ఉండదు.

టి. బృందావనం, (ఇంజరం)

* * *

## నూటికి నూరు పాళ్లు

29-5-57 ఆంధ్రపత్రిక సచిత్ర వార పత్రికలో శ్రీమతి పవని నిర్మల ప్రభావతిగారు వ్రాసిన విషయం నూటికి నూరు పాళ్లు నిజం.

ఎం. రాధాశ్రీధర్, సూర్యాపేట.

## అభివందనములు

ఆడబిడ్డల వ్యాసము రాసిన రచయిత్రికి నా కృతజ్ఞతాభివందనములు. ఆవిడ రాసింది చదువుతుంటే అక్షరాలా నిజమనిపించింది. అది చదువుతుంటే నాకు తెలిసిన సంఘటన నాకు జ్ఞాపకము వచ్చింది. ఈ రోజుల్లో అత్తగారి సాధింపులు లేకపోయినా ఆడబిడ్డల సాధింపు ఎక్కువగా ఉంది. వాళ్లకి వదినగారిని, మరదల్ని ఎంతసాధిస్తే అంత ఆనందంగా ఉంటుంది. వాళ్లరోజుల్లో వాళ్లు ఆడబిడ్డలవల్ల పడ్డ బాధలు గుర్తించుకొనక తను పడ్డాను గాబట్టి వీళ్లను సాధిద్దామన్న మనస్తత్వం తప్ప వేరేమి బుర్ర పు ఎక్కదు.

కె. జయలక్ష్మి (దొడ్డిపట్ల)

* * *

## ఇటు నిషేధం; అటు అమ్మకం!

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం సినిమాహాల్లో పొగ్రతాగడం నిషేధించడం లేక మానడం అన్న విషయంపై, తుదినిర్ణయం చేయడం గురించి ఆలోచిస్తూన్నట్లు పత్రికా ముఖాన తెలియుచున్నది. ప్రస్తుతం మేటనీ షోలకు మాత్రం పొగ్రతాగడం పై నిషేధం కలదు. యితర ప్రదర్శనాలకు ప్రభుత్వ ఆర్డర్ మాత్రం ప్రదర్శనశాలాధికారులు స్లయిడు రూపంలో ప్రదర్శించుతూ యుంటారు. అదే సమయములో 'చుట్ట, బీడీ, సిగరెట్టు' అనే కేకలు మాత్రం చెవులు గింగురుమంటూ యుంటాయి.

ఎం. కమల [సాలూరు]

* * *

## సూక్ష్మంలో మోక్షం

ఈ వారం పత్రికలో స్థూలత్వం తగ్గడానికి కొన్ని సూచనలను సావిత్రిగారు వ్రాశారు. కాని అంత శ్రమ పడలేనివారు, గోధుమలు పెసలు సమపాళ్లలో కలిపి ఒక రోజంతా నానబెట్టి శుభ్రంగా కడిగి ఉదయం, రాత్రి తినవలెను. మధ్యాహ్నం గోధుమ అన్నము తినవలెను. యిట్లు తిన్నట్లయిన తప్పక శరీరం తగ్గిపోతుంది. ఏ మీ జబ్బు చెయ్యదు. తేలికలో శరీరం తగ్గుతుంది.

కె. లక్ష్మీరాజ్యం చిన్నగంజాం

* * *




అనగనగ నొక్కచోట
అన్నదమ్ము లిద్దరు
ఒకరిమేలు నొకరుజూచి
ఓర్వలేరు ఇరువురు.

ఒకరికన్న పైచేయి మ
రొకరొకరు తలచిరి
రాగల యోచనలన్నిటి
ప్రోగుజేసి చూచిరి.

తదుపరి అన్నయ్య ఎడద
తట్టె నొక్కపాయము
నిలువక ఆచోటనుండి
నడచెను వేవేగము.

శివునిగూర్చి తపముజేసి
సిరుల బడయ గోరెను
కానకు తావచ్చి యొక్క
కోన గూరుచుండెను.

అన్న తపము జేయనెంచి
అడవికేగె నంచు దెలిసి
కొన్న తమ్ముడతి వేగమె
అన్న చెంత కేగిచూచె.

తానొక వైపున గూర్చొని
తపముచేసె శివునిగూర్చి
దండిగ అన్నయ్యకన్న
మెండు సిరులు బడయనెంచె.

ఘోరమైన తపసుజూచి
గగనంబు నుండి శివుడు
వీరికి ప్రత్యక్షంబై
వరములడుగుమని అనియెను.

తమ్ముడడుగు సిరులకన్న
దండిగ తాగోరనెంచి
ముందుగ తమ్ముని నడుగగ
ముక్కంటిని గోరెనన్న.

న్యాయమిద్దిగాదు స్వామి!
నాయన్నే వచ్చెముందు
అతని నడుగుడంచు 'తమ్మ'
డర్థించెను శివుని ముందు.

అలాగే యనుచు "అన్న"
అడిగెనిట్లు శంభుని—
తమ్ముడడుగు వరముకన్న
తనకు రెండు రెట్లవి.

అన్న యొక్క దురుద్దేశ్య
మరసి తమ్ముడంతలోన
ఒక్క కన్ను లొట్టబోవ
వరమిమ్మని కోరెను.

"అగుగాక"ని యనుచు శివుడు
అదృశ్యమై పోయెను!
అన్న కోరినట్లతనికి
ఉన్న కళ్లు పోయెను!

# గెలుపెవరిది?

**చల్లా లక్ష్మి**

నువ్వులవారి పాలెంలో అదృష్టరావు అనే ఆసామీ వుండేవాడు. వయస్సు ముప్ఫయి సంవత్సరాలు. ఆ అదృష్టరావనే పేరు ఎలా పెట్టేరో కాని, ఎక్కడా అదృష్టం అనేది ఏకోశానా కనుపించలేదు. పుట్టకుండానే పోయేడు తండ్రి. పుట్టిన పది నిమిషాలకు రప్పీమని ఎగిరిపోయింది తల్లి. వాళ్ళో వేవున్న మేనమామ యింటికి తీసుకుపోయి పెంచాడు. అదేం ఖర్మమో కాని 3 సంవత్సరాలు నిండక పూర్వమే గోదావరి వరదల్లో ఇంటిల్లిపాదీ కొట్టుకుపోయారు. మరి యీ కుర్రవాని ప్రాణాలు ఎంతగట్టివో కాని, కొట్టుకుపోతూ కొట్టుకుపోతూ దగ్గరలో వున్న పడవవాళ్లు చూడ్డం వడ్డుకు తియ్యడం జరిగింది. అక్కడే సత్రంలో అప్పచెప్పారు. నాటి నుంచి ఇంతవరకూ ఆ సత్రంలోనే ఇంత తిండి తింటూ కాలక్షేపం చేస్తూవచ్చాడు.

ఇంక పిత్రార్జితం ఒక్కపాత్ర, పాడుపడిన కొంప, తలుపులు వగైరాలు లేవు. తలుపుకు బదులు ఒక్క బల్ల అడ్డుపెట్టి ఒకరాయి చేర్చేవాడు. ఇంట్లో సంసారం ఏమిటంటే రెండున్నరకోళ్లుగల నులకమంచం. ఒక పాత చీపురుకట్ట. ఇదీ మన అదృష్టరావు పిత్రార్జితం. అలాగే పాపం తినీ, తినక ఆ పిత్రార్జితమైన కొంపలో కాలక్షేపం చేస్తూ వచ్చాడు. ఇలా వుండగా పెద్దమ్మ చిన్నమ్మ ఆకాశమార్గాన్నపోతూ యీ చిన్నవానిని చూశారు. అంత ఇతడిసంగతికనిపెట్టి చిన్నమ్మ- అంటే లక్ష్మీదేవి జాలిపడి, అక్కా పాపం యీ కుర్రవాడు పుట్టుకనుంచీ గర్భదరిద్రంతోనే వున్నాడు. నేనుపోయి యింత భాగ్యం ఇస్తానని బయలుదేరింది. దరిద్రదేవత ఎంతచెప్పినా వినక బయలుదేరింది. తిన్నగా యింటిముందు నిలిచి గుమ్మానికి అడ్డుపెట్టిన తలుపుమీద దబదబా కొట్టింది. అంత అదృష్టరావు త్రుళ్లిపడి, ఇదేమిరా! ఇంత కాలం నుంచి నన్ను పిలచినవాళ్లు లేరని, ఎవరువారని అడిగేడు. నేనే, నాయనా! లక్ష్మీదేవిని రా! తలుపు తియ్యి' అనిపలికింది. అంత అదృష్టరావు లేచి అడ్డుగా పెట్టినరాయి తొలిగించి బల్లలాగేసరికి లక్ష్మీదేవి ప్రత్యక్షమైంది. తక్షణం అదృష్టరావుకు పట్టరానికోపంవచ్చి మూలనున్న పాతచీపురుకట్టతీసి వీపుమీద అదే బాదడం మొదలెట్టాడు. లక్ష్మీదేవి అయ్యో! నన్నుకొడతావేమిరా అబ్బాయీ, నీకు ఇంత భాగ్యం ఇవ్వడానికి వచ్చానంది. వినలేదు అదృష్టరావు! పెంటముండా ఎందుకు వచ్చావు నాయింటికి ఇంతవరకూ కనుపించనిది యీవేళ కనుపించేనా పోసి నావద్దవుంటావా! అంటే వుండవు చపలచిత్తవు అని చీపురుతో దభాదభా కొట్టేసరికి లక్ష్మీదేవి వీపు చిట్లిపోయి ఏడుస్తూ పోతూవుంటే అక్కయ్య దరిద్రదేవతవచ్చి ఇదేమే చెల్లీ! అలా ఏడుస్తున్నావు! వీపు ఇలా కందిపోయిందేమి అని అడుగగా జరిగిన సంగతి చెప్పింది లక్ష్మీదేవి. సరేలే నే వెళ్లిచూస్తాను. నేను వెళ్లవద్దని ఎంత చెప్పినా విన్నావు కాదని పెద్దమ్మ బయలుదేరివచ్చి తలుపు తట్టింది. ఈసారి మళ్లీ లక్ష్మీదేవి వచ్చిందేమో అని గభీమనిలేచి ఎవరది అని ప్రశ్నించాడు. అంత నేనేరా నాయనా పెద్దమ్మ అంది. అదృష్టరావు తలుపుతీసి లోనికి ఆహ్వానించి "ఆ కొక్కి మంచం చూపించి కూచో అమ్మా! బాగున్నావా" అని అడిగింది. "నీదయవల్ల బాగానే వున్నాను తల్లీ" అని జవాబు చెప్పేసరికి పెద్దమ్మ మురిసిపోయి, "నీకేమి వరము కావాలో కోరుకో నాయనా!" అంది. అంత అదృష్టరావు పెద్దమ్మకు సాష్టాంగ నమస్కారంచేస్తూ "తల్లీ, పుట్టిన నాటినుంచి నన్ను కనిపెట్టుకుని ఒక్క విధంగా ప్రేమతో చూచావు. తల్లి లేనిలోటు తీర్చావు! కాని ఇంక యిటుపైని నన్ను వదలిపెట్టు ఇదే నాకోరిక!" అనగానే వెర్రిమొహం

# సహనం

నారదుడు మహాయోగి. పరమ భక్తాగ్రేసరుడు. హరిధ్యాన తత్పరుడు. మహాజ్ఞాని. తత్వవేత్త. అతనికి ఒకచోట కాలు నిలువదు. ఎల్లప్పుడూ ముల్లోకములు సంచారము చేస్తూంటాడు. వింతలూ, విశేషాలు చూస్తుంటాడు. ఆయనకు ముల్లోకములలో తెలియని వింతలూ, విశేషాలు లేవు.

ఆయన లోకసంచారము చేస్తుండగా ఒకనాడు ఒక అడవిగుండా వెళ్ళడం తటస్థించింది. ఆ అడవిలో ఒక మునిని చూశాడు. ఆయన చుట్టూ పెద్ద చీమలపుట్ట నిలువెత్తున పెరిగివుంది. ఆయన ధ్యాననిష్ఠలో వున్నాడు. నారదుడు ఆ మునిని చూస్తూ నిల్చున్నాడు. ఆ ముని కనులు విప్పిచూశాడు. ఎదురుగా త్రిలోక సంచారి, పరమ భక్తాగ్రేసరుడయిన నారదమహాముని కనిపించాడు. సంతోష సంభ్రమములుముప్పిరిగొనగాతనుకూర్చున్న స్థలమునుండి దిగ్గున లేచి చిరునవ్వుతో నారదుని వద్దకుపోయి చేతులు జోడించి అతనికి ప్రణమిల్లాడు. నారదుడు ఆశీర్వదించాడు.

'మహానుభావా! ఎంతదూరం మీ ప్రయాణము?' అడిగాడు ముని.

'స్వర్గానికి' చిరునవ్వుతో సమాధాన మిచ్చాడు నారదుడు.

'సవ్యశ్రీ'

జవాబు వినగానే రెట్టించిన సంతోషంతో 'మహాత్మా, నాకొక్కసాయం చేయాలి' అన్నాడు.

'ఓ, తప్పకుండా. ఏమిటా సహాయం?'

'స్వర్గానికి వెళ్తున్నారు కాబట్టి ఎట్లాగూ భగవంతుని దర్శిస్తారు. అప్పుడు తమరు దయయుంచి ఈ దీనుడింకా ఎన్నాళ్లిట్లా పడి యుండాలి? ఎప్పటికీ దీనుడికి ముక్తి లభిస్తుంది? అన్న ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకొని మళ్ళీ తిరుగు ప్రయాణంలో నాకు చెప్పండి బాబ్బాబూ' అన్నాడు దీనంగా బతిమాలికున్నట్లు. నారదుడు అంగీకరించి ఆచోటు విడిచి పోయాడు.

నారదుడట్లా పోతుండగా మరియొకచోట మరొక మునిని చూశాడు. ఆముని నృత్యంచేస్తూ, పాటలు పాడుతూ, గెంతుతూ ఉల్లాసంతో నానా హంగామా చేస్తున్నాడు. అతను నారదుని చూడగానే సంభ్రమముతో ఎదురేగి చేతులు జోడించి ప్రణమిల్లాడు. నారదుడు అతనిని కూడా ఆశీర్వదించాడు. 'మహాత్మా, ఎంతదూరం తమ ప్రయాణం?'- అడిగాడు ముని నారదుని.

'స్వర్గానికి'— క్లుప్తంగా జవాబిచ్చాడు నారదుడు.

ఈ మునివర్యుని ముఖంలోకూడ సంతోషం వెల్లివిరిసింది.

'బాబ్బాబూ, నీకు పుణ్యముంటుంది. చిన్నసాయం చేసిపెడ్తావా?' అడిగాడు బతిమాలుతున్న ధోరణిలో.

'ఓ, తప్పకుండా. ఏమిటాపని?'- నారదుడు.

'భగవంతుని కలుసుకున్నప్పుడు నాకు ఇంకా ఎంత కాలానికి ముక్తి లభిస్తుందో కనుక్కుంటారూ?' అన్నాడు మునివర్యుడు.

'ఓస్ ఇంతేనా!' అంటూ నారదుడు ఆచోటు విడిచి పోయాడు.

* * *

కొన్ని దినములు గతించాక ఒకనాడు మళ్ళీ నారదుడు ఆదారివెంట వచ్చాడు. వస్తూనే మొదటి ముని దగ్గరకు వచ్చాడు. నారదుని చూడగానే సంభ్రమముతో ఎదురేగి నారదునికి నమస్కరించాడు. నారదుడు చిరునవ్వు నవ్వుతూ ఆశీర్వదించాడు.

'స్వామీ, నామాటేం చేశారు?' అడిగాడు ముని.

## గెలుపెవరిది?

వేసివెళ్లిపోయింది పెద్దమ్మ. కలకల్లాడుతూ ప్రవేశించింది లక్ష్మీదేవి - అంతటినుంచి అదృష్టరావు పేరు సార్థకమైంది. మహాభాగ్యంతో తులతూగుతున్నాడు.

ఇంతకూ చీపురు దెబ్బలుతిన్న లక్ష్మీదేవిది గెలుపా! లేక మర్యాదగా పంపించిన పెద్దమ్మది గెలుపా! చెప్పండి!

‘ఓ, అడిగాను’—నారదుడు.

‘భగవంతుడు, సర్వాంతర్యామి ఏమి సెలవిచ్చారు?’

‘ఇంకా నాల్గు జన్మలెత్తి చనిపోయేవరకూ నీకు ముక్తిలంభించదు అని భగవంతుడు చెప్పాడు’—అన్నాడు నారదుడు నవ్వుతూ.

ఆమాటలు వినడం తడవు కుప్పలా కూలిపోయాడు ముని. ‘నాలుగు జన్మలే?! ఇంత చీమల పుట్ట పెరిగేదాకా ఏకాగ్రతతో ధ్యానించినా ఇంకా నాలుగు జన్మలెత్తాలా భగవాన్!’ అంటూ గుండె బాదుకుంటూ ఏడ్చాడు.

నారదుడు అతనిని ఓదార్చి రెండవ మునివద్దకు వెళ్లాడు. అతను గూడా నారదుని చూడగానే ఎదురేగి చేతులు జోడించి ఆయన ముందు మోకరిల్లాడు. నారదుడు ఆశీర్వదించి అతనిని లేవనెత్తాడు.

‘నా ప్రశ్నకు జవాబు కనుక్కున్నారా స్వామీ?’ అడిగాడు ముని. దానికి నారదుడు చిరునవ్వునవ్వాడు. కొద్దిగా గొంతు సవరించుకుని ఉపక్రమించాడు. ‘చూశావా ఆ చింత చెట్టు. దానికి ఎన్ని ఆకులున్నాయో అన్ని జన్మలెత్తి చనిపోయిన తరుగాని నీకు ముక్తిరాదని భగవంతుడు చెప్పాడు.’

ఆమాటవినగానే ఆముని సంతోషంతో నారదుని వీపుమీద ఒక్క చరుపు చరిచాడు. ‘భేష్ నారదా! చాలా శుభవార్త! బలేమంచివార్త! అంత వేగంగా భగవంతుడు నాకు ముక్తి ప్రసాదిస్తానంటే అంతకన్న కావలవలసిన దేమిటి?’ అంటూ నాట్యంచేయ ప్రారంభించాడుముని. ఇంతలోకేలఅశరీరవాణి ఇట్లాగన్నది: “ఓ మహాముని, ఈ క్షణమే నీవీపాప బంధాలనుండి విడివడ్డావు. నీ సహానము మెచ్చుకోదగ్గది. క్షమ కవచమని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. నీ సహానమే నీకు విజయాన్నిచ్చింది. ఈతక్షణమే నీకు ముక్తి లభిస్తుంది”.

ఆ మహామునిలోనుండి ఒక దివ్య తేజస్సు అంతరిక్షంలోకి ఎగసి భగవంతునిలో ఐక్యమైపోయింది. నారదుడు భగవధ్యానముచేస్తూ మరొకచోటికి కదిలిపోయాడు. ★


మెరయుచు పొంగే
ఈనో
కడుపులోని
అస్వస్థతలను
ఎనిమిది
సెకెండ్లలో
పోగొట్టును!



అజీర్ణము, గుండెమంట లేక కడుపు ఉబ్బరం, ఏదయినా దీనితో ఉపశమనము కలుగును!

ఒక గ్లాసెడు మెరయుచు పొంగే ఈనో ఫ్రూట్ సాల్ట్ మీరు పుచ్చుకుంటే ఎనిమిది సెకెండ్లలో మీ కడుపులోని అస్వస్థత నయమగును. మీరు పరకడుపున కొంచెము ఎక్కువ మోతాదు త్రాగుతే, ఈనో సౌమ్యముగ, నిశ్చయమైన గుణము కలిగించే విరేచనముల మందుగా పనిచేయును. ఎల్లప్పుడూ ఈనో ఒక సీసా మీ యింట్లో ఉంచుకోండి.

ఈనో ‘ఫ్రూట్ సాల్ట్’

ఆమ్ల నిరోధకమైన మెరయుచు పొంగే పానీయము

‘ఈనో’ మరియు ‘ఫ్రూట్ సాల్ట్’ అను మాటలు రిజిస్టరు చేయబడిన ట్రేడు మార్కులు

ఈనో ఈ శీతోష్ణస్థితికి నిజంగా దివ్యమైనది




(2 సైజుల సీసాలలో అమ్మబడుచున్నది)

గ్రూప్ లాబొరేటరీస్ (ఇండియా) ప్రైవేటు లిమిటెడ్.

# ఆరోగ్యవంతులైన పిల్లలు ప్రతిరోజూ లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానము చేయుదురు

## –అది ప్రతిదిన*మలినములోని క్రిములను కడిగివేయును!

* మనకు ప్రతిదినం తార్మపడే మామూలు మురికిలో క్రిములున్నాయి. మనలో ప్రతివారికీ యీ క్రిములవల్ల రోగాల ప్రమాదం వుంది. అందుచేతనే చాలామంది ఆరోగ్యవంతులగు జనులు లైఫ్‌బాయ్ సబ్బుతో మురికిని మరియు క్రిములను రోజూ కడిగివేసుకొనుట వల్లి తమ ఆరోగ్యమును కాపాడుకొనుచున్నారు — అది ఆరోగ్యవంతమైన హాయిని గలిగించును.




L. 257-X52 TL.

భారతదేశంలో తయారు చేయబడినది

# సినిమా

## ★ పురిలేని దారాలు ★

ఒకానొక రకం హాలీవుడ్ దుష్ట సింహుడు ఒక అబలను బలాత్కరించే ఘట్టాన్ని షూట్ చెయ్యడానికి సన్నాహాలు పూర్తి అయ్యాయి.

ఆ చిత్రం నిర్మాత హడావుడిగా ఎటో పోతూ సెట్ మీదకు తొంగి చూచి దర్శకుడిని పలకరించి, ఏమిటి కథ అన్నాడు.

దర్శకుడు చెప్పాడు ఘలానాఘట్టం అని.

అర్ధ పావునిముషంలో సాధ్యపడేటంత తాపీగా నిర్మాత ఆలోచించి వేశాడు కథ గురించి.

బలాత్కరిస్తే ఆ పిల్ల ఏంచేస్తుంది? అన్నాడు.

"ఏముంది ఎగురు తిరిగి పోట్లాడుతుంది. అప్పుడు హీరో వచ్చి—"

"సర్లెండి పోట్లాడినట్టు ఒక రీలూ తీసేశాక, ఆమె వాడికి లొంగిపోయినట్టు కూడా ఓరీలు షూట్ చేసి అట్టే పెట్టండి. "ఎలా కావలిస్తే ఆలా కథనడుపుకోవచ్చు అవక" అని వెళ్ళిపోయినాడు నిర్మాత.

మన ఫిలిం నిర్మాతలు ఇలాటి చిత్రాన్ని కనక చూస్తే, రెండో పద్ధతి రీలు వాడుకుని, అక్కడ విలన్ హీరోయిన్లచేత ఒక ఢ్యూయెట్ పాడించేసి తద్వారా ఇంకో రీలు తగిలించి ఊరుకుంటారనిపిస్తుంది (కొత్తదనము) నేటి స్థితీ గతీ పరిశీలిస్తే.

మన చిత్రాలలో మనది కాని సంగీతం వినబడడానికి ప్రధాన కారణాలలో ఈ కథా చౌర్యం—లేక పరిభాష ప్రకారం అనుకరణ, ఒకటి అనుకోనక తప్పదు. మనదికాని సన్నివేశాలకు మన చిత్రాలలో చోటున్నప్పుడే మరొక దేశపు సంగీతంకూడా చోటు చూసుకోడానికి వసతి కలుగుతుంది.

కొత్త హాలీవుడ్ చిత్రం రావటం భయం. అందులో కత్తియుద్ధాలో, కర్రయుద్ధాలో, బాగున్నాయని పిస్తాయి.

నాలుగు నెలలు తిరిగేసరికి ఒకానొక-కొండొకచో రెండేసి భారతీయ చిత్రాలలో ఆ సన్నివేశాలు, వాటి సంగీతం సహా చోటు సంపాదిస్తాయి. మనది విశాల దృష్టి; విశాల హృదయం.

చివరకు మిగిలేది కల్తీలేని కృత్రిమత్వం. ఫలితం: ప్రపంచ ప్రఖ్యాతినందిన కథ, పెద్ద స్టార్ వ్యాల్యూగల నటులూ, బ్రహ్మాండమైన సెట్టింగులూ, ఫుష్కలంగా డాన్సులూ దేశ దేశాల సంగీతం "మిశాయించి తయారించిన" పంచభక్ష్య పరమాన్నాలూ ప్రేక్షకులకు చేదౌతున్నాయి. "వినిమం గారంటీ" సూత్రాలు, పురిలేని సూత్రప్రాయాలవుతున్నాయి.

పురి ఎందుకు ఉండటం లేదు?

మనమీద, మన తెలివితేటలుమీద, మన పద్ధతులమీద, మన ప్రేక్షకులకు అభిరుచుల మీద గురిలేక. ★



చందమామా ఫిలింస్‌వారి "దొంగల్లో దొర" చిత్రంలో బొంబాయి నర్తకి హెలెన్.

# బొంబాయి సినిమా లేఖ

"మధుమతి" చిత్రనిర్మాణంలో ఔట్‌డోర్ దృశ్యాల చిత్రణకై హిమాలయ పర్వతప్రాంతాలకు వెళ్ళిన బిమల్‌రాయ్ ప్రొడక్షన్స్ బృందం మొన్న తిరిగివచ్చారు. ఈ యాత్ర పేరుచెప్పి, వీరు 40 వేల అడుగుల ఫిలిం షూట్ చేశారు.

వెళ్ళినబృందంలో దర్శకుడు బిమల్ రాయ్ ఛాయాగ్రాహకుడు దిలీప్‌గుప్త, నటీనటులు వైజయంతిమాల, దిలీప్‌కుమార్, జానీవాకర్, ప్రాణ్ ప్రభృతులు ఉన్నారు. వైజయంతి మాలవెంట ఆమెబలగంఆరుగురుమాత్రం "అతిథులు"గా వెళ్ళారు. పెద్దతారలు చాలమందికి మల్లేనే ఈమెకూ ఇలా ప్రతిచోటకూ కొంతబలగం వెంట వెళ్తుంది. వారందరి భోజన ఫలహారాలకూ, (చాలమందికి పాలు చాలా ఇష్టం), పెట్రోలుకూ (షికారు కూడా వారికి చాలా ఇష్టం) ఇతర చిల్లర మల్లర ఖర్చులకూ నిర్మాత రోజుకు ముప్ఫై వలఫై రూపాయలు ఖర్చు పెట్టవలసి ఉంటుంది. మామూలుగా తారలకు చెల్లించే వేల రూపాయల బ్లాక్‌మనీ కాక.

ఇలాటి ముచ్చట్లు ఎపుడేనా అయితే అదో సరదా, మర్యాద అనుకోవచ్చుగాని నిత్యం తథ్యం అయితే నిర్మాతల మనసులు అమందానంద భరితాలు అయిపోవు. ఇంతకీ ఈ మర్యాదలన్నీ అరవై డబ్భై వేలు పుచ్చుకునే తారల బంధుకోటికే. తక్కువ డబ్బుకి పనిచేసే చిన్న నటులకు—బంధుకోటి ఎలాగా రాదు — వ్యక్తిగతంగా జరగవలసిన కనీస సదుపాయాలు కూడా సక్రమంగా సకాలంలో జరగవు.

## షికారుచేసిన పుకారు

దేవానంద్ ఇటీవల ఒక ప్రమాదానికి గురి అయ్యాడనే పుకారొకటి హఠాత్తుగా బయలుదేరి 24 గంటలసేపు బొంబాయిలో షికారు చెలాయించి చాలమందిని కంగారు పెట్టింది. తరవాత అది పచ్చిఅబద్ధము, లేక, వఠి పుకారు అని ఖరారుగా బుజువైంది. అపుడందరికీ మనసు స్థిమిత పడింది.

తన సోదరుడు విజయ్ ఆనంద్, దర్శకత్వాన దేవానంద్ నిర్మిస్తున్న చిత్రం "నౌ దో గ్యారా"లో కొన్ని ఔట్‌డోర్ దృశ్యాల చిత్రణకై ఆ బృందం మొన్న ఖండాలా వెళ్లడం విదితమే.

అక్కడ దేవానంద్ ఒక ప్రమాదానికి గురి అయ్యాడనీ, పరిస్థితి ప్రమాదకరంగా ఉన్నదనీ, ఎవరో మోతీలాల్‌కు టెలిఫోన్‌లో చెప్పారు. వెంటనే, అతడు, మిత్రులు ఆ విషయమై వాకబు చేయడం జరిగింది. చివరకి, సందేహిస్తూ, దేవ్ భార్య కల్పనా ఆనంద్‌ను వారు కనుక్కోబోయే సరికి ఆ వార్త కల్తీలేని కల్పన అని కల్పనా ఆనంద్ చెప్పింది. ఆమె రోజూ ట్రంక్ ఫోన్ ద్వారా భర్తతో మాట్లాడి మంచి చెడ్డలు తెలుసుకుంటూ ఉంటుంది. ఖండాలాకే కాదు. అతడు ఏ ఊరు వెళ్ళినా అంతే.

## చిలుక అలిగిన కారణం

'చిలుకా గోరింకా' అని అభిమానులు పిలుచుకుంటూ వచ్చిన జంట నర్గీస్, రాజ్‌కపూర్‌ల మధ్య అలుకలువచ్చి, ఆపైన కలతలు ఏర్పడడానికి కారణం ఇటీవల తెలియవచ్చింది.

మెహబూబ్ వర్ణచిత్రం "మదర్ ఇండియా" ఔట్‌డోర్ షూటింగ్‌కని నర్గీస్ బొంబాయికి 70 మైళ్ళ దూరాన ఉన్న 'బల్సర్' గ్రామానికి వెళ్ళడం, అక్కడ అగ్నిప్రమాదంలో ఆమె గాయపడడం పాఠకులకు విదితమే.

తత్ఫలితంగా 15 రోజులపాటు ఆమె చికిత్సతో అవస్థ పడడం జరిగింది.

సరే ఆ తరవాత కోలుకుని, షూటింగ్ కొనసాగించి, ఆపైన బొంబాయికి తిరిగి వచ్చింది.

"ఇంత గొడవజరిగి, ఇన్నాళ్లు తిరిగినా ఇంతవరకూ నేనేమయ్యానో ఎలాఉన్నానో కనుక్కుందామని అతనికి తోచలేదు." అంటోంది నర్గీస్ ఇపుడు.

అంగువల్ల, ఆమెకు కోపంవచ్చింది. తన మంచి చెడ్డలగురించి పట్టించుకోని మనిషి గురించి తనూ ఆలోచించడం అనవసరమని నిశ్చయించుకుంది.

## మాస్కోలో పుట్టినరోజు

అనంతరం ఆమె, నయా సన్సార్ ఇంటర్నేషనల్ వారి "పరదేశి" (రష్యా భారత దేశాల సంయుక్తనిర్మాణం") షూటింగ్‌లో పాల్గొనడానికి మాస్కో వెళ్లింది.

జూన్ 1వ తేదీన, అక్కడే ఆమె పుట్టిన రోజు పండుగ జరుపుకుంది. మాస్కోలోని "ప్రాగ్ హోటల్"లో నయా సన్సార్ బృందం ఆమె గౌరవార్థం విందుచేసింది. భారత రాయబారి కె. పి. ఎస్. మీనన్, ప్రముఖ రష్యన్ నటీనటులూ విందుకువచ్చి నర్గీస్‌కు శుభాకాంక్షలు తెలిపారు.

"పరదేశి" చిత్రంలో నర్గీస్, పద్మిని ప్రభృతులంతా పాల్గొంటున్నారు. పోవి



మువీస్టార్సు పేరిట హిందీనటుడు శేఖర్ నిర్మించిన 'చోటీబాబు' చిత్రంలో భార్యాభర్తలుగా సంధ్య (నిమ్మి) శంకర్ అభిభట్టాచార్యా.



భరణీవారి "వరుడుకావలెను" చిత్రంలో అల్లురామలింగయ్య, డా॥ శివరామకృష్ణయ్య, రమణారెడ్డి, రామన్నపంతులు.

యట్ నటుడు స్ట్రిజనోవ్ ముఖ్య భూమిక ధరిస్తున్నాడు. 15 వ శతాబ్దంలో మన దేశం వచ్చిన రష్యన్ యాత్రికుడు అఫనాసీనికితిన్ కథ దానికి ఆధారం అన్న విషయం విదితమే. కె. ఎ అబ్బాస్, వి. ఎం. ప్రానిన్ దీనికి సంయుక్త దర్శకులు.

జులై పూర్వార్థంలో నిర్మాణం పూర్తి కావచ్చుననుకుంటున్నారు. దీన్ని ఆగస్టు 15 న విడుదల చేస్తారు. (దక్షిణ భారతంలో జైలక్ష్మి పిక్చర్స్ అనేసంస్థ దీన్ని తమిళం లోకి డబ్ చేయబోతున్నారు. తెలుగుదేశంలో హిందీప్రతిని విడుదల చేస్తారు.)

* * *

జూన్ 4 న నూతన్ సమర్థ్ పుట్టినరోజు పండుగ జరుపుకుంది. శ్రీ కాంత్ స్టుడియో (చెంబూర్-బొంబాయి) లోని ఒక సెట్ మీద షూటింగ్‌లో పాల్గొంటూ ఆమె మిత్రులకు విందుచేసి, అభినందనలందుకుంది.

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)





దీప్ అండ్ ప్రదీప్‌వారి హిందీచిత్రం "పోలీస్" లో ప్రదీప్‌కుమార్, మధుబాల.

## చిత్రసమీక్ష:

# "మిస్ ఇండియా"

రౌవల్ ఫిలింస్‌వారి "మిస్ ఇండియా" అఖండంగా ఉందనిపించుకుంది. నర్గీస్ ప్రధాన భూమిక నిర్వహించిన ఈ చిత్రానికి దర్శకుడు ఐ. ఎస్. జోహార్. రచయిత కూడా అతడే. వీటితోపాటు చిత్రంలో ఒక ప్రముఖ పాత్రనుకూడా ధరించాడు.

పతియే దైవమని నమ్మి, చెడుదారిన పడిన భర్తని సన్మార్గానికి తీసుకువచ్చిన విద్యావతి అయిన సతికథ. ఆ అమ్మాయి పేరు రమ. చాలా తెలివైనపిల్ల. బాగా చదువుకుని డిగ్రీ పుచ్చుకుంది. అయితే, ఆమెనువరించి వివాహమాడినవాడు హరిశ్చంద్రుడు కాడు. దుర్బుద్ధివల్ల, దుర్బుద్ధుల బోధవల్ల చెడుమార్గాలలో పడి, ఆమెకు టోకరాయిచ్చి పారిపోతాడు. రమ, తన పతికోసం దేశమంతా అన్వేషిస్తుంది.

అకస్మాత్తుగా ఒకనాడు అతడు దొరుకుతాడు కాని ఆమెను గుర్తుపట్టలేడు. రమ అతనికి ఆశ్రయంఇచ్చి ఆదరిస్తుంది తానెవరో చెప్పకుండా.

చివరికి అతగాడి మిత్రులు ఒక హత్యానేరాన్ని అతడి నెత్తినవేస్తారు. రమ అప్పుడు న్యాయవాదిగాకోర్టుకుహాజరై వాదించి, భర్త నిర్దోషి అని ఋజువు చేస్తుంది.

ఆ తరవాత అతగాడు తేలిగ్గా చెంపలేసుకుని మంచి దారిన పడి ముందుకు నడుస్తాడు.

ఈ కథలో, మొదటి నుండి చివరవరకు నవ్వించే సన్నివేశాలు పుష్కలంగా ఉన్నాయి. నవ్వించని ఘట్టాలలో సంభాషణలు పదునుగా, చైతన్యవంతంగా ఉన్నాయి నేరాలూ ఘోరాలూ చిత్రించిన ఘట్టాలలో ఉత్కంఠను చక్కగా పోషించారు. కాగా చిత్రం పొడుగునా మంచి సంగీతం వినిపిస్తుంది.

నర్గీస్ ఈ చిత్రంలో ఉత్తమస్థాయి నటన ప్రదర్శించి, వర్తమాన చలనచిత్ర నటీమణులలో అగ్రస్థానం తనదని మరోకసారి నిరూపించింది.

ఆమె తరవాత చెప్పుకోతగ్గ నటన ప్రదర్శించినవాడు ఐ. ఎస్. జోహార్.

ఆమె భర్తగా ప్రదీప్‌కుమార్, అతగాడి జతగాళ్లుగా ప్రాణ్, నిషీల నటన ఏమంత అఖండంగా లేదు.

సంగీత దర్శకుడు శచిన్ దేవ్ బర్మన్ కట్టిన పాటలలో మూడు నాలుగు ఇదివరకే బహుళ ప్రజాదరణపొంది 'హిట్స్' అనిపించుకోవడం విదితమే.

## "నాగ్ పద్మిని"

గతవారం విడుదలఅయిన మరో చిత్రం "నాగ్ పద్మిని" కమ్మటి కట్టుకథా కాదు, పౌరాణికం కాదు, ఇంకేమీ కాదు. ఇందులో గట్టిగా చెప్పుకోతగ్గ విషయం ఏమీ కనబడదు.

నాయకీ నాయకులు షకీలా, మహీపాల్ మటుకు బాగా నటించారు.

స్క్రీన్‌ప్లే, దర్శకత్వం నేలబారుగా ఉన్నాయి. జీవం అన్నది ఏకోశానా కనబడదు. సంగీతం కూడా అదే స్థాయిలో ఉంది. ఏ ఒక పాటా హిట్ అయే ప్రమాదం లేదు.

(ఆంధ్రవారపత్రిక బొంబాయి విలేఖరి) ★



మూవీస్టార్స్‌వారి "ఛోటీబాబు" చిత్రంలో ప్రేమికులుగా సంధ్య (నిమ్మి) ఛోటీబాబు (శేఖర్)



"వరుడుకావాలి" చిత్రంలో ప్రమీల, భానుమతి.

తున్నాడనీ పెద్దాయనికి తెలుసు. లాలా గురించిన ఈ ప్రేమగోల తనకు లీలగా తెలుసున్న వైనం కుమారుడికి తెలియచేసి ఆనందింప దలచాడాయన. అందుకని చేతిలో భాగవతాన్ని తెరిచి కుమారుడి మనోవ్యథను చక్కగా నప్పే "ఘను డా భూసురు డేగెనో—" అన్న పద్యాన్ని ఘంటసాల కంఠంతో శ్రావ్యంగా చదివాడాయన.

ఆ పద్యం వినడానికి చాల హాయిగా ఉంది. ఆయనకీ అలాగే అనిపించింది. ఆ సంగతి నే కుమారుడికికూడా వినిపించేలా ఓ మారు గట్టిగాఅనుకుని మళ్లా పుంజుకున్నాడు. ఆలాపనకి అభినయం జోడించి...

దర్శకుడు కమలాకర కామేశ్వరరావు ఇలాటి చక్కని సన్నివేశాలున్న హుషారైన "ప్రేమాయణం" లో కొంత "రామాయణ" అంశాలుకూడా మేళవించి, పొన్నలూరివారి రెండవచిత్రం "శోభ"ను తీర్చిదిద్దుతున్నారు — దీనికి డి. వి. నరసరాజు సంభాషణలు వ్రాశారు.

మొన్న చిత్రించిన ఘట్టంలో తండ్రిగా రేలంగి నటించాడు. ఆ రోజున చిత్రించిన రెండు పద్యాలనూ 'టేక్' ఏ ఒకటీ వృథాకాకుండా, పూర్తిచేశారు.

ఈ చిత్రంలో అంజలి, రామారావు, రాజసులోచన, ముక్కామల ప్రభృతులు నటిస్తున్నారు.

సంగీత దర్శకుడు ఏ. ఎం. రాజా,

నిర్మాణం వాహినిలో సాగుతోంది. నిర్మాత వసంతకుమార రెడ్డి.

# సినిమా వార్తలు

రోమియో రామారావు, తన ప్రేయసిని ఫలానా చోటుకు రావలసిందని కోరుతూ ఇంటి నౌకరు ద్వారా కబురంపి, తను షోగ్గా ముస్తాబై బయల్దేరాడు. మేడ మెట్లు దిగే సరికి, సావడిలో తండ్రి కనబడ్డాడు. ఆయనకి కుమారుడు కనబడ్డాడు గాని, అలా తను కనబడ్డ వైనం, ఆయన ధోరణిలో కుమారుడికి కనబడలేదు. అందుకని ఎలా బయటికి చెక్కెయ్యాలీ అని ఆలోచిస్తూ మెట్లమీద నిలబడ్డాడు.

తన కన్న తండ్రి వేటకి బయలు దేరాడనీ, నౌకరు ద్వారా ఎవరికో కబురంపాడనీ, "ఆకబురందునో అందదో—తను వలచిన వనిత 'లాలా' సంకేతస్థలానికి ఏతెంచునో తెంచదో" అని సుపుత్రుడు మథన పడు



ప్రతిభావారి "దొంగలున్నారు జాగ్రత్త"లో నర్తకి లలితారావు, బృందం

# సినిమా వార్తలు



"పాండురంగ మాహాత్మ్యం"లో అమ్మాజీ, శివరావు

## "హెలెన్ వలెన్"

హుషారైన నృత్యాలకు హెలెన్‌ను పిలువ వలెన్...అన్నది ఒక కొత్త వరవడిగా నిలబడేలా ఉంది. హెలెన్ బొంబాయి నర్తకి. కొంతకాలం క్రితం జూపిటర్ వారి చిత్రం "నయీ ఆద్మీ" లో ఈమె నృత్యాలు చేసింది. ఇప్పుడామె కొన్ని బొంబాయి చిత్రాలలో పాల్గొంటోంది. ఇటీవల రెండు మద్రాసు చిత్రాలలో బుక్ అయింది.

చందమామ ఫిలింస్ వారి "దొంగల్లో దొర" చిత్రంలో ఈమె నృత్యాలు రెండింటిని మొన్న చిత్రించారు.

వాహినీలో శర్వాణి పిక్చర్స్‌వారు తమ "అక్కాచెల్లెళ్ళు" చిత్రంలో కూడా ఒక నృత్యాన్ని ప్రవేశపెట్టారు. నృత్యదర్శకుడు వేణుగోపాల్. ఇందులో కృష్ణకుమారి, శ్రీరంజని, లక్ష్మీకాంత, అమర్‌నాథ్, సి. ఎస్. ఆర్., రాజనాల, రమణారెడ్డి నటీనటులు. దర్శకులు అమానుల్లా, సార్వభౌమ. రచన శ్రీశ్రీ, ఆరుద్ర.

## "దొంగల్లో దొర"

"దొంగల్లో దొర", నాగేశ్వరరావు పాల్గొంటున్న 60 వ చిత్రం. ఇది ఈ నెలాఖరున విడుదలకావచ్చు ననుకొంటున్నారు. ఈ సందర్భంలోనే నాగేశ్వరరావు షష్టి చిత్ర సంపూర్తి పేరిట భారీ ఎత్తున వజ్రోత్సవాలు జరుపబోతూఉండడం విదితమే.

పి. చంగయ్య దర్శకత్వాన తయారవుతున్న ఈ చిత్రంలో నాగేశ్వరరావు, జమున, జి. వరలక్ష్మి, సూర్యకాంతం, ఆర్. నాగేశ్వరరావు, రేలంగి, గుమ్మడి ప్రభృతి అగ్రశ్రేణి నటవర్గం పాల్గొంటున్నది.

ఇదికాక దక్షిణభారత నర్తకి ఇ. వి. సరోజ, బొంబాయి నర్తకి హెలెన్ ఉన్నారు.

వెనకటికి గ్రీసు రాణి హెలెన్ సౌందర్యాన్ని వర్ణిస్తూ, ఆమె సుందర వదనారవిందం వెయ్యి ఓడలమీద వేలాది సైనికుల్ని యుద్ధోన్ముఖుల్ని చేసిందన్నాడు ఒక కవి.

ఆ హెలెన్‌వలెనే ఈ హెలెన్ కూడా, ఓడల్ని బయల్దేర తియ్యక్కర్లేదుగాని, ఎన్ని వేలమంది ప్రేక్షకులను చలనచిత్ర సందర్శనాభిముఖుల్ని చేస్తుందో చూడవలసి ఉంది.



నందీ ప్రొడక్షన్స్‌వారి "శ్రీ కృష్ణగారడి"లో నటి రేవతి.

## "జయభేరి"

శారదా ఫిలింస్ వారి "జయభేరి" పి. పుల్లయ్య దర్శకత్వాన రేవతీ స్టుడియోలో తయారవుతోంది. నాగేశ్వరరావు, అంజలి, రేలంగి, నాగయ్య, గుమ్మడి, రమణారెడ్డి, చదలవాడ మొదలగువారు పాల్గొంటునారు. ఈ చిత్రానికి మాటలు ఆత్రేయ, పాటలు మల్లాది రామకృష్ణశాస్త్రి వ్రాశారు. సంగీత దర్శకుడు పెండ్యాల.

## "వరుడు కావాలి"

భరణీవారి హాస్యరస ప్రధాన చిత్రం "వరుడు కావాలి" జూన్ 7 న విడుదల అయింది. భానుమతి, ప్రమీల, రాగిణి, జగ్గయ్య, అమర్‌నాథ్, రమణారెడ్డి నటించారు. రచన రావూరి సత్యనారాయణ సంగీతం జి. రామనాథన్ ఛాయాగ్రహణం వెంకట్. దర్శకుడు పి. రామకృష్ణ. ★

అదీ ఇదీ:

# ముడిఫిలిం కోటా

ముడిఫిలిం దిగుమతులలో కోటాపద్ధతి ప్రవేశపెట్టినట్లు కేంద్రప్రభుత్వ వాణిజ్య పరిశ్రమల శాఖ జూన్ 7న ఒక ప్రకటన చేసింది. ఈ కోటాల ప్రకారం దిగుమతికి అనుమతులు జారీచేసే పద్ధతులూ వాటికి సంబంధించిన నియమ నిబంధనలూ త్వరలోనే వివరంగా ప్రకటిస్తారట.

మనదేశంచేసే ఎగుమతి వ్యాపారం కన్న దిగుమతుల పరిమాణం ఎక్కువైనందువల్ల విదేశీ ద్రవ్యం నిల్వలు అక్రమంగా హరించిపోతున్నాయి. అందుకని సాధ్యమైనంతవరకు ఆ డబ్బు పొదుపుచెసుకోవాలి. అందుకని దిగుమతులు తగ్గించాలి.

మనదేశం సాలుకు రెండువందల పాతికలక్షలరూపాయల ఫిలిం దిగుమతి చేస్తున్నట్లు అంచనాలు. పెరుగుతూ ఉన్న పరిశ్రమకు కావలసినంత ఫిలిం తెప్పించుకోవలసిందే కాని, ఎంత కావాలి అన్న ప్రశ్నకు జవాబు ఆలోచించుకుంటే, ఇంత అక్కరలేదూ అని, దీన్ని గురించి తెలియని వారు కూడా ధైర్యంగా చెప్పగలరు.

ఎందుకంటే మన చిత్రాలు ఏవీ 16, 17 వేలఅడుగుల తక్కువలేవు. (హిందీవిమాత్రం 14, 15 వేలకు మించవు)

ఇవి పన్నెండు పదమూడు వేలకు మించకుండా ఉంటే బాగుంటుందని చాలమందికి అనిపించింది. అందుకనే ఆమధ్య బొంబాయి థియేటర్ యజమానులే అటువంటి తీర్మానం చేశారు.

ఇపుడు ఎవరికి వచ్చినా మానినా కోటా పద్ధతి వల్ల పరిస్థితి కొంత మెరుగవుతుందని ఆశించవచ్చు. దీనికితోడు కొద్దికాలంలోనే ముడి ఫిలింమీద అడుగుకు అరపైసా (పాతనాణాల జాతి) ఎక్సైజు అదనంగా వేయబోతున్నారు. నిడివి కొస్త తగ్గించండని ఆ పన్నుకూడా నిర్మాతలను విడిగా 'ప్రార్థించ'గలదు.

మొత్తంమీద కొల్లేటి చాంతాడు చిత్ర నిర్మాణ విధానానికి "టాటా" చెప్పడానికి ఈ కోటా పద్ధతి చాలా దోహదం చేయవచ్చు. అందుకని ఇప్పటినించీ 'టాటా' చెప్పే పద్ధతికి రిహార్సలు ఆరంభించవచ్చు.

## 'భాగ్యరేఖ'

పొన్నలూరివారి "భాగ్యరేఖ" చిత్రం ఈనెల తొలివారంలో విజయవాడ విజయా టాకీస్‌లో శత దినోత్సవాలు జరుపుకుంది. బి. ఎన్. రెడ్డి దర్శకత్వాన తయారైన ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, జమున, నటించారు. మాటలు పద్మరాజు, పాటలు కృష్ణశాస్త్రి వ్రాశారు. సంగీత దర్శకుడు పెండ్యాల.

రెడ్డిగారి చిత్రాలలో కొన్ని కొన్ని భాగాలను వీరి ఉత్సవం రోజున ప్రదర్శించారు.

అనంతరం, బీదలకు అన్నదానం, వస్త్రదానం జరిగింది. ★


భారత ప్రభుత్వంచే 'రాష్ట్రపతి యోగ్యతాపత్రము' (Certificate of Merit)
పొందిన ఈ చిత్రం నిర్మాతలకు, నటీనటులకు, సాంకేతిక నిపుణులకు

మా హృదయపూర్వకాభివందనములు

అఖిలభారతచలనచిత్రగౌరవ
యోగ్యతాప్రమాణపత్రం
చిత్రంపేరు: తెనాలిరామకృష్ణ
నిర్మాతలు: విక్రమ్‌ప్రొడక్షన్స్
1956

విక్రమ్ ప్రొడక్షన్స్
తెనాలి రామకృష్ణ
డైరెక్షన్ · B.S. రంగా

నవయుగ ఫిలింస్ విజయవాడ, గుంతకల్లు, సికింద్రాబాదు, మద్రాసు.

# ★ జనాభాసమస్యా పరిష్కారం ★

(4-వ పేజీ తరువాయి)

పరిశ్రమలు స్థాపించుకుని యంత్రాలూ ప్రాజెక్టులూ నిర్మించుకుని భారీవ్యవసాయం సాగించడమే.

కనుక భారతదేశంలాంటి అధిక జనాభా దేశాలకు ముక్తి పారిశ్రామికంగానూ, వ్యావసాయికంగానూ అభివృద్ధి కావడంలోనే ఉంది. ఎందుకంటే, ఇన్ని కోట్ల జనం ఉంటే ఎక్కువ జనాభా అనీ, ఇన్నికోట్ల జనం ఉంటే తక్కువ జనాభా అనీ సర్వకాలాలకూ నిర్ణయించి చెప్పలేము. దేశాభివృద్ధి పరిస్థితినిబట్టి జనాభా ఎక్కువ తక్కువలు నిర్ణయమవుతాయి. భారతదేశపు ప్రస్తుత ఆర్థికస్థితినిబట్టి చూస్తే భారత జనాభా ఎక్కువే. కాని ఆర్థికస్థితి ఇప్పటికంటె కొన్ని రెట్లు అభివృద్ధి అయితే ఈ జనాభా ఎక్కువేమీ కాదు. పైగా తక్కువ కూడా కావచ్చు.

## సార్థకాభివృద్ధి

వివిధ దేశాల ఆర్థికాభివృద్ధిని సాధించడానికి అనువైన పరిస్థితులిప్పు డేర్పడ్డాయి. అణుశక్తితో సాధించలేని విజయాలు లేవని శాస్త్రజ్ఞులు కనుక్కున్నారు. నూటయాభై ఏళ్ళ క్రితం ఆర్థికవేత్తలు ఇంత వేగంగా ఆర్థికాభివృద్ధి సాధ్యమవుతుందని ఊహించలేకపోయారు. కాని పారిశ్రామిక విప్లవంవల్ల అటువంటి అభివృద్ధి సాధ్యమైంది. అలాగే ఇప్పుడు అణుశక్తిద్వారా మరొక గొప్ప పారిశ్రామిక విప్లవం సాధ్యం కావచ్చును.

అందుచేత ఆర్థికాభివృద్ధి ప్రయత్నాలు ఫలించడానికి ఒకవంక కృషి చేస్తూనే, ఆ కృషి సార్థకమయ్యేందుకు జనాభాను అదుపుచేసే ప్రయత్నాలు కూడా సాగిస్తూ ఉండడమే మన కర్తవ్యం. ★


మీ అందమైన చేతి
మణికట్టుకు సరిపోయే ఒక
ట్యూడర్
వాచీ






ట్యూడర్
రోలెక్సు వారిచే
తయారుచేయబడినది







ఎంతో నాణ్యమైన వాచీలు-కాని ధర తక్కువ. స్టీల్ బేక్‌గల బంగారు ప్లేటు చేయబడిన కేసులలో దొరకుతున్నాయి. ధర ఒక్కొంటికి రు. 210/- (అమ్మకపు పన్ను అదనము)




రోలెక్సువారి ట్యూడర్ వాచీలు, సొగసుగా కనపడతాయి మరియు ఎంతో కచ్చితమైన టైమును చూపుతాయి. వీనికి 17 జ్యూయలులతో అంటిమేగ్నెటిక్ మరియు దిట్టమైన యంత్రములు కలవు. కచ్చితమునకు పేరుపొందిన యీ రోలెక్సు యంత్రములు ఉండుటచే యీ వాచీలు ఎల్లప్పుడూ సరియైన టైము చూపును.




రోలెక్సు వాచ్ కంపెనీ (ఈస్టరన్) ప్రైవేట్ లిమిటెడ్

దక్షిణ భారతదేశమునకు ఏకైక డిస్ట్రిబ్యూటరు: పి. ఆర్. అండ్ సన్సు ప్రైవేట్ లిమిటెడ్, మౌంట్ రోడ్, మద్రాసు

R. 4998


Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor: S. Sambhu Prasad.



బొంబాయిలో తాజ్‌మహల్ హొటల్

ఫొటో: వి. తీతు—కర్నూలు.

# చల్లని పానీయానికి
# దీన్ని వాడి చూడండి!

'ఓవల్‌టైన్' నిజంగా వేడ దీర్చు అద్భుతమైన చల్లని పానీయము: చల్లని పాలలోగాని, పాలూ నీళ్ళలోగాని, "ఓవల్‌టైన్" వేసి, అది కలిసి పోయేవరకు దాన్ని కదపండి.

అప్పుడు మీకు చల్లని రుచికరమైన పానీయం తయారవుతుంది అందులో 'ఓవల్‌టైన్'లోని పరిశుద్ధమైన ఆహార ద్రవ్యముల యొక్కయు, ప్రధానమైన విటమినుల యొక్కయు గుణము నిలిచి వుంటుంది:




సిలోన్ రేడియోమీద ఓవల్‌టైన్ అమెచూర్ కాలక్షేపం వినండి (హిందీ-41 72 మీటర్లు) శనివారములు రాత్రి 8 నుంచి 8-30 గం లు (ఇంగ్లీషు-9520 కిలోసైకిల్సు-31 మీటరు), ఆదివారములు రా 8 నుంచి 8-30 గం లు



ప్రతి డబ్బాలో ఆరోగ్యం వున్నది

## ఓవల్‌టైన్

డిస్ట్రిబ్యూటర్లు:
గ్రాహమ్స్ ట్రేడింగ్ కంపెనీ (ఇండియా)
ప్రైవేట్ లిమిటెడ్

IV 501